# అరేబియన్‌నైట్సుకథలు

గ్రంథకర్త:

శ్రీ. యం. శర్మగారు.

మొదటికూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకులు:

పి. రంగారావు,

శ్రీసత్యానంద బుక్ డిపో, ఇన్నీసుపేట,

రాజమహేంద్రనగరము.

1935

# అరేబియన్‌నైట్సుకథలు

రచయిత

జె. యం. శర్మగారు.



ప్రకాశకులు:

పి. రంగారావు,

శ్రీ సత్యానంద బుక్ డిపో, ఇన్నీసుపేట.

రాజమహేంద్రవరము.

1935

—

 [వెల రు **1—8—0**

# ఉపోద్ఘాతము.



ఈ "అరేబియన్ నైట్సుకథ" లు చిరకాలమునకుఁ బూర్వ మారబికుభాషలో వెలువడెను. అవిక్రమముగా నితరభాషలలోనికిఁ దర్జుమాచేయబడెను. ఆంగ్లములోనికిఁ జాలమందిచే నియ్యది భాషాంతరీకరింపబడెను. వేయిన్నొక్కరాత్రులు చెప్పబడిన యీకథలలోఁ జాల రసవంతములైన కథలనే యనువాదించి, యీరీతిగా నాంధ్రభాషాసతికొక యలంకారమును సమర్పించినాను.

విజ్ఞులు గుణములనుమాత్రమే గ్రహింతురుగాక.

విధేయుఁడు,

శర్మ—

నందమూరు,

27—2—35.

# విషయసూచిక.

—:0:—

ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః.

# అరేబియన్‌నైట్సుకథలు

## 1 ఉత్పత్తి.



అరేబియాదేశము పెక్కుశతాబ్దములనుండి పారశీకులచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఆదేశమునేలిన మహీపతికిరువురు సుతులు జన్మించిరి. ప్రథమతనూభవుని నామధేయము షరియార్, ద్వితీయ పుత్రునిపేరు షాజినాను. వారిరువురు నవమోహనాకారులు. శౌర్య సాహసోపేతులు. రాజ్యపరిపాలన రహస్యములెఱింగి యిర్వురును ప్రమోదకరంబుగఁ బరిపాలనమొనరించుచుఁ, బరిపంథిరాజ్యములపై దండెత్తి యనేకసంగ్రామముల నొనరించి, రాజ్యమును తండ్రి పరమ పదించినపిదప, యగ్రజుండైన షరియారు, షాజినాను తార్తారురాజ్యాధి నాథుని గావించెను. షాజినాను 'సమర్ ఖండ్' నగరమును ముఖ్య పట్టణముగాఁ జేసికొని, రాజ్యమేలుచుండెను.

కొలఁది సంవత్సరములు గడచెను. షరియారు షాజినాను లొకరినొకరు చూచుకొనలేదు. ఇరువురకు నెప్పుడు కలిసికొందమా యను కుతూహలము మెండుగానుండెను. అగ్రజుండైన షరియారు సోదరుని బిలిపించు తలంపుకలవాఁడై, తనవజీరును 'సమర్ ఖండ్'

నగరమున కంపెను. వజీరు సమర్ఖండ్ నగరమును సమీపించి, నగరము వెలుపల గుడారములవైచికొని విశ్రమించెను. మఱుచటియుదయమున షాజనానుం గలిసికొనుట యావజీరుని యభిలాషమైయుండెను.

వజీరునిరాకనుగూర్చి, చారులవలననెఱింగి, షాజనాను ప్రమోదపూర్ణాన్వితచిత్తుఁడాయెను. మఱునాఁటియుదయమున వజీరు షాజనానును సందర్శింపనేగెను. వజీరును వివిధములగౌరవించి, సుఖాశనాసీను జేసి, షాజనాను " ఆర్యా ! నాసహోదరుఁడు కుశలముగనున్నాఁడా ? " యని ప్రశ్నింపగా, వజీరు " రాజపతి సమా ! తమసోదరుఁడు మిమ్ముఁ జూడ నుబలాటపడుచున్నాఁడు. దయయుంచి, సాధ్యమైనంతత్వరలో బయలుదేఱఁగోరెను ". అనెను.

" రాజ్యవ్యవహారముల నయిదాఱుదినములలోఁ బరిష్కరించుకొనివచ్చెదను. మామంత్రి మీకు వలయు నుపచారములసల్పు " నని షాజనాను బదులుపలికెను. వజీరాతనిసెలవుఁగొని గుడారమునకేగెను. నిర్ణీతదినమ్మున షాజనాను పరివారసమేతముగఁ బయనమై, వజీరున్న గుడారముకడ కేతెంచెను. అప్పటికిఁ జంద్రోదయమయ్యెను. వజీరును షాజనానును జాలసేపు వివిధవిషయములఁగూర్చి ముచ్చటించుకొని, సూర్యోదయావసరమున బయలుదేఱుటకుఁ గృతనిశ్చయులైరి. షాజనాను తన శిబిరమునకేగి శయనించెను. ఆతనికి నిద్దుర పట్టదాయెను. శీతాంశుని కిరణజాలము లోకమెల్లెడల వ్యాపించియుండెను. మందానిలమువీచుచుండఁ బగలెల్లనాతడుపడిన యాయాసము నపనయించుచుండెను. షాజనాను మనోవీధి నాతనిసతి దివ్యమంగళవిగ్రహము గోచరించెను. తిరిగిచూచుట యెన్నాళ్లకోగదాయనితలంచి, యాతఁడు హఠాదూరూషుఁడై యంతఃపురమునకుఁ దిరిగివెడలెను

అంతఃపురప్రవేశమొనరించిన షాజనాను తన్నుగాంచి, భార్య విస్మయపరీతచేతస్కయగునని తలఁచెను. కాని పాపమాతఁడు భయం

కర సంఘటనము నెదుర్కొనవలసిన వాఁడాయెను. ఆతనిసతి హీనకుల సంజాతుఁడగు నొకవికృతాకారునితోఁ గూడి శయ్యాగారమున సరస సల్లాపము లాడుచుండుటఁ గాంచి, షాజినాను నిశ్చేష్టుఁడాయెను. ఆతని శరీరమాపాదమస్తకము క్రోధాగ్నిజ్వాలలఁ గ్రాఁగిపోయెను. షాజినాను సతి భర్తనుగాంచి, భయకంపితయయ్యెను. క్రోధావేశపరవశుఁడై షాజినానొరనుండి కరవాలము నీవలికిఁదీసి భార్యను, యానీచునివధించి, వారికళేబరముల దుర్గమునంటియున్న కందకమునఁ ద్రోసివైచెను. పిదప నాతఁడశ్వారూఢుఁడై గుడారమున కేగెను. పాప మతఁడానాఁటి రాత్రి యొక్కక్షణమైన నిద్రింపలేదు.

ఉదయమున షాజినాను బయలుదేఱెను. నౌబత్తుధ్వనిచేతను, పరివారమొనర్చు కోలాహలముచేతను, భూనభోంతరాళములు మఖంత మయ్యెను. షాజినాను షరియారురాజధానీనగరముఁ జేరెను. తమ్ముని రాకనుగుఱించి తెలిసికొని షరియారునగరము వెలుపలకుఁ జనుదెంచి, సుస్వాగతమొసంగెను. సహోదరు లిద్దరును జాలసేపు మాట్లాడినపిదప భోజనమొనరించిరి. ఉద్యానవనసౌధము షాజినానుకుఁ బ్రత్యేకింపఁ బడెను. నాటిసాయంసమయమున షరియారు మృగయావినోదార్థ మరణ్యమునకుఁ జనెను. షాజినాను వేటకుఁ బోవలేదు. ఉద్యానవనసౌధమున శయనించి, యాతఁడు సుధాంశుని దివ్యతేజము నవలోకించుచుండెను. కొంతసేపైనపిమ్మట షరియారు నంతఃపురసౌధమునుండి కొందఱు సుందరాంగులగు కామినులు చనుదెంచిరి. వారిశరీరములు వినీలవసనములచే నాచ్ఛాదింపఁబడియుండెను. ఆవసనములఁ దొలఁగించి, యాయుద్యానవనమునందలి సరోవరమున నాయంగనలు జలకమాడసాగిరి. పదిమందిపురుషులు మఱొకదెసనుండివచ్చి యారమణీమణులతోఁ గలిసి జలక్రీడయందుఁ బాల్గొనిరి. తదనంతరము వారందఱు నీవలికివచ్చి, పరిశుభ్రవసనముల ధరించి, సరససల్లాపములాడసాగిరి. ఆ కాంతలలో

నొకర్తుక యమూల్యదుకూలముల ధరించియుండెను. ఆమెయే మహారాజ్ఞి, షరియాసతి యని షాజినా నూహించెను. ఆమె యాయసమయమున నచట నేమిచేయునోయని షాజినాను దనదృష్టి నావైపునకే ప్రసరింపఁజేసి వేచియుండెను.

ఆమె 'మసూద్, మసూద్' యని పిలిచెను. వెనువెంటనే కురూపియగు తోటమాలివచ్చి రాజ్ఞిని ముద్దిడుకొనెను. స్త్రీపురుషులంతట చేతులుకలుపుకొని నాట్యముసల్పసాగిరి. పిదప వారెల్లరు మన్మథసంగ్రామ మొనరించిరి. షాజినా నాదృశ్యముచూచి, నిర్విణ్ణుడాయెను. తనవదినె—విశాలసామ్రాజ్యాధినాథుని యర్థాంగి—మహారాజ్ఞి యొక వికృతాంగునిఁగాంచి, యారీతిగా నవినీతిపరురాలై ప్రవర్తించుటచూచి యాతనిశరీరము కంపించినది. తనసతి యవనీతివర్తనము గాంచియే యాతఁడామెను వధించెను. ఇపుడాతఁడు వదినెగారి ప్రవర్తన కనులారఁగాంచెను. జగత్తునందలి ప్రతిస్త్రీయు నీతిబాహ్యయై వర్తించుటకు జంకదని యాతఁడు తలపోసెను.

మఱునాఁడు షరియారు వేఁటనుండి తిరిగిరాఁగానే షాజినానును గలిసికొనియెను. ఆతఁడు తన సతికావించిన దుష్కృత్యమును, తాను విధించినదానినిగూర్చి తెలిపెను. షరియారు సోదరుఁడెఱింగించిన వృత్తాంతమెల్ల నాకర్ణించి, "తమ్ముఁడా! లెస్సగాఁ బ్రవర్తించితివి. నీవుకనుక సతిని, యానీచుని వధించుటతో సరిపెట్టితివిగాని, నేనైనచో బృథ్విలోని వనితలనెల్లరఁ జిత్రవధఁజేసియుందును". అనెను—

షాజినాను "అన్నా! నీవు విస్మితుఁడవు కానక్కఱలేదు. నీ సతికూడ యవినీతివర్తనురాలే. నిన్నటిరేయి నేనుకన్నులారఁజూచినా" ననియెను. షరియార్ "ఏమి? నిజముగా నాయర్ధాంగికూడ యట్లే నీతిబాహ్యయై చరించుచున్నదా? మహారాజ్ఞికే యిట్టిపోఁగాలపుబుద్ధి

జనించెనా ? నేనునమ్మఁజాలను నమ్మజాల" ననియెను. "నేనుచూపింతును. నేఁటిసాయంసమయమున వేఁటకని బయలుదేఱి, తిరిగి యెవరును జూడకుండ యీసౌధమునఁ బ్రవేశింతము" అని షాజినాను పలికెను.

ఇరువురును మృగయావినోదార్థము గహనమునకుఁబయనమై, రాత్రికాఁగనే యుద్యానవనసౌధమును జేరిరి. సుధాకరుఁడు గగనమండలమున నసంఖ్యాక తారకాగణమధ్యమున వెలుగొందుచుండెను. నవసౌరభ సమంచితమగు మలయమారుతము వీచుచు నుల్లములఁ బల్లవింపఁజేయుచుండెను. ఇట్లుండఁగా వినీలవసనాచ్ఛాదితలైన రామలు కొందఱుద్యానారామమునఁ బ్రవేశించిరి. వారిననుసరించి, కొందఱు పురుషు లేగుదెంచిరి. ఆస్త్రీలలో మహారాజ్ఞియుండెను. ఆమె వెనుకటిరాత్రివలెనే నవమాలింగూడి భోగసాగరతరంగముల నోలలాడెను. ఆ దృశ్యమును విలోకించి, షరియా రాగ్రహావేశపరవశుఁడై యొరనుండి ఖడ్గము నీవలికిఁదీసెను.

షాజినాను, క్రోధఘూర్ణితమానసుఁడై యున్న షరియారును వారించి, "అన్నా ! తొందరపడకుము. ప్రపంచములోని స్త్రీలందఱును నీతిబాహ్యలే. మనము విచారించిన ప్రయోజనములేదు. నిశ్చలప్రేమ కీజగత్తునఁ దావులేదు. మనమొకపని చేయుదము. కొంతదూరము పయనమొనరించి, మనవలెనే దురదృష్టవంతు లెవరైన నుందురేమో చూతము. అపుడు కర్తవ్యము నిర్ణయింతము" అనెను.

షరియారు షాజినాను లిర్వురును బాదచారులై బయలుదేఱి, యుదయమగునరికి సముద్రతీరమునన్న యొకకుగ్రామముఁజేరిరి. వియత్పథమున బాలభానుఁ డుదయించెను. సాగరకూలముననున్న యున్నతమహీరుహచ్ఛాయ నాసహోదరులు కూర్చుండిరి. ఇంతలో

పయోముఖవిషకుంభమా ! నిన్ను ప్రేమించినందులకుఁ దగిన ప్రతిఫల మందితిని. ఇఁక నీతోడిసౌఖ్యముఁ జాలు" నని, యామె నురిదీయించెను. కోఁటలో నానాఁడు తానుజూచినవారికెల్లరకు నిర్దయుఁడై షరియారు మరణదండన విధించెను. స్త్రీలోకమెల్ల నవిశ్వసనీయమేయని తలంచి, షరియారు దినమున కొకరమణినిఁ బెండ్లియాడుచు మఱుచటి దినముదయమున నురిఁదీయించుచుండెను. ఈరీతిగ దేశములోని కన్యల నెల్లర కృతాంతమందిరమున కతిథులుగాఁబంపుట కాతఁడు కృతనిశ్చయుఁడాయెను. ఈదారుణకార్యము రాజ్యమెల్లెడల వ్యాపించెను. అవివాహితలగు కన్యలుగల తలిదండ్రు లెల్లరును భీతచిత్తులైరి. ప్రజానురంజకముగఁ బ్రజలనేలు ప్రభువని పేరందిన షరియారు దుష్టుఁడని యెల్లరిచే నిందింపఁబడుచుండెను. ఎల్లెడల హృదయవిదారకముగ దారుణరోదనధ్వనులు వినఁబడుచుండెను.

షరియారు వజీరున కిర్వురుకుమార్తెలు. అసాధారణరూపలావణ్యవిలసితలు—షహర్జాది, దినర్జాది యనువారలు కలరు. అవివాహితలగు నాకన్యలు భువనమోహిను లన నొప్పుచు, సుగుణోపేతలైయుండిరి. షహర్జాది తండ్రితో నొకనాఁ డిట్లనెను—

"నాయనా ! రాజ్యములోని కన్యలనెల్లర రేయికొకతెచొప్పున బరిణయమాడి వధించుచున్నాఁడు. దేశమునం దేయింటఁజూచినను, రోదనధ్వనులే వినిపించుచున్నవి. ఈదురాచారము మాన్పింపవలయును. నే నాతనిని వివాహమాడుదును".

"అమ్మాయీ ! నిన్ను మృత్యుదేవతయొడిలో నెట్లు చూచి చూచెట్లు బెట్టుదును ? ఆకోరిక విడనాడుముతల్లీ!" యనివజీ రెంతచెప్పినను, షహర్జాది వినలేదు. ఆమె పంతము వీడనందున వజీరు షరియారుకడకేగి, తమార్తెయభిలాషను దెలుపఁగా, నాతఁడు విస్మితుఁ

డాయెను. శుభదినంబున షరియారు ప్రభువు షహర్జాదినిఁ బరిణయము జేసికొనెను. వివాహమునాఁటిరాత్రి షరియారు లోకోత్తరలావణ్య విరాజితయగు షహర్జాదినిఁజూచి, విమోహితాత్ముఁడై కామకేళిం దేలెను. షహర్జాది భర్తనుద్దేశించి, “ప్రభూ! ప్రభాతమునఁ దమ యాగ్రహానలమున నేను భస్మీభూతను గావలసినదేగదా! నాసోదరి దినర్జాదికూడ యిచ్చట శయనించుట కనుమతించగోరెద” ననఁగా నాతఁడంగీకరించెను.



దినర్జాదికి వేకువఝామున నౌబత్తు నిద్రాభంగ మొదవింపగా, నామె “సోదరీ! షహర్జాదీ! నాకు నిద్ర జనించుటలేదు. తెల్లవాఱు వఱకును నేదైన యొకకథనుజెప్పు” మని యడిగెను. షరియారందులకుఁ దల నంగీకారసూచకముగఁ బంకించెను. షహర్జాది యిట్లుచెప్పసాగెను.

---

# 2 వర్తకుఁడు—భూతము.



“తొల్లి యొకానొకనగరంబున నొకవర్తకుఁ డుండెను. ఆతఁడు ధనాఢ్యుఁడు. పెక్కుమంది యుద్యోగులాతనికడనుండిరి. ఒకనాఁ డాతఁ డతిజరుగురుపనిమీఁద దూరముననున్న యొకగ్రామమునకుఁ బయలుదేఱెను. మార్గమధ్యమున నావర్తకుఁ డొకయెడారి దాఁటవలసి యుండెను. ఆతఁడా యెడారిలోఁ బయనముసల్పి, మిగులనలసిపోయి యొకచోట విశ్రమించెను. ఆతఁడు ఫలములనారగించి, దప్పికఁ దీఱు నట్లు తనకడ తోలుసంచిలోనున్న జలముఁద్రావి, ఖర్జూరపుకాయలఁ

దినుచుండునంతలో భయంకరాట్టహాస మయ్యెను. తోడనే యొక భూతము ప్రత్యక్షమై, "ఓరీ నరాధమా! నాపుత్రుని నిష్కారణ ముగఁజంపితివే. నిన్నిదే నానిశితకరవాలంబున కెఱఁగావించెద మాడు" మని కత్తినెత్తెను.

వర్తకుఁడు భయకంపితుఁడై గజగజవణకుచు "అయ్యా! నిర్మానుష్యమైన యీయెడారిలో నేను మానవునొక్కనినైనఁ గాంచ లేదే. నే నెవరిని వధించితి?" ననెను.

"ఎవరినా? నీవు కర్జూరపుఁబండ్ల నారగించి, యాగింజల నుమియుచుండ నొకగింజ నీమార్గమున నదృశ్యుఁడై పోవుచుండిన నా కుమారునికంటికిఁ దగిలెను. సుకుమారుఁడగుటచే నానందనుఁ డాబాధకుఁ దాళఁజాలక యసువులఁగోల్పోయెను. అందుచే నాకక్షనుఁ దీర్చుటకై నిన్ను వధించుచున్నా" నని ఖడ్గమును బైకెత్తుసరికి వణిజుఁడు భయాతిరేకంబున నేడ్చుచు "నోదయామూర్తీ! నాకోరికను సఫల మొనరింపుము. నేనొకసారి మాయూరున కేగి, బంధుజనులను, ప్రియ సతీసుతులను జూచివత్తు" ననెను.

ఆభూత "మెంతకాలములోఁ దిరిగివత్తు?" వని ప్రశ్నింప, నావర్తకు డొకసంవత్సరములోఁ దిరిగివత్తు ననియెను. "సరియే. నీ మాటలయందు విశ్వాసముంచి, విడిచిపుచ్చుచున్నాను. జాగ్రత్త! తిరిగి సంవత్సరానంతరము రానియెడల నిన్ను సకుటుంబముగ జంపివైతును. జాగ్రత" యని యాదయ్య మంతర్ధానము నొందెను.

వర్తకుఁడు తనస్వగ్రామమునకుఁ బోయెను. ఆతని రాకకు బంధుజనులు, భార్యాపుత్రులు సంతోషము నొందిరి. వారందఱును బ్రమోదప్రపూర్ణహృదయులై యున్నను, నాతఁడుమాత్రము విషణ్ణవద

నుఁడై యుండుటచే భార్యసమీపించి, యాతఁడేల నట్లుండెనో తెలుపు
మని కోరెను. వర్తకుఁడు భూతమువృత్తాంతము చెప్పఁగా, నాయింటి
లోనివారందఱును భూనభోంతరాళములు ప్రతిధ్వనించునట్లు విలపించిరి.

వర్తకుఁడు తనయపారభాగ్యమును భార్యాపుత్రులకును, బంధు
జనులకును బంచియిచ్చి సంవత్సరానంతరము భూతమునకు బలియగు
టకై యెడారికేగెను. అతఁడొకచోఁ గూర్చుండియుండఁగా నొకపాం
థుఁడొక యాఁడుజింకను వెంటరా వచ్చుటనాఁగి, వణిజునుద్దేశించి,
"ఓయీ! నిర్జనమై, దయ్యములు కాటపట్టైన యీస్థలంబున నేలవిశ్ర
మించితి?" వని యడుగ, నావణిజుఁడు దయ్యమువృత్తాంతము
చెప్పెను. ఆబాటసారి యాపిశాచమును జూచుటకై యచ్చోటఁ
గూర్చుండిపోయెను.

మఱికొంతసేపటికి నొకబాటసారి రెండునల్లనికుక్కలతో నచ్చటి
కేతెంచి, తానుకూడ మొదటిబాటసారివలెనే, యాభూతనాథునిఁజూచు
కుతూహలముతో నచ్చటఁ గూర్చుండెను. కొంతసేపటికి మఱొకబాట
సారి వచ్చెను. ఇంతలో పిశాచనాథుఁడు ప్రత్యక్షమై వర్తకునిఁజంపఁ
బోగా, మొదటిబాటసారి "యోభూతనాథా! నామాటనాలకింపుము
నాయుదంతము మిక్కిలి విస్మయముకలిగించునేని, నీవు సంప్రీతుఁడవై
యీవర్తకునిమన్నించి విడిచిపెట్టుము" అనెను.

ఆపిశాచములఱేని యానతిననుసరించి, మొదటిపాంథుఁడు తన
యుదంతము నిట్లనిఁ జెప్పదొడంగెను.

# 3 మొదటిబాటసారి చెప్పినకథ.

———:o:———

“ ఈశునకము నాభార్య. పండ్రెండువత్సరముల ప్రాయముగల కన్యయైయుండగా మాకువివాహమైనది. మేము చిరకాలము సంతానహీనులమైయుంటిమి. ఎన్ని వ్రతములు నాభార్యచేసినను, నేనెన్ని దానములఁ జేసినను, ప్రయోజనము లేకపోయినది. నేనొక బానిసను పెండ్లిచేసికొంటిని. ఆబానిస గర్భవతియై యొకపుత్రశిశువును గాంచినది. ఆభార్య యనినను పుత్రుఁడనినను నీమెకు ద్వేషముగ నుండెడిది. నేనొకనాఁడు గ్రామాంతరమున కేగితిని. ఆసమయమున నైంద్రజాలికవిద్యాప్రవీణయగు నీమె నారెండవభార్యను గోవుగను కుమారుని దూడగను మార్చెను. మారైతువానిని దోలుకొనిపోయి యామిష్టురాలు చెప్పినట్లు విశేషముగ హింసింపనాగెను.

గ్రామాంతరమునుండి తిరిగివచ్చి నాద్వితీయ కళత్రమును పుత్రుఁడును పరలోకగతులైరనివిని, మిక్కిలి విచారమునొందితిని. ఇట్లుండగా మాకులదేవతయగు బైరామునకు మహావైభవముగ నుత్సవముల గావించుతరుణ మాసన్నమాయెను. మాకులదేవత యావును బలిగానీయ నిశ్చయించుకొంటిని. రైతునకుఁ గబురంపగా, నాతఁడీమెచే గోవుగామార్చివేయఁబడిన నారెండవభార్యనే తెచ్చెను. ఆగోవు దృక్కులు మిక్కిలి జాలిగొలుపునవై యుండెను. నయనము దుఃఖాశ్రుసిక్తములయ్యెను. నాచిత్తమున నపుడేదో చెప్పరాని యావేదన గలిగినది. నేనాగోవును జంపవలదని చెప్పినను వినక, యీకుటిలహృదయ, రైతుచేఁ జంపించినదిగాని యాగోవు రక్తమాంసవిహీనమై కనుపట్టి మాకాశ్చర్యము గల్గించెను.

తరువాత నామె దూడను దెమ్మనెను. ఆదూడ చెంగు చెంగున గంతులువేయుచు నాదగ్గఱకు వచ్చినిలిచెను. ఆదూడయెడల నాకభి

మానము గలుగ, చంపవలదని నిష్కర్షగాఁ జెప్పితిని. మఱునాటియుద యమున రైతుకుమార్తె నాకుఁ గబురంపెను. నేనామెకడ కరుగ, నిట్లు చెప్పినది.

"ఆర్యా! నాకుఁగూడ నింద్రజాలవిద్యలోఁ బ్రావీణ్యము న్నది. మీసతి కుటిలచిత్తయై, మీరెండవభార్యను, బుత్రుని గోరూపు లుగాఁ జేసినది. మీసతినిఁ జంపించినది. మీకుమారుఁడు పూర్వపు రూపమును బొందునట్లు చేసెదను. గాని యందులకు ముందుగ మిమ్మ ర్థించున దొకటికలదు. మీకుమారుని నేను బ్రేమించియుంటిని. అత నిని నాకు వివాహముఁ జేయవలయును. దుష్టస్వభావయైయున్న మీ సతిని శిక్షింపవలయును" అనెను.

నేనందులకు సమ్మతింపఁగా, నామె మంత్రించిన జలమును దూడపైఁజల్లెను. వెంటనే ఆదూడ నాతనయుఁడుగామాఱి రయం బునఁ జనుదెంచి, నన్నాలింగన మొనరించుకొనెను. శుభముహూర్తము నిశ్చయించి, నాకుమారునకు రైతుకుమార్తెను వివాహముచేసితిని. ఇరువురు సుఖసాగరతరంగముల నోలలాడసాగిరి. కర్మవశమున నాకో డలు వ్యాధిగ్రస్తయై యసువులఁ గోల్పోయెను. నాకుమారుఁడామె కొఱకు కాందోళనమునొంది యెటకో వెడలిపోయెను. నాకోడలుచే శున కముగా మార్చివేయబడిన నాభార్య సింటికడనుంచినచో నీకెట్టి ప్రమాదములు ఘటిల్లునోయని భయమునొంది, నేను బయలుదేఱితి నాను. ఇదినాకథ" యని యామొదటిపాంథుఁడు తనకథనుముగించెను.

"నీకథ విస్మయజనకముగనే యున్నది. ఈ వర్తకుని శిక్షలో మూఁడవవంతు క్షమించితి" నని, దయ్యములఱేఁడు పలుక, రెండవ బాటసారి యిట్లనెను—

"పిశాచ చక్రవర్తీ! ఈశునకములయొక్కయు, నాయొక్కయు చరిత్రముల వినఁగోరెద".

భూతము వల్లెయన, రెండవబాటసారి యిట్లు చెప్పసాగెను.

# 4 రెండవబాటసారి చెప్పినకథ.



"నాతోనున్న యీరెండుశునకములను జూచినారా? ఈశునకములు నాసోదరులుగాని తదన్యులుకారు. అరబ్బీదేశమున నొకనగరమున మేము జన్మించితిమి. వాణిజ్యమే వృత్తిగాఁగలిగి, యపారభాగ్యము నార్జించిన మాతండ్రి తనయవసానదశలో తానార్జించినధనమున మాముగ్గురకుఁ బంచియిచ్చెను. మేము ముగ్గురమును వర్తకముఁ జేసికొనుచుంటిమి. నాసోదరు లిరువురును దూరదేశములకేగి, యట వాణిజ్యము చేయుచుండిరి. కొంతకాలమిట్లు గడచెను.

ఒకనాఁడొకమలినవసనధారి నాకడకేతెంచి, తనకేమైన నిమ్మనెను. నేను "పరమాత్ముఁడగు నల్లాను బ్రార్థించుము. ఆతఁడే మనకందఱకు భాగ్యభోగము లిచ్చువాఁడు" అంటిని.

"అయ్యో! దుర్విధి! ఈతఁడు నన్నింకను గుర్తింపకుండుట నా దురదృష్టము. ఇందుల కేమిసేయుదు?" సని, యాతఁడు పలికెను. నేనాతనివంకజూచితిని. ఆతఁడు నా మొదటిసోదరుఁడు. వాణిజ్యమున నష్టపడి, యట్టిదీనదశలో నాతఁడేతెంచెను. ఆతనిని లోనికాహ్వానించి, స్నానసదుపాయముఁజేసి, మంచిదుస్తులనిచ్చి, భోజనానంతరము నాకాసంవత్సరమునఁ గలిగినలాభములో మూఁడవభాగ మిచ్చితిని. ఆతఁడు మిక్కిలిసంతోషించెను. మఱల వ్యాపారముఁ జేసికొనుటకై యాతఁడేగెను.

మఱికొంతకాలము గడచెను. నాద్వితీయసహోదరుఁడుకూడ ధనమంతయుఁ గోల్పోయి, దారిద్ర్యానలమున కింధనమై, నాయొద్దకు వచ్చెను. ఆతనినికూడ గౌరవించి, నాలాభములో మూఁడవవంతిచ్చి,

వ్యాపారముఁ జేసికొనుమని చెప్పితిని. సరేయని యాతఁడు వెడలెను. అదిమొదలుగ నన్నువారు సముద్రయానముఁజేసి, దూరదేశములకుఁ బోయి విశేషలాభము సంపాదించుటకు రమ్మని ప్రోత్సహింపసాగిరి. అయిదు సంవత్సరములవఱకును వారిప్రోద్బలమును బాటింపనైతిని. తుదకు వారిప్రోత్సాహము మితిమీఱుటచేఁ దప్పనిసరియని తలంచి, నాభాగ్యము నొకచో నిక్షిప్తమొనర్చి, కొంతధనమును, విశేషముగ సామగ్రిని గైకొని, నౌకాయానమునకు గడంగితిని కొలఁదిదినములు ప్రయాణమొనరించి, గమ్యస్థానముఁ జేరితిమి. నాసామగ్రి సులభముగా నమ్ముడువడలైు, యపరిమితముగ లాభముఁగలిగెను. నాసోదరులు లాభమును బొందలేదు సరిగదా, కొంతనష్టముకూడ వారికిఁగలిగెను. నేను కొన్ని క్రొత్తక్రొత్తవస్తువులనుగొని, నౌకలోఁజేర్చి, భోజనముజేసి యిసుకతిన్నెలోఁ గూర్చుంటిని.

సుధాంశునికాంతి యెల్లెడలనిండి, మనోల్లాసకరముగ నుండెను. మృదుమందానిలము వీచుచుండెను. ఒకవ్యక్తి నన్నుసమీపించెను. ఆ వ్యక్తి యెవరాయని పరికించి చూచితిని. ఆమె లోకోత్తర లావణ్య విలసితయగు సుందరాంగియని గ్రహించితిని. ఆమె నాయొద్దకువచ్చి "ఆర్యా! నేను కడుపేదస్థితియం దున్నదానను. నన్ను సంరక్షింపఁ గోరెద" ననెను.

ఆమె సౌందర్యము నన్నాకర్షించెను. ఆమెను బెండ్లియాడ దలంచి, నాకోరిక నామెకుఁ దెలుపఁగా నామె యంగీకరించెను. ఆమెకు విలువైన చీరలనిచ్చితిని. మేమిర్వురము నానందజలధితరంగ మాలికల దేలియాడితిమి. నాకులాభముగల్గుటచే నాసోదరులు మత్సరగ్రస్తులై యుండిరి. మానౌక బయలుదేరెను. రాత్రివేళ నన్నుఁగడదేర్ప దలంచియుండిన నాసోదరులు నీట నన్నును నాసతిఁ ద్రోసివైచిరి. దేవ తలనలె మానవాతీతములగు కార్యములఁ జేయఁజాలిన నాసతి నన్ను

రక్షించెను. మేమిర్వురమును తీరమునుజేరితిమి. అదియొకదీవి. ఆదీవిలో నొకమందిరమును జేరితిమి. నాసోదరుల కౌటిల్యమున కెంతయు క్రుద్ధయైయున్న నాసతి "ప్రియా! నేను దేవతను. నీసౌందర్యమును జూచి విమోహితనై వచ్చితిని. నీయన్నలు తమకుత్సితమునకుఁ దగిన ఫలము ననుభవింపఁగలరు" అని మాయమయ్యెను. నేనా మఱుక్షణమున స్వగృహమున నుంటిని. రెండు నల్లశునకములు నాకెదురయ్యెను. ఇంతలో నాసతి ప్రత్యక్షమై తానే; నాభ్రాతలను శునకములుగా మార్చితిననియు, నయిదు వత్సరముల యనంతరము వారు పూర్వపు రూపముల నందెదరనియుఁ దెలిపెను. అయిదు వత్సరములు బూర్తియైనవి. ఆదేవతను వెదకుటకై బయలుదేఱితి" నని రెండవమార్గస్థుఁడు తనకథను ముగించెను.

మూఁడవబాటసారి తనజీవితవృత్తాంతమునే తెలిపెను. ఆముఫ్వురిచరిత్రలునుగూడ తనకు విస్మయానందములు గలిగించుటచేఁ బ్రముదితాత్ముఁడై, వర్తకునిచంపకవిడిచిపెట్టెను. వర్తకుఁడు ముప్పురు బాటసారులకును బెక్కు కృతజ్ఞతావందనము లర్పించి, తనగ్రామమునకుఁ బోయెను.

## 5 అల్లాయుద్దీను మాజిక్‌లాంప్.

చైనాదేశము సౌందర్యమునకు, వైభవమునకు నిలయమని చరిత్రప్రసిద్ధిఁ గాంచియుండెను. ఆదేశమునగల నగరములలో నత్యంత సుందరమైన పురమని చెప్పఁదగిన పికెన్నునగరమున ముస్తఫాయను దర్జీయొకఁడుండెను. అతఁడు సంపాదించు స్వల్పద్రవ్యము కుటుంబ పోషణమున కేమాత్రము చాలకుండెను. ఆదర్జీకి అల్లాయుద్దీనను

పుత్రుడు కలఁడు. అతఁడు పెద్దవాఁడైనను తలిదండ్రులమాటవినక, నిరంతరము నల్లరిపిల్లలతోఁగూడి యాటపాటలయందే మగ్నుఁడై కాలముఁగడపుచుండెను. కుమారుఁడు తనకేవిధమయినను దోడ్పడుట లేదని ముస్తఫా యాందోళనముఁనొంది, రోగగ్రస్తుఁడై మృతినొందెను.

తండ్రి మరణానంతరముఁగూడ నల్లాయుద్దీను బుద్ధిమంతుఁడు కాఁడయ్యెను. అతఁడు పదునాలేండ్ల ప్రాయముఁగలవాఁ డాయెను. ఒకనాఁడాతఁడు వీధిలో నాడుకొనుచుండఁగా నాఫ్రికాదేశమునుండి వచ్చిన యొకమాంత్రికుఁడు చూచెను. అతినిశితబుద్ధి సంపన్నుఁడని గ్రహించి, యల్లాయుద్దీను నామంత్రవేత్తపిలిచి " నాయనా! నీవెవరి తనయుఁడ?" వని ప్రశ్నించెను. "ముస్తాఫాకుమారుఁడను. అతఁడు మృతినొందెను. నేనును నాతల్లియుమాత్రమే జీవించుచున్నా" మని యల్లాయుద్దీను బదులుపలికెను.

"అయ్యో! నాసోదరుఁడు మృతినొందెనా? సరే నీతల్లినినేను చూడరాదు. తేపుచూచెదను. ఈధనము నా మెచేతికి" మ్మని, యామంత్రవేత్త యల్లాయుద్దీనునకుఁ గొన్నివరాలు నిచ్చెను. అతఁ డానంద కందళితవదనాంబురుహుఁడాయెను. తల్లికడకుఁబోయి జరిగిన దంతయుఁ జెప్పెను. మఱునాఁడుకూడ మాంత్రికుఁ డల్లాయుద్దీనునకు గొన్నివరాలనొసంగి, యారాత్రి వారిగృహమునకు నేఁగెను. అతఁడు "అమ్మాయీ! ముస్తాఫా నాతమ్ముఁడు. నేను నలుబదిరెండువత్సరములకుఁ బూర్వమే ఆఫ్రికాఖండమునకు వెడలినాను. అనేకదేశములందు నివసించి, యింద్రజాలవిద్యలోఁ ప్రత్యేకకృషి సల్పినాను. ఇక నటనుండజాలక తిరిగివచ్చినాను. అల్లాయుద్దీ నిపుడేమిచేయుచున్నాఁ?" డని యడిగెను.

"అల్లాయుద్దీనునకు సంసార భారమింతయుఁ దోఁచలేదు. ఏమిచేయుటకునుదోఁచకున్న" దని యామె సమాధానముచెప్పెను.

"అయ్యో! నాయనా! సంసారబాధ్యత గుర్తింపకుండ నీవిధముగా సోమరివై చరింపనగునా! నీకొకయంగడి నేర్పాటుచేయుదును. ఇఁక నాటలఁగట్టిపెట్టుము. బజారులోని వర్తకులందఱితోను నీకు బరిచయము కల్గింతును. నీకు మంచిబట్టలు కొందునురమ్ము" అని, యామాంత్రికుఁ డల్లాయుద్దీనును బజారునకుఁ గొంపోయి విలువైన వస్త్రములను గొనిపెట్టెను. మఱునాఁటి యుదయమున నామంత్రవేత్త యల్లాయుద్దీనుతో నగరము వెలుపలనున్న రమణీయోద్యానవనములకుఁ గొంపోయెను. పిమ్మట వారొక మైదానమునుజేరిరి. నిర్జనమైన యాప్రదేశ మల్లాయుద్దీనునకు భీతిఁగల్గించెను. అచ్చట రెండుపర్వతములుండెను. ఆపర్వతములమధ్యకు వారేగిరి. మాంత్రికుఁడు చిన్నచిన్న చిదుకులనేఱి, మంటజేసి యేదోసుగంధద్రవ్యము నందుంచి, కొన్ని మంత్రముల నుచ్చరించెను. పెద్దఱాయి యొకటితొలఁగి, భూమిలోని కొక సొరంగమార్గము గాన్పించెను. సొరంగప్రవేశమున కనువుగాఁ గొన్నిసోపానము లుండెను. మాంత్రికుని యానతిననుసరించి యాతఁడాశిలను బ్రక్కకుఁ ద్రోసెను.

మంత్రవేత్త "అల్లాయుద్దీన్! శ్రద్ధగా నాపలుకులనాలకింపుము. ఈయుంగరమును వ్రేలికిపెట్టుకొని, సొరంగమార్గమున లోనఁ బ్రవేశింపుము. కుడ్యములపై, జేయివేయకుము. తిన్నగా నారామము లోనికిఁబోయి, యచ్చటగూటిలోనున్న లాంపును దీసికొనిరమ్ము. వలయుచో నచ్చటనీకుఁ గాన్పించువృక్షముల ఫలములనుగోసికొనిరమ్ము" అని, యుంగరమిచ్చెను. ఆయుంగరమును ధరించి, యాతఁడు తిన్నగా లోనికేగి, లాంపునుదీసికొని, "యిందేదైన మాహాత్మ్యముండితీరు" నని భావించి, తిరిగివచ్చుచు "బాబా! నీచేయినందీ" మ్మనెను. మంత్రవేత్త "లాంపుసిట్లి" మ్మని తొందరచేసెను. అనుమానపీడి

తుఁడై యల్లాయుద్దీనా లాంపునీయక, చేయినూఁతగా నిమ్మనెను. మాంత్రికుఁ డాగ్రహమునొంది, యచ్చటరగులుచున్న యగ్నిలో నేదియోయుంచి, మంత్రముల నుచ్చరించెను. ఆసొరంగముపై మూఁతగాయున్న శిలతో నదిమూసికొనిపోయెను. అల్లాయుద్దీనా యంధకార బంధురమైన సొరంగములో నొక్కదినముండెను. పండ్లేమైన నున్న వేమో చూతమని, యాతఁడుద్యానవనములోని కేగెను. ఆచెట్లపై నున్నవి ఫలములుకావు. వజ్రములు కొన్నిఁటి నాతఁడుసేకరించి తిరిగి సొరంగములోనికివచ్చి, యేమిచేయుటకునుపోఁచక చేతులునలుపుకొను చుండగాఁ రాపిడినలన నాయుంగరి ప్రభావమున నొకరాక్షసుఁడు ప్రత్యక్షమై "నేనాయంగుళీయమునకు బంటును ? నీ కేమికావలయు " నని యడిగెను.

"నా కేమియునలదు. నాయింటిలో నన్నువిడువు మంతియే చాలు " ననెను. వెనువెంటనే యల్లాయుద్దీను లాంపుతోఁగూడ నింటిలోనుండెను. ఆతనింజూచి తల్లి "నాయనా ! నిన్నుకనబడక నాకు మిక్కిలి యారాటముఁ గలిగించితివి. ఎచ్చటనుంటి ? " వని ప్రశ్నించెను.

అల్లాయుద్దీను జరిగినదందయుఁ దెలిపెను. ఆఁకలిగనున్నందునఁ దనకేమైనఁ బెట్టుమని యాతఁడడిగెను. "నాయనా ! కొంచెము రొట్టి యున్నది. తిందువా ? " యని తల్లి యడిగెను— "అట్లయిన నాలాంపును బరిశుభ్రముగాఁ దుడిచియిమ్ము " అని అల్లాయుద్దీననెను. ఆమె లాంపును దుడుచుట కుపక్రమించినంతనే, లాంపుసేవకుఁడైన రక్కసుఁడు ప్రత్యక్షమై "ఏమికావలయు ? " ననెను. ఆతనితల్లి మూర్ఛనొందెను. అల్లాయుద్దీను "ఆర్యా ! మాకాకలిగనున్నది. ఆహార పదార్థములఁ దెచ్చిపెట్టు " మనెను. ఆయుత్తరక్షణమున విశాలమగు

రజితపాత్రమున షడ్రసోపేతములగు భోజనము లిరువురకుఁ జాలిన వమర్పఁబడియుండెను. తల్లి సేదఁదేఱెను. ఇరువురును గడుపార భుజించిరి.

మఱునాఁ డల్లాయుద్దీనా రజితపాత్రను విక్రయించుటకై యంగడివీథికిఁ బోయెను. ఒక యూధుఁ డా పాత్రనుగొని, యొక బంగారు నాణెమొసంగెను. అట్లే యల్లాయుద్దీనా యూధునకు నాలుగైదు పాత్రల నమ్ముటచూచిన యొక కంసాలి యాపళ్లెరముల నొక్కొక్కటి యఱువది బంగారు నాణెములకుఁ గొనసాగెను. రాక్షసుని సాహాయ్యమున వెండిపాత్రలు యెడతెగక లభించుచుండెను. అల్లాయుద్దీ నైశ్వర్యవంతుఁడాయెను. బుద్ధిగలిగి, మెలఁగుచుండెను. పెద్దవారితో సహవాసముఁ జేయుచుండెను. ఇవ్విధమునఁ గొన్నివత్సరములు గడచెను.

జగదేకవిఖ్యాత సౌందర్యవతియగు సుల్తాను కుమార్తె బద్రవులు బాదూరు స్నానమందిరమునకుఁ బోవునుగాన, నంగడివీథి మూసివేయఁబడి యుండవలెనని చాటింపఁబడుటచే నాఁడు బజారు నిర్మానుష్యముగనుండెను. ఆమెను జూచు కుతూహలముతో నల్లాయుద్దీనా స్నానమందిరములో రహస్యముగ దాగియుండెను. బద్రావుల్ బాదూరు సఖీజనపరివృతయై, యాభవనమున కరుదెంచెను. ఆమె ముసుగు తొలఁగించెను. ఆపె యసమాన రూపలావణ్యములఁగాంచి, అల్లాయుద్దీను విమోహితుఁడాయెను. ఎట్లయిన నామెను వివాహముఁ జేసికొనవలయునని యాతఁడు కుతూహలపడెను.

అతఁడు తల్లితోఁ దనయుద్దేశము నెఱింగించెను. ఆమె పకాలున నవ్వి "అయ్యో! ఎంత వెఱ్ఱితలంపుతో నున్నాఁడవు నాయనా! అసూర్యంపశ్యయైన సుల్తాను తనయయేడ? నీవేడ? ఇరువురమధ్య నెంతయంతర మున్న?" దని యామె పలికెను.

అమ్మా! రక్కసుని సాహాయ్యమున నేను సుల్తాను భాగ్యము కంటె వేయిరెట్లభాగ్యము సంపాదింతును వెలలేనిరత్నములు మనకడ నున్నవి. సుల్తానునకవి కానుకగానొసంగి, నాకోరికను దెలిపిరమ్ము".

ఆట్లేయని, యామె మఱుచటి యుదయమున నొక రజితపాత్రమున నల్లాయుద్దీను సొరంగమునుండి తెచ్చిన యమూల్యరత్నముల నుంచి, తానొక మిక్కిలి విలువగల చీరధరించి, యాపళ్లెరమును వస్త్రాభ్యంతరమున నుంచుకొని, బయలుదేఱెను. న్యాయాన్యాయములఁ బరిష్కరించుటలోఁ దీఱికలేకుండనున్న సుల్తానుతో సంభాషించుట కవకాశములేక యాఱుదినములు తిరిగి యింటికి పోవుచుండెను. దినదినము నల్లాయుద్దీను కుతూహలము ద్విగుణీతమగుచుండెను. ఆమెను సుల్తాను జూడకపోలేదు. ఏడవనాఁటి యుదయమున నామె రాఁగానే, సుల్తానామెను బిలిచి "ఓ నారీమణీ! నీ వనుదినమువచ్చి, వెడలిపోవుచున్నావు. నీ కేమికావలయు?" నని యడిగెను.

ఆమె "మహాప్రభూ! నేఁగోరునది మహాసాహసమని తలంచి, తమకుఁ దెలుపుటకు భయపడుచున్నాను. తాము నన్ను క్షమింతునని వాగ్దానము చేయుచోఁ జెప్పెద" ననెను.

సుల్తాను "భయమేమియును లేదు. అదియేదో చెప్పు" మనెను. ఆమె తనకుమారుఁడు సుల్తాను తనూభవయెడ ప్రేమగలిగి యున్నాఁడని చెప్పెను. సుల్తానేమియుఁ గోపగింపక "నీవస్త్రములో నున్నదే?" మని ప్రశ్నించెను. ఆమె రజితపాత్రను సుల్తానుదగ్గఱ నుంచి, "వీనిని నానందనుఁడు తమకుఁ గానుకగా నంపినాఁ" డనెను. ఆ రత్నములు బాలసూర్యప్రభాభాసమానములై, కనులు మిరుమిట్లు గొల్పుచుండెను. ఇట్టి యమూల్యరత్నములఁ గానుకగాఁ బంపఁజాలిన యల్లాయుద్దీను భాగ్య మింకెంతయుండునో యనితలంచి, "నీకుమారు

నకు నా తనయనిచ్చి పరిణయము సేయుటకు నాకభ్యంతరములేదు ఆతనిం జూడవలయునని యున్నది. ఒకసారియిటకుఁబంపుము. ఏమి వజీర్ ! ఏమందు ? " వనెను

వజీరు కర్తవ్యవిమూఢుఁ డాయెను. సుల్తా నంతకుమున్ను దన దుహితను వజీరు కుమారునకిచ్చి వివాహముఁ జేయుదునని పలుతడవలు చెప్పియుండెను. ఆ వజ్రములవీక్షించి, సుల్తాను దనయభిప్రాయము మార్చుకొన్నందున నాతఁడు కోపమునొంది " నాకుమారుఁడు కూడ నిట్టిరత్నములఁ దేఁగలఁ " డనెను——

" ఎన్నిదినములలోఁ దేఁగలఁడు ? ".

" మూఁడు మాసములలోఁ దేఁగలఁడు ".

వజీరు కోరికపై సుల్తా నల్లాయుద్దీను తల్లితో మూఁడుమాసములు గడచినపిమ్మట రమ్మనెను. ఆమె యింటికిఁబోయి, కుమారునితో నా విషయముఁ జెప్పెను ఆతఁ డత్యధికానందభరితాత్ముఁ డాయెను. ఒక నెలరోజులు గడచెను. ఒకనాఁ డల్లాయుద్దీనుతల్లి యంగడివీధికిఁ బోయెను. అంగడులన్నియు మూయఁబడియుండెను. కారణ మేమని యడుగ నొకవర్తకుఁడు " అయ్యో ! నీకింకను దెలియనే తెలియదా ? సుల్తాను కొమరితకును, వజీరు కుమారునకును నేఁటిరాత్రి వివాహ " మనెను. ఆమె నిర్విణ్ణయై, యల్లాయుద్దీనుతో నామాట చెప్పెను. ఆతఁడు చింతాక్రాంతస్వాంతుఁడై, భోజనానంతరము గదిలోనికేగి, లాంపుసేవకుఁడగు రక్కసుని రావించి, " ఓయీ ! చాలముఖ్యమగు కార్యముఁ జేయవలయును. నేఁటిరాత్రి సుల్తాను కూఁతురు వివాహమట. భార్యాభర్త లిర్వురును శయ్యాగృహములోనికిఁ జనినపిదప, నయ్యిరువురలో రాకుమార్తె నీశయ్యపై నుంచి, యాపె భర్తనుమాత్ర

మెచ్చుటనో చలిలో బాధపడునట్లు చేయవలయును. వేకువఝామున నయ్యిరువురనుగూడ మఱల నట ప్రవేశపెట్టుభార్యము నీయదియే సుమా!" యనెను.

రక్కసుఁ డటులనేయని యంతర్ధానమయ్యెను. కొంతసేపటికి రాక్షసుఁడు సుల్తాను కుమార్తె నల్లాయుద్దీను శయ్యాగారమున నుంచెను. ఆమె భయపడెను. అల్లాయుద్దీను "నీకేమియు భయములేదు. నీయెడ విమోహితుఁడనై యిట్లొనరించినాను". అని ఖడ్గము నిరువురకు మధ్యగానుంచి, శయనించెను. వేకువఝామున రక్కసుఁ డామెను భర్తను, సుల్తా నంతఃపురముఁ జేర్చినాఁడు. ప్రభాతమున సుల్తాను భార్య కుమార్తెనుబిలచి, "అమ్మా! నీభర్తతో రాత్రి సుఖముగా గడపినావా?" యనెను. 'లే' దని, రాత్రి జరిగినదంతయు నామె చెప్పెను. ఆమె విశ్వసింపలేదు. రెండవనాఁడుకూడ నట్లేజరిగెను. వజీరు కుమారుఁడు తనకేమియు సుఖములేదనియు, నా వివాహము నెట్లయిన రద్దు చేయించుమనియుఁ గోరెను. బద్‌రాఫుల్ బాదూరు కూడ తలిదండ్రులతోఁ దనకావివాహము సౌఖ్యప్రదముగా లేదనిచెప్పెను.

వజీరును సుల్తానును సంప్రదించుకొని, యావివాహము రద్దు చేసిరి. నగరమునందెల్లెడల చెలరేగుచున్న వాద్యములన్నియు నాపు చేయఁ బడియెను. వివాహకోలాహల మిట్లాకస్మికముగ నాపుచేయఁ బడుటకుఁ గలకారణము నల్లాయుద్దీనుదక్క తదన్యులెవ్వరును యెఱుంగరుగదా!

గడువుదినమున నల్లాయుద్దీనుతల్లి, సుల్తానుదర్శనముఁ జేసెను. "నాకీనికి, వైభవమునకుఁ దగురీతినిఁ గానుకలంపినచో నాతనయ నల్లాయుద్దీన నకిచ్చి పెండ్లిచేయుట కెట్టియభ్యంతరమును లేదు" అని సుల్తాను పలికెను. ఆమె యింటికి వెళ్ళి కుమారునితో నదిచెప్పెను. కనుజని ప్రభాతమున నట బంది ధవళవస్త్రధారులు హయారూఢులు

నిలిచియుండిరి. అల్లాయుద్దీనుతల్లి పట్టుచీర ధరించెను. ఆమె ముందుగా నడచుచుండెను. ఆ అశ్వికుల కరములందు నవరత్నయుక్తములైన రజితపాత్రలుండెను. అహాయారూఢుల ముందొకనాయకుడుండెను. వారందఱును సుల్తానుసౌధముఁజేరిరి. కానుకల సమర్పించిరి. అల్లాయుద్దీను తల్లి తీసుకొనివచ్చిన రజితపాత్రలోనుండిన నవరత్నములు ధగద్ధగాయమానముగఁ బ్రకాశించుచుండెను. ఆరత్నములఁ గాంచి, సుల్తాను మహదానందపరవశుఁడై యుండెను. అతఁ డామెనుద్దేశించి, "నీ కుమారునొకసారి చూడవలయునని యున్నది. పంపించు" మనెను.

ప్రముదితాత్మయై, యామె తనయునితో జరిగినదంతయుఁ జెప్పెను. అతఁడు రక్కసునిబిలచి "నాకు ధరించుట కమూల్యములైన దుకూలములు కావలయును. ఉత్తమశ్రేణికిఁజెందిన సుందర ధవలాశ్వమును సుసజ్జిత మొనరించి యుంచుము" అనెను.

అతఁడు పన్నీటజలకమాడెను. అతనిశరీరమునకు స్వర్ణచ్ఛాయ కలిగెను. స్నానానంతరము చీనిచీనాంబరముల ధరించి, యుత్తమాశ్వారూఢుఁడు నలుబదిమంది సేవకులు వెంటనరుదేర, ముందుగాఁగొందఱు మనోహర వాద్యములు మ్రోయించుచుండ రాజసౌధమునకేగెను. నవమోహనాకారుఁడగు నల్లాయుద్దీనుంగాంచి, సుల్తాను బ్రహ్మానంద భరితాత్ముఁడై విందొనరించి, "అల్లాయుద్దీన్ ! నేఁడు వివాహము చేయుదునా ?" యనెను.

"వలదు. మేమిర్వురము వసించుటకై యొకసౌధము నిర్మింతును. విశాలమగు స్థలమేదైన యున్నదా ?".

సుల్తా నొకమైదానముఁజూపెను. శుభముహూర్తము మఱునాఁటి రాత్రి నిశ్చయింపఁబడెను. అల్లాయుద్దీ నింటికిఁబోయి, లాంపునకు రాపిడికల్గింప, రక్కసుఁడు ప్రత్యక్షమయ్యెను. అతని కోరిక ప్రకారము రక్కసుఁ డామైదానమున బ్రహ్మాండమగు భవనము

నిర్మించెను. ఆ సౌధసౌందర్యము వర్ణనాతీతమైయుండెను. సౌధశిఖరములు మిన్నంటుచుండెను. వాతాయనములు విచిత్ర వర్ణవిరాజితములైన యద్దములతో నిర్మింపఁబడెను. ఒక్కెడ హంసతూలికాతల్పములు, మఱొకచోట వివిధపానీయములు, మఱొక్కెడ సుగంధబంధురములైన పుష్పలతలు కలిగి, యత్యంతరమణీయముగనున్న యాభవనమునుజూచి, సుల్తాను విభ్రాంతుఁడాయెను. ఒక్కరాత్రిలో నట్టిభవనము నెట్టియప్రతిమ ప్రతిభాఢ్యులగు శిల్పులు నిర్మించిరోయని యాతఁ డాశ్చర్యమునొందెను. వజీరు మత్సరగ్రస్తుఁ డాయెను.

నాఁటి సాయంకాలమున సుల్తాను దుహితకును, నల్లాయుద్దీనునకును వివాహము మహావైభవముగ జరిగెను. రక్కసుఁ డొకపెద్ద విందున కేర్పాటుచేసెను. ఆ విందారగించినవా రెల్లరు సెభాసని యల్లాయుద్దీనును మెచ్చుకొనిరి. సుల్తాను తనయతోఁగూడి, యల్లాయుద్దీను సంభోగజలధితరంగముల నోలలాడెను. ఒకనాఁడాతఁడు మసీదునకు, మఱొకనాఁడు వేఁటకుఁ బోవుచుండెను. శత్రురాజ్యముపై నాతఁడు దండెత్తి, వారలనోడించి, రాజ్యముసు వశపరచుకొని, శౌర్యధనుఁడని కీర్తినొందెను.

కొలఁదివత్సరము లిట్లుగడచెను. నిరాశుఁడై, యాఫ్రికాకుఁ దిరిగి వెడలిపోయిన మాంత్రికుఁ డొకనాఁ డంజనమువేసి, అల్లాయుద్దీను మాజిక్ లాంపుసహాయమున మహాభాగ్యభోగముల ననుభవించుచుండెనని గ్రహించి, క్రోధావేశవివశుఁడై తిన్నగాఁ జైనాదేశమునకువచ్చి, యాలాంపు నెట్లయిన సంగ్రహింపఁ గృతనిశ్చయుఁడాయెను. అల్లాయుద్దీను మృగయావినోదార్థి మరణ్యమునకుఁ జనెనని, యాతఁడు వినెను. బజారునకుఁబోయి యాతఁడు కొన్ని క్రొత్తలాంపులనుగొని, "ప్రాఁతలాంపులకుఁ గ్రొత్తలాంపు" లని కేకలిడుచు నల్లాయుద్దీను సౌధమున్న వీధిలోఁ దిరిగెను. ఆ కేకను సుల్తాను తనయ బద్రావుల్

బాదూరు విని, చెలికత్తెను బిలిచి “మిద్దమీఁద నొక ప్రాఁతలాం పున్నది. అది యా కేకలిడువాని కిచ్చి, క్రొత్తలాంపును దీసికొను” మనెను. అల్లాయుద్దీను నింతటి మహోన్నతవైభవస్థితికిఁ గొనితెచ్చిన, రాక్షసుఁడు సేవకుఁడై యున్న లాంపుమాహాత్మ్య మెఱుఁగక బద్రావుల్ బాదూరు క్రొత్తలాంపును గైకొని, యా ప్రాఁతలాంపు నిచ్చివేసెను.

మాంత్రికుఁడు ప్రాఁతలాంపును దీసికొని, యానందకందళిత వదనాంబురుహుఁడై, నగరము వెలుపలనిర్మానుష్యమై యున్న ప్రదేశమునకేగి, యా లాంపుబంటైన రాక్షసుని సాక్షాత్కారమునొంది, “అల్లాయుద్దీను సౌధముపై నేను నిలుచుండిన పిదప, నాఫ్రికాకుఁ గొనిపొ” మ్మనెను. మాంత్రికుఁడు లాంపును వస్త్రాభ్యంతరమున నిడుకొని, యల్లాయుద్దీను సౌధముపై నిలిచెను. వినీలాభ్రవీధినున్న తారకవలె నా గవ్యభవనము మఱుమాయమయ్యెను.

తెల్లవాఱెను. వజీరల్లాయుద్దీను భవనము మాయమైయుండుటఁజూచి, శీఘ్రగమనమున సుల్తానుకడ కరిగి “ప్రభూ! నేను వలదని చెప్పలేదా? అల్లాయుద్దీ నైంద్రజాలికుఁడు. ఆతనిసౌధము, మీ తనయకూడ మాయమైరి. సుల్తాను చూచెను. సౌధములేదు. క్రోధఘూర్ణితమానసుఁడై యాతఁడు భటులనుబిలిచి “అల్లాయుద్దీనును వెంటనే గొనిరం” డని యాజ్ఞాపించెను.

వేటనుండి తిరిగివచ్చుచున్న యల్లాయుద్దీనునకు భటులు సుల్తానాజ్ఞను దెలిపిరి. ఆతఁడు డోలాందోళితచిత్తుఁ డాయెను. సుల్తా నాతనిఁజూచి “ఓరీ వంచకుఁడా! నీ సౌధమేది? నాకుమార్తె యెక్కడ? నిజముచెప్పు” మని నిర్బంధించెను. అల్లాయుద్దీ నటుచూచెను. తన

భవనము నిజముగా మాయమైయుండెను. కారణమాతఁ డరయఁ జాలకుండెను.

"ప్రభూ ! నాకు మాసముదినములు గడువీయుఁడు. ఈరహస్యము భేదించి తమకుమార్తెను జూపెదను లేనిచోఁ జిత్రవధగావింపుఁ" డని యాతఁడు వినయవినమితాంగుఁడై పలికెను—

"సరే ! నీవు కోరిన ప్రకారము మాసము వ్యవధియిచ్చితిని. ఆనాఁడు రాకున్నచో, నీవెచ్చటనున్నను వెదకించి, చంపింతు" నని సుల్తాను బెదరించెను. అల్లాయుద్దీ నింటికిఁబోలేదు. నిస్పృహుఁడై నదీ తీరమున కేగెను. సుల్తానువలనఁ దనకెట్లును మరణదండనము తప్పదని తలంచి, నిరాశుఁడై యసువులఁ బాయఁదలంచెను. ఇంతలో నాతని కాలుజారి, క్రిందకుజారెను. అప్పుడాతని వ్రేలినున్న యుంగరమునకు రాపిడికల్గుటచే రక్కసుఁడు ప్రత్యక్షమై అల్లాయుద్దీను నదిలోఁ బడి పోకుండ రక్షించెను ఆతఁడు దానవు నుద్దేశించి "నామేడను గొని రాలేవా ?" యని ప్రశ్నించెను.

"మహాత్మా ! లాంపునకు బంట్రైన రక్కసుఁడు నాకంటె మిక్కిలి బలాఢ్యుఁడు. ఆతనిని జయించుట దుస్తరము కావున నేనా కార్యము నిర్వహింపఁజాలను".

"అట్లయిన నన్నాఫ్రికాఖండమునకు గొంపొమ్ము".

కొలఁదినిముసములలో నల్లాయుద్దీ నాఫ్రికాలోఁ దనసౌధసమీపమున నుండెను. అప్పటికి జగము గాఢాంధకారబంధురమై యుండెను. ఆరాత్రి యాతఁడొక యింటియరుగుపై నిద్రించెను. మఱునాఁటి యుదయమున నాతఁ డెట్టయెదుటనున్న తనసౌధమునుగుర్తించి, నిష్ప్రాసందసరిన శోఁడై లోనికేగి, తనప్రేయసి యున్న గదిలోనికిఁ బోయెను. ఆమె భర్తనాలింగనమొనరించుకొని "నాథా ! ఇదియేమి విపరీతసంఘ

టనము ? సౌధమొకదేశమునుండి, మఱొకదేశమున కెట్లువచ్చినది ? ఈమాంత్రికుఁడు తన్ను పెండ్లియాడుమని వివిధముల నిర్బంధించుచున్నాఁడు. రోజువిడిచి రోజువచ్చి కలసికొనుచున్నాఁడు. మీరెట్లు వచ్చినారు ?" రని ప్రశ్నలవర్షముఁ గురిపించెను.

అల్లాయుద్దీను "ప్రియసీ! నాలాంపును దీసితివా ?" యని యడుగ నామె నాశ్చర్యముగ "ప్రాణేశ్వరా! నేనే యావివేకపుఁ బని చేసినాను. ఈదుర్మార్గుఁడే ప్రాతలాంపులకుఁ గ్రొత్తలాంపు లిచ్చెదనని కేకలిడుట నాలకించి, యీలాంపునిచ్చి క్రొత్తలాంపును గైకొంటిని. ఆలాంపిప్పు డాతనియొద్దనే యున్నది. నేను మాదినా" ననెను.

అల్లాయుద్దీ నాలోచించి, "సఖీ! నేఁడు నేనుచెప్పినచొప్పునఁ బ్రవర్తింపుము. రేపే మనదేశమున కేగుద" మని పలికి, యంగడివీధిలోనికరిగి యొకచో విషముఁగొనివచ్చి, "ఈవిషమును సారాయమునఁగలిపి, యాతఁడువచ్చినప్పు డిచ్చకములు నచ్చఁగఁబలికి, యీమధ్యము నెట్లయిన సేవింపఁజేయుము" అని, వెడలిపోయెను.

నాఁటిసాయంసమయమున మాంత్రికుఁడు వచ్చునరికి బద్రావుల్ బాదూరు విషణ్ణవదనయై యుండక, దరహాసితవదనారవిందయై యుండెను. చక్కని పట్టుచీరధరించి, యాభరణభూషితయై, భూలోకరంభవలెనున్న యాసుల్తానుకుమార్తెనుగాంచి, మాంత్రికుఁడు విమోహితుడై పోయెను ఆమె యద్వితీయసౌందర్యోజ్జ్వల ముఖమండలమునాతఁడు తదేకదృష్టితో వీక్షింపసాగెను. "ఇదియేమి ? నాయదృష్టము నేఁడు ఫలించెనాయేమి ? నీవు నేఁడేల సుముఖివై యున్నా ?" యని యాతఁడు ప్రశ్నింప, నామె యిట్లులనెను—

"ఆర్యా ! నిన్నఁటివఱకు నాచిత్తము విచారాయత్తమై యున్న మాట వాస్తవము. ఇఁక నెన్నాళ్ళిట్లు విచారగ్రస్తనై యున్నను,

ప్రయోజనము నుంతైనలేదని, యౌవనానందము ననుభవింపక, నిరర్థకముగఁ గాలముఁ బుచ్చనేలనని, మనస్సును మార్చుకొంటిని".

ఆమోహలుకులా మాంత్రికునిచిత్తము నానందమయమరీచికల పోలఁజేసెను. "నాభాగ్యమే భాగ్య" మని, యాతఁ డానందాశ్రుపూరితలోచనుఁడుకాఁగా, నామె "మీదేశమున రుచికరమైన సారాయము లభించునా?" యనెను—

"ఓ! ఈఖండము వివిధసారాయములకు రత్నాకరము. నేను స్వయముగాఁబోయి, యత్యంతరుచికరమైన సారాయముఁ గొనివత్తు" నని యాతఁడు సంతోషాతిశయమున పరుగిడెను. అతఁడు తిరిగివచ్చిన పిదప, నామెగదిలోనికేగి, మంచిసారాయము నొకగ్లాసులోఁబోసి, విషముకలిపిన సారాయము నొకగ్లాసులోబోసి, యాపాత్రము నాతని కిచ్చి, మంచిసారాయము తాను త్రాగినట్లునటించి, పారఁబోసెను. విషయుక్తమైన పానీయముం ద్రావి, మాంత్రికుఁడు భూపతితుఁడై జీవములఁ గోల్పోయెను. అల్లాయుద్దీనువచ్చి, యామాంత్రికుని వసనాభ్యంతరమున నున్న లాంపునుదీసి, రక్కసుని రావించి, "ఈ మేడను వెంటనే పికెన్నునగరమున నెచ్చటనున్నదో యచ్చటకుఁ గొనిపొ" మ్మనెను.

ఆ సౌధము క్షణకాలములోఁ బికెన్నునగరమున నుండెను. అల్లాయుద్దీను భార్యతో రాక్షసుని ప్రభావమున నేర్పాటయిన తినుబండారములఁదిని, యానందభరితాత్ముఁడై నిద్రించెను. తెల్లవారెను. సుల్తాను నిద్రనుండిలేచి చూచుసరి కల్లాయుద్దీను సౌధము గోచరించెను. అతఁడు తిన్నగా నశ్వమునెక్కి బయలుదేఱి, వచ్చి, కుమార్తెను జూచి, జరిగినదంతయుఁ దెలిసికొని, తాను నిష్ఠూరము లాడినందులకు మన్నింపుమని యల్లాయుద్దీనును వేఁడుకొనెను.

మాంత్రికుని మృతకళేబరమునకు దహనసంస్కారము జరిగెను. అల్లాయుద్దీను పెక్కు దానధర్మములఁ జేసెను. ఆతనిఖ్యాతి దిగంతముల వఱకు వ్యాపించెను. కొంతకాల మిట్లుగడచెను. చనిపోయిన మాంత్రికున కొక సోదరుఁడుండెను. ఆతఁడు చైనాదేశమున మఱొక నగరమున నివసించుచుండెను. ఒకనాఁడు తనయన్న యేమిచేయుచుండెనో చూడఁదలంచి చక్రమువేసెను. అల్లాయుద్దీను కారణమున విషముఁ ద్రాగి మృతినొందెనని యాతఁడు గ్రహించెను ఆపగ దీర్చుకొనుటకై యాతఁడు బయలుదేఱెను.

పికెన్నునగరమున నా మంత్రవేత్త యొకసత్రమున కేగెను. ఎచ్చటఁజూచినను ఫాతిమా, ఫాతిమా యని జనులు చెప్పుకొనుచుండుటఁజూచి, "ఆమె యెవ?" రని యొకని నడిగెను—

"ఓయీ! ఆమెపేరు నీ వింకను విననేలేదా? ఆమె స్పృశించినంతమాత్రమున నెట్టివ్యాధులైన—ఎట్టి బాధలైన యుపశమించును. భూతభవిష్యద్వర్తమానములఁ జెప్పుచుండును".

ఆ మాంత్రికుఁడు కుటిలాలోచన మొనరించి, ఫాతిమానివాస మెచ్చటనో తెలిసికొని, యటకేగి, తలుపుతట్టెను. ఆమె తలుపులఁ దెఱచినంతనే యాతఁడు బాకు నామెగుండెపై నిడి "జాగ్రత! నేను చెప్పినట్లు చేయుము. లేకున్న నీగుండియలఁ జీల్చివైతు" నజెను. ఆమెధరించినట్టి చీరను, రైకను మఱొకజత కోరెను. ఆమె యిచ్చెను. "నీ వలెనే నాకాయము ముడుతలుపడి యుండునట్లు చేయుమని యాతఁడు నిర్బంధించెను. ఆమె పాపమట్లే చేసెను. ఆమెను నాలుగు తన్ని, వీధిలోనికి వెడలెను. అనేకు లామెచుట్టును గుమిగూడి "నాకుఁ దలనొప్పి" యని, "నాకు జ్వర" మని తమతమ రోగములఁ జెప్పు

చుండిరి. మాంత్రికుఁడు కపటనాటకము నాడుచు, మెల్లగా నల్లాయుద్దీను సౌధప్రాంతమున కరిగెను—

ప్రజల కోలాహలమునువిని, అల్లాయుద్దీనుసతి బాద్‌రావుల్‌బాదూరు "చెలీ! అదియేమో చూచిర" మ్మనెను. ఫాతిమావచ్చినదని యాచెలికత్తె చెప్పెను. "ఆమెనిటకుఁ గొనిర" మ్మని బద్‌రావుల్‌బదూరనగా, నాపరిచారిక వెడలి ఫాతిమాను దీసికొనివచ్చెను. ఆమె నిజముగా ఫాతిమాయనియే సుల్తానుతనయ భావించి, గౌరవించెను. రెండు మూడు దినములైన తన కతిథిగా నుండుమని యామె కోరగా, ఫాతిమా సమ్మతించెను.

ఫాతిమా "అమ్మాయీ! నీభాగ్యమునకు సాటిలేదు. నీ సౌందర్యము లోకోత్తరము. నీసౌధరామణీయకత మిక్కిలి ప్రశంసనీయము. కాని కాకాసస్ పర్వతముపై వసించు రాక్‌పక్షిగ్రుడ్డుకూడ నుండిన నింకెట్టిలోపము నుండ" దనెను. ఆమె అల్లాయుద్దీనుతో నా రాత్రి రాక్‌పక్షిగ్రుడ్డును దెప్పించుమనెను. అల్లాయుద్దీను మఱుచటిదిన ముదయమున లాంపునుదీసి, రక్కసునితో రాక్‌పక్షి గ్రుడ్డును దెచ్చిపెట్టుమనెను.

రాక్షసుఁడు పెద్దయుఱుపరచెను. అల్లాయుద్దీను గజగజవణకిపోయెను. "ఏమి? నా యజమాని రాక్‌పక్షియని తెలియని మూఢుఁడవై యడిగినందున నిన్ను క్షమించితిని. మఱొకఁడైనచో నీపాటికి చిత్రవధ గావించియుందును. కన్నులఁదెఱచి, మసలుకొనుము. నీ యింట ఫాతిమాయని మసలుచున్నది నిజమైన ఫాతిమా కాదు. ఆఫ్రికామాంత్రికుని సోదరుఁడు నిన్ను నాశనమొనర్చుటకై యా మాఱువేసముఁదాల్చి, వచ్చినాఁ" డని మాయమయ్యెను.

అల్లాయుద్దీ నిఁక నాలస్యమొనరింపరాదని తలంచి, తన గది నుండి యావలికివచ్చి తనకుఁ దలనొప్పిగా నున్నదిగాన నివారింపుమని ఫాతిమా నడిగెను. మాంత్రికుఁడదియే తగినయదనని, బాకు నోటచేత నుంచుకొని మెల్లగా యల్లాయుద్దీనును సమీపించెను. అది గమనించి, అల్లాయుద్దీనా మాంత్రికుని చేతిలోని బాకునూడలాగి, పొడిచిచంపెను.

“అదియేమి ఫాతిమా నకారణముగఁ జంపినా ?” రని యాతని భార్య కళకళపడియెను. “ఈ దుష్టుఁ డాఫ్రికామాంత్రికుని సోదరుఁడుగాని, ఫాతిమా కా” దని, చనిపోయియున్న ఫాతిమాకును, మాంత్రికుని సోదరునకును దహనసంస్కారములఁ జేయించి, మఱల ననేకదానములఁ జేసెను. సుల్తాను వృద్ధుఁడై విగతజీవుఁడాయెను. ఆ యనంతరాజ్యమున కల్లాయుద్దీను ప్రభువాయెను. దంపతులు చిరకాలము సంతోషనాగరనిర్మగ్నులై గడపిరి.

---

# 6 జాలరికథ.



పూర్వకాలమున నొకజాలరి భార్యాపుత్రులతో నివసించుచుండెను. ఆతనిసతి సుగుణాలవాల. ఆతనికి ముప్వరుపుత్రు లుండిరి. నిత్యము నాతఁడు మత్స్యములఁ బట్టుటకై సముద్రతీరమునకుఁ బోవుచుండెను. ఆ మత్స్యముల విక్రయింపగావచ్చిన ధనముతో నాతఁడు జీవితము గడపుచుండెను. యథాప్రకారముగ నాతఁ డొకనాఁటి యుదయమున మత్స్యములఁ బట్టుటకై సాగరతీరమునకుఁ బోయెను. ఆతఁడు వలనువిసరి, కొంతసేపటికి కీసలికి లాగసాగెను. మిక్కిలి కష్టపడిగాని యాతెఁ డద్దానిని తీయఁజాలఁడాయెను. వల నెట్ట

కేల కీనలకుఁదీసి చూచునరికందొక గాడిద మృతకళేబరముండెను. ఆ మృతకాయముయొక్క భారమున కోపఁజాలక, వల చాలభాగము చినిఁగియుండెను. జాలరి విచారభరితాత్ముఁడై వలను మఱలవిసరెను. ఆ తడవకూడ నాతని కేమియు లభ్యముకాలేదు. మూఁడవతూరి జాలరి వలనువిసరెను. వలలో నాతనికొక తామ్రపేటిక దొరకెను. ఆపేటికలో నేమున్నదో చూడదలంచి, యాతఁడు మూతనుదెఱచెను. గుప్పుమని పొగ యీవలికివచ్చెను. ఆ పొగ యంతరించిన పిదపనొక రక్కసుఁ డీవలికివచ్చి, యా బెస్తవానిం జంపఁబోయెను. "ఇదియేమి? పేటిక మూతఁదెఱచి, నిన్ను రక్షించినందులకా నాకీయుపకారము? ఆహా! ఏమిన్యాయము. మొదట నీ చరిత్రను దెలుపు" మని యాబెస్త పలికెను.

"ఏలాగుననైన నిన్ను వధింతును. అయినను నాచరిత్రను దెలుపు మంటివిగాన చెప్పుచున్నాను వినుము. సాల్మను ప్రభువునకు లోఁబడక ధిక్కరించిన రాక్షసగణములో నేనొకడఁను. ప్రభువు నాయెడ కోపముఁగలవాఁడై సేనాధిపతియగు ఆసఫ్ నంపెను. అతఁడు నన్నుఁ జెఱఁ బట్టి, సాల్మను సముఖమునకుఁ గొంపోయెను. ఎంతచెప్పినను నేను ప్రభువునకు లోఁబడకపోవుటచే, నాఁతఁ డమితమగు నాగ్రహము నొంది, నన్నీపేటికలో బంధించి, సముద్రమధ్యమున గిరవాటువేయు" మనెను. పేటికనుండి నన్నెవరీవలికిఁ దీయుదురో వారి నీ చతుస్సముద్ర ముద్రిత మహీమండలాధిపతినిఁ జేసెదనంటిని. ఒకశతాబ్దము గడచెను. ద్వితీయశతాబ్దమున నెవరు నన్ను బంధవిముక్తుఁ గావింతురో వారికీ భూవలయమునఁగల యెల్లసిరుల నిచ్చెదనంటిని. ఆప్రతినఁగూడ నిష్ప్రయోజక మయ్యెను. తృతీయశతాబ్దమున నాకు బంధవిమోచనముఁ గల్గించువారికి సేవకుఁడనై, యాతని కోరికలన్నియు సఫలముఁజేయుదు నంటిని. అదియు ఫలింపదాయెను.

నాలవశతాబ్దమున నన్ను పేటికనుండి యీవలికిఁ దీయువారిని నిర్దయుఁడనై వధింతునని శపథముచేసితిని. అందుచే నీవుతప్పక వధార్హుఁడవు ".

రాక్షసుని పలుకులువిని, జాలరి మిక్కిలిచింతించి, యారక్కసు నెట్లయిన వంచింప, యుక్తిఁబన్నెను. " అదికాదు. నీ వింతవాఁడవే. ఈపేటికయం దెట్లిమిడితివాయని నే నాశ్చర్యము నొందుచున్నాను ".

రక్కసుఁడు " విస్మయమేమి ? నీ విందాక చూచితివిగదా ? " యనెను.

" నేను సరిగా చూడలేదు. నాకు నమ్మకములేదు ".

జాలరి పలుకుల నాలకించి. యారక్కసుఁ డందలియంతరార్థము గ్రహింపఁజాలనివాఁడై " సరే. ఇప్పుడుచూడు " మని, మఱల పొగగామాఱి క్రమముగా నాపేటికలో నిమిడెను. పొగ యంతరించిన తోడనే యాబెస్త తామ్రపేటిక మూతవైచెను. రక్కసుఁడు విస్మయ పరీతచేతస్కుఁడై, మూతఁదీయుమని జాలరిని బ్రతిమాలసాగెను. ఆ జాలరి " ఓయీ దానవుఁడా ! నేను వెఱ్ఱివాఁడనుగాను. తొల్లి గ్రీసుదేశము నేలినరాజు భిషగ్వరుఁడగు డూబాను నెడల నెట్లుప్రవర్తించెనో యట్లు ప్రవర్తింతువు గాన నిన్ను వెలుపలకుఁ దీయఁజాల " ననెను.

" గ్రీసుదేశాధినాథుఁడు—డూబా నంటిపి. ఆ కథను జెప్పు " మని రాక్షసుఁడడుగ, నాజాలరి యిట్లు చెప్పసాగెను.—

---

# 7 గ్రీసు దేశపు రాజు—దూబాను.



ప్రష్యారాజ్యములోని జౌమాను దేశపురాజు కుష్ఠరోగపీడితుఁడై, బాధపడుచుండెను. చాలమంది వైద్యులు, ఆతని నాభయంకరవ్యాధి నిర్ముక్తుఁగావింపఁ బ్రయత్నించియు, విఫలమనోరథులైరి. ఆ భిషగ్వరుల ప్రయత్నములు విఫలములైన కొలఁది నాతని యారాట మతిశయించుచుండెను. ఒకనాఁడు దూబాను వైద్యుఁ డాతని సమక్షమునకుఁబోయి "ఔషధసేవనముతో నిమిత్తములేకుండ త్రుటికాలములో మిమ్మీ భయానకరోగమునుండి విముక్తుఁగావింతు" ననెను.

"అదియెట్లో తెలుపుము".

"రేపటి యుదయమున నూరివెలుపలనున్న మైదానములోనికి రండు. నేనట తమకై వేచియుందు" నని దూబాను రాజు సెలవు గైకొని వెడలిపోయెను.

మఱుచటి దిన ముదయమున రాజు ఘోటకమునెక్కి మైదానమునకు వెళ్లెను. అమూల్యములగు నోషధులచే నింపఁబడిన యొకబంతిని, మూలికలతో నిండిన కొయ్యసమ్మెటను దూబాను రాజునకొసంగి "ఆర్యా! ఈ సమ్మెటతో బంతి నాయాసము కల్గునఱకును, మేను ఘర్మవారి ప్రపూరితంబగునట్లు, కొట్టుఁడు" అనెను.

ఆ నృపాలుఁ డట్లొకయరగంట కష్టపడగా శరీరము చెమటచే నిండిపోయెను. వైద్యుని యాదేశానుసారముగ నా మహీపాలుం డుష్ణజలస్నాన మొనరించెను. ఆహా! ఏమియాశ్చర్యము? ఆ భూపాలుని శరీరము కుష్ఠవ్యాధిరహితమై, స్వచ్ఛముగ నద్దమువలె నుండెను. దూబాను వైద్యవిద్యాకౌశలము నెంతయు సంస్తుతించి, యా నర

పాలుఁ డాతని నాస్థానమునకు రావించి, చాల ధనమునొసంగి, సత్క రించెను. అదిగాక యా భూమీశుఁ డనుదినము దూాబాను నమితముగ గౌరవించుచు, నాతఁడు కోరినదెల్ల యొసంగుచు గౌరవించుచుండుటఁ గాంచి, వజీ రోర్వజాలకపోయెను. దూాబానును విశ్వసింపరాదని, ఆతఁడు శత్రురాజుల పంపున నచ్చినాఁడని, తేనిఁ జంపుటయే యాతని ముఖ్యోద్దేశమని వజీరు పలుపర్యాయములు చెప్పెను. ఆరాజు వజీరుపలుకులను పెడచెవినిఁబెట్టెను. వజీరు "ప్రభూ! నామాట నీవిపుడు వినకుంటివిగాని తరువాత పశ్చాత్తాప పడవలసినచ్చును. పూర్వ మొక వజీరెట్లు శిక్షితుఁడయ్యెనో యట్లే నేనును శిక్షార్హుఁడనగుదు" ననెను.

రాజు "ఆ నక రెందులకు శిక్షింపఁబడె?" నని యడుగ, మంత్రి యివ్విధముగఁ జెప్పసాగెను.

---

## 8 శిక్షింపఁబడిన మంత్రి కథ.

"తొల్లి యొకదేశము నేలుచుండిన రాజు మృగయావినోదమునెడ నత్యధికాసక్తి గలిగియుండెను. ఆ నృపశేఖరుఁడు తఱచుగా వేఁటకై, క్రూరమృగసంకులమైయున్న గహనములకుఁ జనుచుండెను. ఒకనాఁ డాతఁ డొకలేడిని దఱుముకొని, యరణ్యాభ్యంతరమునకుఁ బోయెను. కాననాంతరమున నాతఁడు వెనుదిరిగి చూచునరికిఁ దనవెంట నెవరును లేకుండిరి. తనవెంట నీడవలె నెల్లప్పుడునుండు మంత్రిగాని, పరివారముఁగాని, తన్ననుసరింపకుండుటచే నారాజు భీతచేతస్కుఁడై, యేమిచేయుటకును దోఁపక, తన్నే మృగములును భక్షింపకుండున

ట్లను గ్రహింపుమని పలువిధములం బ్రార్థించెను. ఇంతలో నారాజేంద్రుని కొకస్త్రీ యార్తనాదము వినఁబడియెను.

అది యెచ్చటినుండియోయని సంశయించుచు నాభూపతికొంత దూరమేగుసరి కొకసుందరాంగన గోచరించెను. "నీవెవర ?" నని యారాజపుంగవుఁడు ప్రశ్నింప, నామె మార్గముఁదప్పి వచ్చితిననిపలికి యారాజు నశ్వమునెక్కి యనుసరించెను. మార్గమధ్యమున వారికొక శిథిలదేవాలయము కాన్పించెను. ఆమె యటనశ్వమునుండి క్రిందికుఱికి ఆ యాలయములోనికేగి "నా ప్రియతనయులార ! ఒక్కక్షణమోపిక పట్టి యుండుఁడు. మీకొఱ కొకనిందెచ్చితి" ననెను.

ఆకలుకల నాలకించి యాపె నారీరూపముననున్న రాక్షసికాని, మఱెవరునుగాదని గ్రహించి, యశ్వమును శరవేగమున బరుగెత్తించి, సరియైనమార్గమునుజేరి, నిజనగరముంజేరెను. అతఁడు జరిగినదంతయుఁ దండ్రికెఱింగింప, నాతఁడు మంత్రిశిరస్సును ఖండింప భటులకాజ్ఞ యొసంగెను.

ఇట్లని చెప్పి, యావజీరు దూబానును విశ్వసింపవలదని, వధించుటయే యుత్తమమని చెప్పెను. ఆ వజీరంతగాఁ జెప్పుచుండుటచే నా నృపాలుఁ డదిసత్యమైయుండునని నమ్మి, మఱునాఁటి యుదయమున దూబానునురావించి, "నీకు మరణశిక్ష విధించితి" ననెను.

దూబాను నిర్విణ్ణుఁడై "ఇది యేమిపాపము ? ఓరాజా ! నీవు మిక్కిలి భయంకరము, నసహ్యకరమునగు కుష్ఠవ్యాధినుండి విమోచనముఁ గల్గించినందులకా యీయుపకార" మనెను.

"యేది యెట్లుజరిగినను, యీశిక్ష నీకుఁదప్పదు" అని రాజేంద్రుఁడు కఠినముగఁ బలికెను. ఆస్థానములోని యుద్యోగులును, ప్రజ

లునుగూడ సత్పురుషుఁడైన డూబానునుజంపక శిక్షింపవలసినదనికోరిరి. ఆతఁడు వినఁడాయెను.

డూబాను "రాజేంద్రా! అట్లయిన నాకీయొక్కదినము గడువొసంగుము. నాభార్యాపుత్రులతోఁ గొన్ని చెప్పి, నాకడనున్న యుత్కృష్టవైద్య గ్రంథముల సర్వులగువారికి దానమొసంగి యందుత్తమోత్తమగ్రంథమును నీకొసఁగెదను. నాశిరస్సును ఖండించి, యొక బల్లపై నుంచి, యాగ్రంథమునందలి యెనిమిదవపుటలో నాలుగవపంక్తి చదివి, నీవెట్టిప్రశ్నలడిగినను, నాశిరస్సు బదులు చెప్పును" అనెను.

మఱునాఁటి సాయంకాలమున నీవింతను జూచుటకసంఖ్యాకు లరుదెంచి, కూర్చుండిరి. డూబానా మహాశాస్త్రవిషయసంకలితమగు గ్రంథమును రాజసముఖమున నుంచెను.

రాజా గ్రంథమునందలి పుటలన్నియు నంటుకొనియుండుటచే వ్రేలుతడిపి, యెనిమిదిపుటలుదీసెను. డూబానుశిరము "నాల్గవపంక్తిని జదువుమురాజేంద్రా!" యనెను. అందఱు నాశ్చర్యచకితులైరి. ఎనిమిది పుటలు నట్లురాజుత్రిప్పఁగనే, ఆపుటలందుఁబూయఁబడియుండిన విషము నోటికిఁదగిలి, శరీరమున వ్యాపించెను. విషము తలకెక్క యాభూపాలుఁడు క్రిందబడిపోయెను. డూబానుశిరస్సు "రాజా! నిర్దోషినగు నన్ను శిక్షించుటచేతనే నీకిట్టి దుర్మరణము సంభవింపనున్నది" అని, క్రిందబడిపోయెను.

"జాలరీ! నన్నీవలకుఁ దీయుము. నీకెట్టియుపకారమును జేయబోను" అని, రక్కసుఁడు ప్రతిమాలగా, కరుణాంతరంగుఁడై యాజాలరి పేటికమూఁతను దెఱచెను. ఆరక్కసుఁడు జాలరిని దనవెంటఁగొని, కొంతదూరమేగి, యొకపర్వతమునుజేరెను. ఆపర్వతముదగ్గఱ నొక మైదానమును, నొకచెఱువును నుండెను. సుందరమైన యాకాసార

మును జూపి, దానవుఁడు "ఈ చెఱువులో నాలుగురకముల మత్స్యము లున్నవి. ఆమత్స్యములను గొనిపోయి మీరాజునకిమ్ము. ఆతఁడు నిన్ను విశేషముగ బహూకరించును. రోజునకొకపర్యాయము మాత్రమే చేఁపలను బట్టుము" అని పలికి, యదృశ్యుఁడాయెను.

ఆబెస్త యావివిధవర్ణవిలసితములైన మత్స్యములను తేని సమక్షమునకుఁ గొంపోయి చూపఁగా, నాతఁడు కొంతధనమునిచ్చెను. ఆ చేపలు పచనముశాల కంపఁబడియెను. వంటలక్క యామత్స్యముల నొకపాత్రలోనుంచెను. ఒకగంధర్వాంగన ప్రత్యక్షమై యాచేఁపల నుద్దేశించి, యేటమోపలికి మాయమయ్యెను. ఆచేఁపలంతట నల్లగా మాడిపోయెను. వంటలక్క యాచిత్రమునుగాంచి, నిశ్చేష్టురాలై, యేమిచేయుటకును దోఁపక, మంత్రి కెరింగించెను. మంత్రి జాలరికి మఱల కబురంపి, మఱునాఁడు నాల్గుమత్స్యములఁ దెప్పించెను. ఆ నాఁడుకూడ నట్లేజరిగెను. రాజున కీవృత్తాంతము తెలిసెను. ఆబెస్త వానిఁబిలిపించి, యానృపాలుఁడు "ఓయీ! ఈమత్స్యములు నీకెట దొరకుచున్న?" వని ప్రశ్నింప, నాతఁడు పర్వత ప్రాంతమునయున్న సరోవరమున లభించుచున్నవని చెప్పెను. "ఆప్రదేశమును జూడ వలయునని యున్న" దని, రాజు మంత్రిని, పరివారమును నన్నునుసరింప, బయలుదేఱెను. ఆసరోవర ప్రాంతమున పరిచారకులు గుడారముల నిర్మించిరి. మఱుచటిదినము వేకువఝామున నిపుడేవచ్చెదనని మంత్రితోఁజెప్పి, యశ్వారూఢుఁడై, యావనమునఁ గొంతదూర మేగెను.

ఆతనికొక సుందరసౌధము గోచరించెను. ఆహర్మ్యమున నాతడు ప్రవేశించెను. ఎవ్వరు నాతనికిఁ గాన్పించలేదు. ఆభవనము నంటియున్న రమ్యోద్యానవనమున నాతఁడు ప్రవేశించెను. ఎటనుండియో "ఇది నాదురదృష్టముగాక వేఱొకటికాదు" అని వినబడియెను.

రాజేంద్రుఁడాపలుకులు నాలకించి, యాశ్చర్యపరవశుఁడై, 'కొన్నియడుగులు ముందునకు వేయుసరికొక సింహాసనముపై నొకసుందరాంగుఁడగు యువకుఁడు కూర్చుండియుండుట చూచెను. ఆయువకుఁడు వివర్ణవదనుఁడై యుండెను. దుఃఖాశ్రువులతో నాతనిలోచనములు నిండియుండెను. "నాయనా! నీవిట్లు విచారమూర్తివై కూర్చుండుట కేమికారణము? నీవెవరు? ఈయుద్యానవనమునఁగాని, యీసౌధమునగాని నెవ్వరును లేకుండుటకుఁ గారణమే?" మని, యారాజుకులావతంసుఁడడుగ, నాయువకుడు గద్గదకంఠమున నిట్లు చెప్పసాగెను.

---

# 9 యువరాజుకథనము.

"రాజేంద్రా! ఆలకింపుము. ఈపర్వతము రంగుచుబట్టియే యీదీవికి నల్లదీవియనుపేరు వచ్చినది. ఆ కాసారమున్నయెడ నిదివరకు రాజాంతఃపుర ముండెడిది. నాజనకుని నామధేయము మహమ్మదు. ఇప్పుడీ ప్రదేశమంతయు నిర్జనమైయున్నదిగాని, యిదివఱలో జనాకర్ణమైయే యుండెడిది. నాతండ్రి జీవించియుండఁగనే నాకువివాహమైనది నవలావణ్యోద్భాసితయగు నాసతితో నైదువత్సరములు సుఖముగా కాలముగడపితిని. అప్పుడే యొకచిత్రము ఘటిల్లినది. ఒకనాఁటిరాత్రి నేను శయ్యాగృహమునఁ బరుండియుంటిని. నాభార్య చెలికత్తెలిర్వురు వింజామరల వీచుచుండిరి. నాకింకను నిద్రజనింపలేదు. ఆపరిచారికలిర్వురును నేను నిద్రించితినని భావించి, యిట్లు చెప్పుకొనసాగిరి.

"సఖీ! రాణి, మనరాజునెడ ప్రవర్తించుచున్నవిధము మిక్కిలి నింద్యమైనది. ఆమె యనుదినము, రాజు నిద్రించినపిమ్మట నెటకు

బోవుచున్నదో తెలియదుగదా ! పాప మమాయకుఁడగు రాజున కిది యేమియుఁ దెలియదుగదా !".

"అవును. రాజు గాఢనిద్రాసక్తుఁడై యుండుటకీమె పానీయమున నేదో మత్తుమందుకలిపి యిచ్చుచున్నదని నాయుద్దేశము. రాత్రి యంతయు నెచ్చటనో యుండి, యీమె తెల్లవారుఝామున వచ్చుచున్నది".

వారల సంభాషణ మాకర్ణించి, నేను డోలాయమానమానసుఁడనైతిని. మఱునాఁటిరాత్రి నాసతియెటకేగుచున్నదో కనుగొనదలంచి యీమె నాకొసఁగిన పానీయమును ద్రాగక యావలఁ బారఁబోసి, నిద్రనభినయించితిని.

ఆమె నేను నిద్రాముద్రితుఁడనైతినని తలంచి, మెల్లగా లేచి, అంధకారజలధి నీఁదుకొనుచు నామె పోవుచుండ, ఖడ్గధారినై నేనామె ననుసరించితిని. ఆ నగరము వెలుపలనున్న యుద్యానవనమునఁ బ్రవేశించినది. ఆమె యెవరితోనో మాట్లాడసాగినది. ఆమె "ప్రియా ! నాకోరిక చెల్లింపవా ? నీవు నన్ను విప్రతీకృతను గావించినచో నేమియగునో తెలియునా ? నీ రాజ్యమును నా క్రోధానలమున భస్మీభూతమొనరింతు" నని, యా పురుషునితో సరస సల్లాపముల నాడుచుఁ దనకరము నామె కేలఁగీలించి, నడువసాగెను. నేను కోపము నాపుకొనఁజాలక, ఖడ్గము నీవలికిఁదీసి, యాపురుషు నొక్కపోటు పొడిచి, యొక పొదచాటున దాగొంటిని. ఆమె యేదో మూలికతో, నాతనికిఁ జికిత్సచేసినది. నేను మెల్లగా నంతఃపురమునుజేరి నిద్రించితిని. ఆమెయుఁ గొంతసేపటికి వచ్చినిద్రించినది. మఱుచటి యుదయమున నేనామె దుఃఖవివశయై యుండుటచూచి, యాశ్చర్యచకితుఁడనైతిని. ఆమె క్రమముగా కృశీభూతకాసాగినది. తన బందుగులెవరో మరణించిరని నాతోఁ జెప్పినది.

తనకుఁ బ్రత్యేకముగ నొకసౌధము నుద్యానవనమున నిర్మింపఁ జేయుమని, నాసతి కోరినది. ఆమెకోరిక చెల్లించితిని. తనప్రియు నామె యా భవనమునఁ జేర్చినది. నిరంతరము నామె యాతని సాన్నిధ్యము ననే యుండసాగినది. ఒకనాఁ డామె యేమిచేయుచున్నదో చూచుటకే నేఁగితిని. ఆమె " నామనోహరా! ఏల యీమూకీభావము? నాయందు నీ కింకను బ్రేమజనింపదా?" యనుచుండెను. తటాలున కరవాలము నొఱనుండితీసి, యాదుష్టుని వధింపఁబోయితిని. ఆమె యేవో మంత్రముల నుచ్చరించెను. నేను మొండెమువఱకు మానవుడనై యుంటిని. కాళ్లు శిలామయమైపోయెను. అనుదినము నుదయమున నామెవచ్చి, కొరడాతో నన్నుగొట్టి, ప్రియునిదరిఁజేరి, యేడ్చి పోవుచుండును".

ఆ రాజా యువకుని దీనచరిత్రను విని " ఓయీ! నీవు చింతింపకుము. నిన్నాదుష్టురాలి మాయాజాలమునుండి తప్పింతును". అని, యారాత్రి యాసౌధమున శయనించెను. ఉదయమున నా రాజన్యుఁడు, యువకునిభార్య ప్రేమించిన వికృతాకారునిఁజంపి, యాశవము పరుండియున్న గోపురాకారయుక్తమైన పెట్టెలోఁ దాను పండుకొనెను.

యువరాజు భార్యవచ్చి, కొరడాతో నాతనిఁగొట్టి, రాజు దాఁగొనియున్న పెట్టెయొద్దకువచ్చి " ప్రియా! నీకు నాపైఁ గోపమింకను యుపశమింపలేదా? ఎన్నాళ్లు నే నిట్లింకను విరహాగ్నిని గ్రుగ్గవలయును?" అనెను. రాజు కంఠస్వరము మార్చి " నీ భర్తను బాధించుచున్నంతకాలము, ఆరోదనధ్వనులు వినఁబడుచున్నంత కాలము నీయెడ నాకుఁ గనికరము, ప్రేమ కలుగవు. ఆతఁడు పూర్వపురూపము నొందునట్లు చేయుము". అనెను. ఆమె మహదానందభరితాత్మయై, యా యువరాజు నిజస్వరూపము నొందునట్లుచేసి " ప్రియా! ఆలస్యమింకేల?" యని యడిగెను. " సఖీ! ఇంతమాత్రమున నా యావే

దన తగ్గదు. ఈ దీవి, ప్రజలు, నన్నియు నిదివఱకెట్లుండెనో యట్లొనరించిర" మ్మనెను. ఆమె, కాసాగముకడకేగి, మంత్రోచ్ఛారణ మొనరింపఁగా దీవి, రాజధానీ నగరమయ్యెను. ప్రజలెల్లరును నిద్రనుండి మేల్కాంచిన తెఱంగున లేచి, తమతమ కార్యముల నిర్వర్తించుకొన సాగిరి.

ఆ సుందరి మఱల రాజువద్దికేగి "ప్రియా! నీకోరిక నెరవేరినది. రమ్ము" అనెను. రాజాజ్ఞయనటున నీవలికివచ్చి, వానికిని జెప్పెను. యువరాజు రాజునకు నమస్కరించి, తన కృతజ్ఞతను వెల్లడించెను. రాజు "యువరాజా! ఈ రాజ్యమును నీ బంధుజనులలో నొకరికి నప్పఁజెప్పి, నాతోరమ్ము. నాకుఁ దనయులు లేరు. నిన్నే నారాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ గావించెద" ననెను.

యువరాజుతో రాజు తన రాజధానిచేరి, శుభదినంబున తన రాజ్యమున కాతని నధిపతిగ నొనరించెను. యువరాజు శాపవిమోచనమునకుఁ గారణభూతుఁడైన జాలరి కొకగ్రామ మీయఁబడెను. అతఁడొక చిన్నజమీందారువలె, గాలక్షేపము చేయసాగెను".

---

# 10 సిండ్‌బాడ్ ప్రథమ నౌకాయానము.

—: o :—

"బాగ్దాదునగరమున హిండ్‌బాదను పేదవాఁడు నివసించుచుండెను. మండు వేసఁగికాలమున హిండ్‌బాద్ మోయలేనంత బరువు నెత్తికొని యెట్లెట్లో కష్టపడిమోయుచు, నాయాసమెక్కువయగుటచే నొకసౌధప్రాంగణమున నాబరువుదించి, నిలువఁబడెను. ఆదివ్యసౌధ

మునుండి మనోజ్ఞపరిమళమళమనెగఁజిమ్ము తినుబండారములతో విందు చేయఁబడుచుండెను. ఆసువాసన హింద్‌బాద్ రూయాసము నపన యింపసాగెను. ఆదివ్యహర్మ్యమేరిదో చూడవలంచి, హింద్‌బాద్ సింహద్వారమును సమీపించి, యచ్చటనున్న సేవకునిఁగాంచి, "ఈ భవనమెవరి ?" దని ప్రశ్నించెను.

"ఓయీ అమాయకుఁడా! మహదైశ్వర్యవంతుఁడును, మహాధార్మికుఁడును నగు సింద్‌బాద్‌సౌధమిది. ఆయన ప్రసిద్ధనావికుఁడు".

సేవకుని పలుకులు నాలకించి, హింద్‌బాద్ తనకరముల ముకుళితమొనరించి, "హే ప్రభూ! పరమాత్మా! సింద్‌బాద్ యీరీతిగా నైశ్వర్యముతోఁ దులతూగుచు సుఖంచుటకాతఁడు పూర్వజన్మమున నెట్టిసుకృతమొనరించెను ? నేనీరీతిగా నిరంతరము కష్టపడినను కుటుంబ పోషణము దుర్భరమగుటకు నేఁజేసినపాపమే ?" మనుకొనియెను.

ఆసేవకుఁడు లోనికేగి, మఱల యీవలికివచ్చి, హింద్‌బాద్ నుద్దేశించి "అయ్యా! మాయజమాని నిన్నులోనికిఁబిలుచుచున్నాడు రమ్ము" అనెను. హింద్‌బాద్ లోనికేగెను. సిందుబాదొక కుర్చీపైఁ గూర్చుండెను. ఆతనిచుట్టును బదిమందిస్నేహితులు సరససల్లాపనిమగ్నులై యుండిరి. వారిముందు మధురపానీయములు, రుచ్యములైన తినుబండారములు నుండెను. సిందుబాదు "ఓయీ! రమ్ము. కూర్చుండుము. ఈరుచికరములైన పదార్థములభుజించి, యీపానీయముఁ ద్రావుము. నీవన్నమాటలన్నువింటిని. ఈయైశ్వర్యమును నేనెంతకష్టపడి సంపాదించితినో నీకుఁదెలియునా ? నాచరిత్రము నీకు మిక్కిలి యాశ్చర్యము జనింపఁజేయును. వినుము" అని హింద్‌బాద్ సామగ్రిని గమ్యస్థానమునకుఁబంపి యిట్లుచెప్పసాగెను.—

"నాతండ్రి నాకపారమైన భాగ్యమునుంచి, చనిపోయెను నేను కొంతకాలము ధనమును దుర్వ్యయముచేసి, విచ్చలవిడిగాఁ దిరిగి

తిని. కాని యేదైన వ్యాపారము చేసి, ధనమార్జింపనెంచి, సముద్రయానముఁ జేయు వర్తకులను గలిసికొని మాటాడి, శుభముహూర్తము నిశ్చయించి, యోడనెక్కి పయనమైతిమి. బాల్సొరామీఁదుగాఁ దూర్పు దీవులకు బయలుదేఱితిమి.

సముద్రయానమున కే నలవడియుండకపోవుటచే మొదటనాకు జబ్బుచేసినది. పలుతావుల నాసరకునమ్మి, యట చౌకగాలభించు సామగ్రినికొని, పెక్కుదివసములు పయనమొనరించి, యొకనాఁడొక దీవిఁజేరితిమి. ఓడకప్తాను లంగరువేయించి, యాదీవిచూచి, విశ్రమించి రావచ్చుననెను. పచ్చికతోఁగూడిన మైదానమువలె నాప్రదేశమెంతయు రమణీయముగఁ గన్పట్టుచుండెను. అందఱము నాదీవిలోనికేగితిమి. ప్రకృతిసౌందర్యావలోకన తత్పరుఁడనై, నేను మఱికొంతదూరమేగితిని. ఇంతలో నాప్రదేశమొక్కసారి కంపించినది. కప్తాను విస్మితుఁడై "తొందరపడుఁడు. ఓడనెక్కుడు. ఇదిదీవికాదు. తిమింగిలము వీపు" అని పరుగెత్తెను.

కొందరు నావలనెక్కిరి. కొందఱీదుకొనుచుఁబోయిరి. నేనశక్తుఁడనై యుండిపోతిని. చూచుచుండఁగనే ఓడ దృష్టిపథము దాటిపోయినది. ఆతిమింగిల మింతలో మునిఁగినది. నేనాయలలలోఁ గొట్టుకొనుచు, నాయాసము క్రమముగా నధికమగుటచే నచేతనుఁడనైతిని. ఒక్కయుత్తుంగతరంగము నన్ను తీరమునఁజేర్చెను. తెల్లవాఱినది. భాస్కరుని కిరణకాంతి నాకు నూత్నశక్తి ప్రసాదించినది. నేనుమెల్లగాలేచి, తీరమునకేగితిని. అచట నాకొక యందమైనగుఱ్ఱము కాన్పించెను. ఆయశ్వమును నేనుసమీపించితిని. ఒకపురుషుఁడువచ్చి నన్ను తన మిత్రులకడకుఁ గొంపోయెను. సముద్రములోనుండి యొకనీటిగుఱ్ఱమువచ్చి, తీరముననున్న యశ్వముతోఁబోర్లి, దానిని చంపబోవ

నచటివారు దానిని బెదరించిరి. ఆనీటిగుఱ్ఱము సముద్రములోనికిఁ బాఱిపోయెను. సుందరములైన హయములు జన్మించుటకై వారిట్లొనరించుచుందురని నాకుఁ దెల్లమైనది. వారునన్ను సొరంగమార్గమున గొంతదూరమును, అటనుండి నావమీఁద కొంతదూరము గొంపోయిరి. మేము కాసెల్‌దీవిఁ జేరితిమి. ఆదీవినేలు రాజామిహిరాజును దర్శించితిని. ఒకనాఁటి సాయంకాలము నేనోడలరేవు చేరితిని. ఒకయోడ వచ్చినది. సామగ్రిని నావికులు తీరమునకుంచిరి. ఆసామగ్రిలో నాదికూడ నుండుటచే నేనపరిమితానందము నొందితిని. ఆయోడ కెప్తానును, తదితరవర్తకులను గలిసికొంటిని. వారునన్నుఁజూచి పరమానందభరితులైరి. నాసామగ్రిని లాభమునకు విక్రయించి, కర్పూరము, గోరోజనము మున్నగువానినిగొని, స్వగ్రామముఁ జేరి, యత్యంతానందభరితాత్ముఁడనై కాలముగడపసాగితిని ”.

---

## 11 సింద్‌బాద్ ద్వితీయ నౌకాయానము.

సింద్‌బాదును, మిత్రులును మఱునాఁడువచ్చి, విందారగించిన పిదప, సింద్‌బాద్ తన ద్వితీయ నౌకాయాన విశేషముల నిట్లుచెప్ప దొడంగెను.—

“ నేను కొంతకాలము యింటయొద్దనుంటిని. నాకేమియుఁ దోఁచనందున మఱల బయలుదేఱితిని. కొందఱు వణిక్‌శేఖరులుగూడ నాతో నోడనెక్కి బయలుదేఱిరి. కొలఁది దినములు పయనమొనరించి, మే మొకద్వీపముఁ జేరితిమి. మేమందఱమునట నోడ నవరో

హించి, యా ద్వీపములోని కేగితిమి. విశ్రాంతిఁ గైకొనఁదలంచి నేనా ద్వీపములో రమణీయముగనున్న ప్రదేశమునఁ గూర్చుండి, ఫలాహారముల నారగించి, మద్యము నొకింతఁ ద్రాగి, శయనించితిని. నేనట్లే నిద్రాముద్రితుఁడనై యుండిపోయితిని. మేల్కాంచి, చూచుసరికి నౌక కానరాలేదు. నేను భయము నొందితిని. తీరమునకుఁ బరుగెత్తి పరికింపఁగా, నౌక చూపుమేరదూరము దాఁటియుండెను. నేను కర్తవ్యవిమూఢుఁడనైతిని. విచారము నాచిత్తము నలమికొనెను. నేను విలపించితిని. కాని, నన్నా నిర్జనభయానక ప్రదేశమున నోదార్చువారెవరు ?

నేనే సమాధానపడి, గుండె దిటవుచేసికొని, యచ్చటనున్న యున్నత మహీరుహశాఖనెక్కి, నలుకెలంకుల గలయఁజూచితిని. కొంత దూరములో నేదో తెల్లనిశిల యగుపించినది. ఆ శిలను నేను మెల్లగా సమీపించితిని. ఆ శిలపై గూర్చుండియుంటిని. ఇంతలో నా ప్రదేశ మాకస్మికముగ గాఢాంధకారబంధుర మాయెను. ఒక పెద్దపక్షి గగన మండలమునుండి, క్రిందకు దిగుచుండెను. అయ్యది నావికులు కథగాఁ జెప్పు రాక్ పక్షియనియు, నేను గూర్చుండినది శిలగాక యాపక్షి గ్రుడ్డయి యుండుననియు గ్రహించితిని. నావికు లొకప్పుడు నాతోఁ జెప్పిన విషయము జ్ఞప్తికి వచ్చినది. ఆపక్షి క్రిందకుదిగి, గ్రుడ్డును పొదిగినది ఆ పక్షిపాదము మహీరుహశాఖపై నుండెను. నా యుత్తరీయముతో నా పక్షిపాదమునకుఁ గట్టుకొంటిని. ఆ విహగరాజ మాకసమున కెగిరిపోయినది. నాకన్నులు గిరగిర తిరిగినవి. కొంతసేపటికా పక్షి యొకపర్వతముపై వ్రాలినది. నేను వెంటనే కట్టువిప్పికొంటిని. ఆ పక్షి యొకభయంకర విషసర్పమును నోట గఱచుకొని పోయినది. ఆ పర్వతమును మెల్లగ నవరోహించి, యొక లోయలోనికిదిగితిని. అందు ధగద్ధగాయమానములగు వజ్రములు, రత్నములు నుండెను.

ఆనందభరితాంతరంగుఁడనై యా వజ్రముల నేఱికొంటిని. కాని యా యుత్తరక్షణముననే నాచిత్తము భయవిహ్వాలమైనది. ఆ లోయలో నొకచో విషోరగములు గుంపులుగుంపులుగా నూడెను. ఇంతలో జగమంధకారాన్వితమాయెను.

ఆ లోయలోని యొకగుహలో నేను విశ్రమించితిని. ఏవేళ యేసర్పము నా ప్రాణముల హరించునోయని మిక్కిలి భయమునొందితిని. తెల్లవాఱినది. నేను మఱల లోయలోనికేగి యటనుండి యావలకుఁ బోవుటెట్లాయని యోచించితిని. ఇంతలో నా ప్రక్కనొక మాంసఖండము పడెను. చూచుచుండఁగా నెన్నో మాంసఖండములు పడెను. ఆ మాంసఖండములకు వజ్రము లంటుకొనెను. ఒక్కొక్కపక్షి యా మాంసఖండముల నోటఁగఱచుకొని యెగిరిపోవుచుండెను. నే నొక మాంసఖండమును వీపున గట్టుకొంటిని. ఒక పెద్దపక్షి యా మాంసపుముక్కను నోటఁ గఱచుకొని యెగిరిపోయినది. చెట్టుపై నా విహంగమాగినంతనే నేను బంధనిర్ముక్తుఁడనై క్రిందకు దిగితిని. అట నాకుఁ గొందఱువర్తకులు కాన్పించిరి. అపుడు నేను వారియుద్దేశము గ్రహించితిని. ఆ మాంసఖండముల వారే విసరియుండిరి. వజ్రము లంటుకొనిన యా మాంసపుముక్కలను పక్షులెత్తుకొనిపోయి తమ కులాయములందుంచునపుడా శకుంతముల బెదరించి, యా వజ్రముల సేకరింతురు.

నేనా వణిజులతో వారినగరమునకుఁ బోయి యటకొన్ని వజ్రములను విక్రయించి, సామగ్రినికొని, పెక్కునగరములందు లాభమునకమ్మి, రోషాదీవి నుండి బాల్సోరాచేరి, యటనుండి బాగ్దాదును జేరితిని. నాకులభించిన ధనముతో హాయిగా కాలముగడుపసాగితిని ”. సింద్‌బాద్ కథను ముగించినపిదప, హిందుబాదును దదితర మిత్రులను దమతమగృహములకు వెడలిపోయిరి ”.

# 12 సింద్‌బాద్ తృతీయ నౌకాయానము.

మఱుచటి దినమున హిందుబాదును, మిత్రులును వచ్చినపిదప, వారలకు విందొనరించి, సింద్‌బాద్ తన తృతీయనౌకాయాన విశేషములనిట్లు చెప్పసాగెను—

"నాకు గృహమున సోమరివలెనుండుట నచ్చలేదు. కొంత మంది వర్తకులతో మఱల నోడనుబేరమాడి, విశేషముగ నామగ్రితోఁ బయనమైతిమి. పలుతావులకేగి, సరకు విక్రయించితిమి. ఒకనాఁడు మే మోడలో పయనము సల్పుచుండగాఁ దుపానుబయలుదేఱి సముద్రమల్లకల్లోలమైపోయెను. మేము మిక్కిలి ప్రయాసపడి, యొకదీవిని జేరవలసినవారమైతిమి. ఓడకప్తాను మాత్రము మేమాదీవిలోని కేగుట శ్రేయస్కరముకాదనియు నట, నరమాంసభక్షకులగు నాటవికులుందు రనియుఁ జెప్పెను. విధిలేక మేమాదీవిలోనికే పోవలసివచ్చెను.

ఓడనుండిదిగి, ఆ దీవిలో కాలిడునరికి వికృతాకారులగు నాటవికులు గుంపులుగుంపులుగా వచ్చి, మమ్మెదుర్కొని, తమతోఁ దీసికొనిపోయిరి. వారు మమ్మొక విశాలభవనమున ప్రవేశపెట్టిరి. ఆ భవనము నంటియున్న వనమ్మున వివిధములగు పూలమొక్కలుండెను. ఆ హార్మ్యములో నొక్కెడ నెముకలపోగులు, నొకచోట నస్థిపంజరములు, నింకొక్కెడ దుర్గంధము వ్యాపింపఁజేయుచు పలలముతో నిండియున్న పాత్రలు నుండి, మాకు భయాసహ్యములఁ గల్గించెను.

అహస్కరుఁడు పశ్చిమాద్రి చేరఁగనే, భయంకరాకారులగు నాటవికులు నృత్యగానములచే నా భవనమును మార్మ్రోగునట్లుచేసిరి. ఇంతలో నా యాటవికల నాయకుఁ డెటనుండియో వచ్చెను. ఆతఁడు దీర్ఘకాయుఁడు. లలాటమున నొక కన్నును, దీర్ఘములైన నాలుగు దంతములును గలిగి యాతఁడు మఱింత భయావహముగఁ గన్పట్టసా

గెను. మమ్ములనందఱ నారక్కసుఁడు పరీక్షించి, మాలో బలిష్ఠుఁడగు కప్తానును వధించి, యాతని మాంసమును బచనముచేయించి, భుజించి, మద్యము కడుపారఁ గ్రోలి, తెల్లవారగనే యెటకో వెడలిపోయెను.

మఱుచటి యుదయమునుండి మేమాదీవినుండి బయటకుపోవు మార్గముల నన్వేషింపసాగితిమి. ఆదుర్మార్గులు మాయోడ నపహరించి, యెటకో గొనిపోయియుండిరి. ఆనాఁటిరాత్రి రక్కసుఁడు మాలో మఱియొకనిఁజంపి, భుజించి, నిద్రించెను. ఏవిధముననైన యాదీవినుండి వెడలిపోవుటకు సంకల్పించుకొని యుండుటచే, నేనటనున్న యినుప మేకుల నగ్నియం దెఱ్ఱగాఁగాల్చి, యాదానవుఁడు నిద్రించుచుండఁగా, కన్నులఁ బొడిచితిమి. అతఁడు దిగంతములు ప్రతిధ్వనించు నటుల కేకవైచెను. నేను మిత్రులతోఁగలిసి, సముద్రతీరమునకుఁ బరుగెత్తితిమి. అటనున్న కలపతోఁ జిన్న చిన్న నావల నిర్మించితిమి. తెల్ల వాఱినది. అంధుఁడైన యా రక్కసుఁడు తన యనుచరులను వెంట నిడుకొని తీరమునకు వచ్చెను. వారినిచూచి, నావలనెక్కి, జలధి లోనికిఁ ద్రోసికొనిపోయితిమి. ఆ యాటవికులు క్రోధావేశపరవశులై పెద్దపెద్దఱాళ్లను మేమున్ననావలపైఁ బడునట్లు విసరసాగిరి. నేను యిర్వురు మిత్రులతో నొక నావపైనుంటిని. ఆ నావతక్క మిగిలిన వన్నియు మున్గిపోవుటయు, ఆ నావలపైనున్న మిత్రులు గతించుటయు సంభవించెను.

సముద్రములో మానావ యటు నిటు లూయెలవలె నల్లలాడుచుఁ బోయి పోయి, రెండుదివసములకొక దీవిఁజేరితిమి. ఆదీవి మధుర ఫలాన్వితములగు వృక్షములతోనిండి, నేత్రపర్వముఁ జేయుచుండెను. తీయనిఫలములభుజించి, మేము ముగ్వురము నొక తరుచ్ఛాయను విశ్రమించితిమి. భుజంగమొండు నామిత్రుని కఱచెను. అతఁడు వెనువెం

టనే మృతినొందెను. మఱునాఁటియుదయమున నాపాము మిగిలియున్న నాస్నేహితునిఁ గఱచెను. అతఁడును విగతజీవుఁడాయెను. భయవిహ్వలుఁడనై నేను తీరమునకుఁ బరుగెత్తితిని. ఒకయోడ నాకుఁగోచరించెను. నాయుత్తరీయమును జెండావలె నల్లలాడించి, యానౌకలోనివారికి సంజ్ఞ చేసితిని. అదృష్టవశమున నోడకప్తాను కంటబడితిని. అతఁడొక చిన్న నావను నాకై పంపెను. నేనోడఁజేరితిని. ఆకప్తాను కంఠము సుపరిచితమై యుండెను. అతఁడు నాకుఁ గొంతసామగ్రినిఁజూపి, "మిత్రమా! మనము తేపుచేరఁబోవు పట్టణమున నీసామగ్రి విక్రయింపుము. నీకుఁ గొంతధన మిచ్చెద" ననినాఁడు.

ఆసామగ్రిని పరిశీలించితిని. ఆశ్చర్యము. అదినాసామగ్రియై యుండెను. ఆకప్తానునుద్దేశించి, "అయ్యా! ఇది నావికుఁడగు సిన్డ్బాద్ సామగ్రి కాదా?" అంటిని. ఆకప్తాను "అవును. నీకెట్లు తెలిసిన?" దనెను. "ఓయీ! నేనే యాసిండ్బాదును. నన్నుగుర్తింప జాలవా?" యంటిని. కప్తాను నన్ను తేఱిపారఁజూచినాఁడు. ద్వితీయ నౌకాయానమున నన్ను దీవిలో నిద్రించుచుండగా విడిచిపెట్టి వెడలిపోయిన యోడకప్తా నాతఁడు. నన్నుగుర్తించి యాతఁడు మహదానందభరితుఁడై యాలింగన మొనరించుకొని, యాసామగ్రిని నావశము చేసెను. ఆసామగ్రిని విక్రయించుకొంటిని. ఒకచోట గోవుయొక్క యాకారముఁగల్గిన చేపనుజూచితిని. అది క్షీరమునిచ్చును. మఱొక్కెడ పెద్దతాఁబేలును జూచితిని. విశేషముగ లాభమునొంది, నేను బాగ్దాదునగరముంజేరి, ప్రియసతీమణితోఁగూడి సౌఖ్యాంబుధి నోలలాడసాగితిని". హింద్బాదు మున్నగువా రింటికేగిరి.

---

# 13 సింద్‌బాద్ చతుర్థ నౌకాయానము.

———:o:———

హిందుబాదును తదితరమిత్రులును వచ్చికూర్చుండిరి. సింద్‌బాద్ తననాల్గవ నౌకాయానవిశేషముల నిట్లు చెప్పసాగెను—

"మిత్రులారా! నేను కొలఁది దినములు మాత్రమే యింటి యొద్దనుంటిని. కొంతమందివర్తకులు నన్ననుసరించిరి. మేమొకయోడ నెక్కి, 'టిగ్రాసిర్మా, యీస్టరైలెండు' లను జూచుచుఁ బయనము సల్పుచుండ నొకనాఁడొక తుపానువచ్చెను. మార్గముదుర్గమమయ్యెను. తెఱచాప తెగిపోయి, యోడలోని చాలభాగములు విరిగిపోయెను. కొందఱు పాపము మృత్యుదేవత యొడిలోని కొఱిగిరి. ఓడ పూర్తిగ భగ్నమైపోవుటచే నేనొకచిన్ననావలోనుఱికి, కొందఱుమిత్రుల నందెక్కించుకొని బయలుదేఱితిని. చీఁకటి జగమెల్ల నాక్రమించుకొనుసరికి మేమొకదీవిం జేరితిమి. ఆదీవిలోఁ గొన్నికుటీరములనుజూచి, మేము సమీపించితిమి. దుష్టులగు నాటవికజాతివారు ప్రత్యక్షమైరి. వారు మమ్ములను భక్షించుటకు సంసిద్ధులైరి. మమ్మువారు పంచుకొనిరి. ఒకఁడునన్ను మఱినల్వురను దనయింటికిఁ గొంపోయినాఁడు. మాకు వారాహారముఁబెట్టి యేదోవనమూలికను దినుమనిరి. నేనుదినక పారవైచితిని. నామిత్రులా మూలికను సేవించి, యచేతనులై క్రిందబడి పోయిరి ఆటవికులు వారిని భక్షించిరి. నేను బలహీనుఁడనై యుండుటచే నన్ను విడిచిరి. నే నాహారము గైకొనుటమానితిని. నేను వ్యాధిగ్రస్తుఁడనై యుంటినని వారితోఁ జెప్పితిని. నన్నెప్పుడు భక్షింతురో యని యాందోళన మొందితిని. మూఁడుదినములు గడచెను. ఆటవికులరణ్యములోనికిఁ బోయిరి. అదియే తగినయదననియెంచి, యాదీవి నుండి వెడలిపోయితిని. ఒకవృద్ధుఁడు నన్ను చూచి, కేకలిడెనుగాని వానివైపుచూడక, పరుగిడనారంభించితిని.

ఏఁడుదినములట్లు నడచితిని. ఎనిమిదవనాఁడు నేను కొందఱను గలిసికొంటిని. వారు మిరియముల చేరుచుండిరి. అరాబియాభాషలో వారునన్ను కొన్ని ప్రశ్నలడిగిరి. నామాతృభాషలో ప్రశ్నించినవారలనుజూచి, నేను పరమప్రమోదాయత్త చిత్తుండనై వారలకు బదులు పలికి, నాకథను దెలిపితిని. తమయోడలో నన్నువారిదేశమునకుఁ గొంపోయిరి. ఆదేశపురాజునకు వారునన్ను చూపించిరి. అతఁడు ధార్మికుఁడు. ప్రజానురంజకముగఁ బరిపాలనముసేయు నుదారహృదయుఁడు. నాయెడ నారాజున కేలొకో యగ్గలమగు ప్రేమకలిగెను. రాజున కాంతరంగిక మిత్రుఁడనగుటచే నన్ను ప్రజలు విశేషముగ గౌరవింపసాగిరి.

ఆ దేశపుఁబ్రజ లశ్వములపై స్వారిచేయునపుడు జీనులఁగాని, రికాబులఁగాని యుపయోగింపకుండుటగాంచి, విస్మితుఁడనై, తోలును దెప్పించి, జీను, రికాబులఁ దయారుచేసి, రాజునకొసఁగితిని. రాజపుడు హాయముపై స్వారిచేసి, సంతోషభరితాంతరంగుఁడై నన్ను బహూకరించెను. ఆస్థానమునందలి ఉన్నతోద్యోగులుకూడ తమకట్టివి కావలెనని కోరిరి. వారికిఁగూడ నట్టివి తయారుచేసి యిచ్చి, చాలధనమార్జించితిని.

ఒకనాఁడా రాజేంద్రుఁడు నన్ను తనసరసను గూర్చుండబెట్టుకొని "మిత్రమా సింద్‌బాద్! నీవిట నుండిపొమ్ము. నాకోరిక చెల్లింపుము" అనియెను. నేనా రాజచూడామణి పలుకుల త్రోసివేయలేకపోయితిని. సుందరాంగియగు కన్యను వివాహముఁ జేసికొంటినని ప్రణయసామ్రాజ్యమును మేము యథేచ్ఛముగ నేలసాగితిమి. ఒకనాఁడు నాపొరుగింట రోదనము వినఁబడెను. అతఁడు గోలుగోలున నేడ్చుచుండెను. కారణమరయఁగా నాతనిభార్య మృతినొందెనని తెలిసినది. ఆతని నూఱడించి "ఓయీ! భార్య చనిపోయినదో మఱియొక భార్య లభించును. ఊరడిలు" మంటిని—

గద్గదకంఠుఁడై యాతఁడు "అయ్యా! నీకీ దేశాచారము తెలియదు కాఁబోలు. భార్యాభర్తలలో నెవరు విధివశమున మరణించినను, మిగిలినవారు కూడ బలాత్కారముగఁ జావవలయు" ననెను. చూచుచుండఁగా నాతని బంధుమిత్రులు పోగై, యా మృతకళేబరము నొక పేటికలోనుంచి, నగరము వెలుపలనున్న పర్వతప్రాంతములకుఁ గొంపోయిరి. నేనును వారి ననుసరించితిని. ఆపర్వతమునందున్న యొక సొరంగ ముఖముకడనున్న శిలను తొలఁగించి, యా పెట్టెను లోనికి విడిచిరి. పిదప నాపెభర్త నొకపెట్టెలోఁ బరుండజేసి, ఏడురొట్టెలను, కుండెడు జలమునుంచి, ఆ లోయలోనికి జారవిడిచి, సొరంగద్వారమును శిలచే మూసివైచి, వెడలిపోయిరి. "ఇదియేమి దురన్యాయము? ఎచ్చటను నాచరణలోలేని యీ దురాచారము మీ కెట్లలవడిన?" దని వారిని ప్రశ్నించితిని. వారు "మా దేశాచారమింతే" నని, యానందముగ వెడలిపోయిరి.

నా చిత్తము వ్యథితమైనది. మఱునాఁడు రాజుకడకేగి, "విదేశీయుఁడనగు నాకుఁగూడ నీ చట్టము వర్తించునా?" యంటిని—

"అగును. ఇచ్చట నీవు వివాహముఁ జేసికొనియున్నందున నీకిది తప్పకవర్తించును".

ఆ రాజేశ్వరుని సమాధానము నాభీతిని రెండింతలు చేసెను. సాధ్యమైనంత త్వరలో సతీసమేతముగ స్వదేశమునకుఁబోవు జతనముల నలుపసాగితిని. నాభయమున కనుకూలముగా నాసతి ప్రయాణపుదినమున జ్వరపీడిత యగుటచే నాగవలసినవాఁడనైతిని. మూఁడుదినములు బాధపడి, నాసతి పరమపదించినది. నాదుఃఖమునకుఁ బరిమితి లేదు. అకారణముగ నేను మృత్యువుపాలు కావలసివచ్చినది. ఆ దేశాధీశునికడకేగి, బ్రతిమాలితిని. లాభము లేకపోయినది. నాభార్యను

14

నన్ను సారంగములోనికిఁ ద్రోసివైచి, మిత్రులు వెడలిపోయిరి. నిధిని దూరమును, దుర్గంధమయమైయున్న యీ సారంగములోఁ బడి, కర్తవ్యవిమూఢుఁడనై యుంటిని. ఆ సారంగ మెంతదూరమున్నదో యని నడచి వెళ్ళితిని. చీఁకటిపడినది. నక్షత్రమొండు నాకుఁ గాన్పించుటచే బయటకుఁ బోవు రంధ్రమేదైన నట నుండునని భ్రమించితిని.

తెల్లవారినది. నిజముగా నొక పెద్దరంధ్రమును నేను గాంచితిని. ఆ రంధ్రములోనుండి యీవలకుఁ బోయితిని. సముద్రతీరము! అటనుండి నగరములోనికేఁగుటకు వీలులేదు. ఏదైన నొక ఓడ యామార్గమున వేగనేమోయని చూచితిని. రెండుదినములట్లు వేచియుంటిని. మూఁడవనాఁ డొకయోడ దృగ్గోచరమయ్యెను. ఉత్తరీయము [illegible] విసరితిని. ఆయోడకప్తానది చూచి, యొక చిన్నదోనె నంపెను. నేనోడను జేరితిని. నాకష్టములు వారికిఁ దెలుపగా, వారందఱు నత్యాశ్చర్యనిమగ్నులైరి. కొన్నిదినములకు, నౌక బస్రా ద్వీపముఁ జూచి. నా సారంగములో నే గొని తెచ్చిన రత్నములు విక్రయించి, బాగ్దాదు నగరముఁ జేరి, హాయిగా గాలము గడుపసాగితిని".

"ఈప్రయాణవిశేషములు జాల నానందదాయకముగనున్న" దని, హిందుబాదును దదితరులును పలికి, తమతమ గృహములకరిగిరి.

---

# 14 సింద్‌బాద్ పంచమ నౌకాయానము.

హిందుబాదు మున్నగు స్నేహితులు ఫలాహారముల భుజించిన పిదప సింద్‌బాద్ యివ్విధముగఁ జెప్పసాగెను.—

నా కింతకుముందు సౌఖ్యముగాఁ గాలముగడుపుచుఁ దుర్ఘటంబైన నౌకాయానమునందే మనస్సు విశేషముగ లగ్నమైయుండెను

ఒకని యోడనెక్క, ఆ కప్తానునకు లోఁగియుండుటకంటె, ప్రత్యేకముగ నొక యోడ యుండుట యుత్తమోత్తమ మని తలంచి, యొక పెద్ద యోడనుకొని, కొంతమంది వర్తకులను జేర్చుకొని బయలు దేఱితిని. కొన్ని దినములు పయనమొనరించి, మే మొక దీవిం జేరితిమి. ఆ దీవిలోఁ గొంతతడవు విశ్రమింపనెంచి, లోని కేగితిమి. ఒకచోట రాక్‌పక్షి గ్రుడ్డును చూచితిమి. నా మిత్రులకంతకును నా రాక్‌పక్షి వృత్తాంతము తెలిపితిని. నా మిత్రులు నేను లేనితఱి, నా గ్రుడ్డును చితుక కొట్టి పచనమొనరించి భక్షించిరి. నాకుఁ దెలిసినపిదప, నెట్టియున వారి యవివేకకార్యమును నిరసించి యీ కార్యము మొనరుని భయపడి, త్వరితముగ నౌకను బయలుదేఱఁదీసితిమి. మా యోడ కొంతదూరము పోయెనో లేదో పైన నల్లనిమేఘములు క్రిందికి దిగివచ్చుచు భ్రమింపఁజేయు నట్లు ప్రతిమంతోయు ఝంకారబంధురమాయెను. ఆడు రాక్‌పక్షి, మగపక్షిని గూడికొని క్రిందికి వ్రాలుచుండెను. రాక్‌పక్షులు మాపైఁ బగఁదీర్చుకొనుటకై వచ్చెనని గ్రహించితిమి. ఆ పక్షులు పెనుశిలలను, వృక్షములను మా యోడలపైఁ బడవేయసాగెను. ఒకశిల యోడ మధ్యభాగమునఁ బడగా, నది తుత్తునియలై పోయెను. కొందఱు మరణించిరి. నౌకయొక్క భగ్నమైన చెక్కపైఁ బడి, దైవముపై భారమిడి యీదుకొంటిని. రెండు దినములకుఁ దీరముఁ జేరితిని.

నేను చేరిన దొక దీవి. సుందరముగనున్న యా దీవిలోఁ గొన్ని చూతఫలముల నారగించి, యొకచోనున్న కాసారములోని నిర్మలజలముం గ్రోలి యొకచో విశ్రమించితిని. నాకొక ముసలివాఁడు కాన్పించెను. అతఁడు కాసారసోపానములపైఁ గూర్చుండియుండెను. తనదగ్గఱకు రమ్మని యాతఁడు సంజ్ఞాపూర్వకముగ నాకుఁ దెలియఁజేసెను. ఆ ముదుసలిని సమీపించినతనే, తన్నావలియొడ్డునకుఁ దీసికొని పొమ్మని సంజ్ఞ చేసెను. ఆతని నెత్తుకొని యావలియొడ్డునకుఁ బోవఁగనే, యాతని

దిగుమంటిని. అతఁడు క్రిందికిదిగక తనకాళ్ళను నాకంఠమునకు బిగించెను. నన్నుకొట్టి, గిల్లి, రక్కి, బాధించెను. అతని నెట్లయిన వదల్చుకొనఁనెంచి, యొక కఱ్ఱతో నాతనిశిరముపై మోదితిని. అతఁడు మృత్యుదేవతపాలికిఁ జనెను. నేనంత దీవినుండి సముద్రతీరమునకు వచ్చితిని. నా యదృష్టవశమున నొకనౌకను గాంచితిని. ఆ నౌకాధికారికి నా చరిత్రముఁదెలుప, నాతఁడు కరుణాంతరంగుఁడై నన్ను నౌకయందెక్కించుకొనియెను. మేము పెక్కునగరముల సందర్శించితిమి. ఒక నగరమున కేగి, యచటనుండి యరణ్యమున కేగితిమి. ఆ వనము కోఁతులతో నిండియుండెను. మేమా కోతులపై ఱాళ్లరువ్వగా, నవి క్రోధాతిశయమున మాపైఁ గొబ్బరికాయల గిరవాటువేయసాగినవి. ఆ కాయలను దీసికొని, నౌక కేతెంచి, కన్యాకుమారి అగ్రమువఱకును బోయి, మంచి ముత్యముల సేకరించి, బాలోన్సరామీఁదుగా బాగ్దాదును జేరితిని. ముత్యముల విక్రయింపగా నమితమగు లాభ మొదవెను. ఆ లాభములోఁ బదవవంతు బీదలకు దానమొసంగితిని. నేను హాయిగా జీవింపసాగితిని".

---

# 15 సింద్‌బాద్ షష్ఠీ నౌకాయానము.

—:0:—

"ఏది యెట్లున్నను, ప్రయాణములం దెన్నికష్టముల నెదుర్కొనవలసియుండినను, లాభముమాత్ర మత్యధికముగఁ గల్గుచుండుటచే నాజవపర్యాయము మఱల బయలుదేఱితిని. కాని యొక్కవత్సరము విరామము గైకొనుటచేఁ బ్రయాణము చాలకాలముచేసి, యపరమితలాభము నార్జింపఁదలంచితిని దూరదేశప్రయాణ మొనరింపఁబోవునట్టి యొక యోడకప్తానుతో మాట్లాడి, యాతని నౌకపై బయలుదేఱితిని.

ఓడ శీఘ్రగమనమునఁ బోసాగెను. కొలఁదిదినములు పయనమొనరించినపిదప, కప్తాను మమ్ములనందఱనుబిలిచి, "మిత్రులారా! దురదృష్టవశమున మార్గముఁ దప్పితిమి. ఇఁక మనకు గత్యంతరములేదు. ఇచ్చట ప్రవాహవేగమధికము. ఈవేగమున కోపఁజాలక యొకమహోన్నతపర్వతముకడకు మనలఁ దీసికొనిపోవును. ఆనగమునకుఁదగిలి, నౌక శతసహస్రభిన్నమగును. కావున దైవప్రార్థన మొనరించి, మరణమునకు సిద్ధముగానుండు" డని హెచ్చరించెను.

మేమందఱమును నంతట దుఃఖాశ్రుపూరిత లోచనులమైతిమి. ప్రవాహవేగమున నౌక శరవేగమునఁబోయి, నగమునకుఁదగిలి తుత్తునియలై పోయినది. మాలోఁగొందఱు చనిపోయిరి. నేనును గొందఱు మిత్రులు నాపర్వతమును జేరితిమి. అటనుండి పోవుమార్గము లేనందున నందఱును మరణింపవలసియుండెను. మాకడనున్న యాహారపదార్థములై పోయెను. ఒకనితరువాత నొకరు కాలునిపాలి కరుగుచుండిరి. నేను తప్ప మిగిలినవారందఱును మరణమునొందిరి. పర్వతమునంటియున్న యొకగుహలోని కేగితిని. అట నమూల్యములైన వజ్రవైఢూర్యగోమేధికము లుండెను. వానిలో కొన్నిటి నుత్తరీయమున మూటఁగట్టి సముద్రతీరమున కరిగితిని. అటనున్న కలపదూలములతో నొకచిన్న నావను నిర్మించి, ఆగుహనుండి పోఁజొచ్చితిని. ఆహారము మూఁడు దినములనుండి లేకపోవుటచే మిక్కిలి నీరసముగ నుండెను.

ఆగుహనుండి నావ మహావేగమునఁ బోసాగెను. నాకు స్మృతి లేదు. ఎంతసేపు పయనమొనరించితినో నాకుఁ దెలియదు. కనులఁ దెఱచి చూచుసరికి నీగ్రోలమధ్యనుంటిని. వారు నేనారగించుటకు ఫలములనిచ్చిరి. త్రాగుటకు దుగ్ధమొసంగిరి. నారత్నములమూటను నాకిచ్చిరి. నన్ను తమరాజుకడకు రమ్మని కోరిరి. వారితో నేను సిరండిబ్

పురమునేలు రాజేంద్రునిఁ గాంచితిని. అతఁడు నాచరిత్రమువిని మిక్కిలి ముదమొందెను. ఓడవచ్చుదినము నెఱింగి, ఆరాజేంద్రుని సెలవుగైకొనుట కేగితిని. అతఁడు మా బాగ్దాదునేలు కాలిఫ్‌హారాన్ అలరాషీద్ నకొక రత్నము, సువర్ణనిర్మిత రక్షాబంధనము, ఒక నవలావణ్యోద్భాసితయగు సుందరి—వీనిని బహుమానముగ నిమ్మని, యొకలేఖనిచ్చెను.

కొలఁది దివసములకేను బాగ్దాదుచేరి కాలిఫ్‌ను సందర్శించి, సెరిండిబ్ మహీపాలుఁ డొసంగిన బహుమానముల సమర్పించితిని. ఆరాజన్యుఁ డత్యధికామోదమునొంది, నన్ను సత్కరించెను. హాయిగా కాలము గడుపఁదొడఁగితిని.

---

## 16 సిండ్‌బాడ్ సప్తమ నౌకాయానము.

ఈ ఆఱుప్రయాణములలోని కష్టములతో నాకాయము చిల్లులు పడియుండుటచే నిఁక యోడప్రయాణముల విషయమై కలలందైన తలంపక సుఖసాగరతరంగముల నోలలాడసాగితిని. ఒకనాఁటి యుదయమున రాజభటుఁ డొకఁడరుదెంచి, "ఖాలిఫ్‌గారు తమ్ము జరుగురుగా రమ్మనినా" రని చెప్పినాఁడు. అతని ననుసరించి, నేను రాజసన్నిధి కేగితిని. ఖాలిఫ్ "మిత్రమా! సిండ్‌బాడ్! సెరిండిబ్‌దీవి నేలు నృపమౌళికిఁ బ్రతిబహుమాన మొసఁగనలసిన బాధ్యత నాయందున్న విషయము నీ వెఱుంగనిదికాదు. కావున నేనిచ్చు బహుకృతిని, యొక చిన్నయుత్తరమును దీసికొని, నీవు సెరిండిబ్‌నకుఁబోయి రావలయును. తప్పదు. నీవు ఆఱుసార్లు పయనమొనరించి యుంటివని, పెక్కుకష్టములకు లోనైతివని యెఱుంగకపోలేదు. అయినను, ఆ దీవికి నీవుతప్ప, యితరులేఱును బోయి, తిరిగి రాఁజాలరు" అనెను.

ఆ ప్రభువు నాజ్ఞ మీఱఁజాలక, యంగీకరించి, లేఖను బహుమానముగ నొసంగిన మూఁడువేలవరహాలను తీసికొని బయలుదేఱితిని. కొలఁది దినములకు సెరిఁడిబ్ చేరి, ఆ దీవినేలు రాజునకా బహుమాన మిచ్చితిని. ఆ రాజు మహానందమునొందెను. నన్ను చిత్రరీతిని సత్కరించెను. ఆ రాజన్యుని బహుకృతులఁగైకొని నే నోడనెక్కి బయలుదేఱితిని.

ఆ యోడ నే దుర్ముహూర్తమున నారోహించితినోగాని, యది దొంగలయోడ కంటఁబడెను. ఆ చోరులు మమ్ముబంధించి, యొక దీవిలోనికిఁ గొంపోయిరి. ఆ దీవిలో మే మందఱమును చోరులచే బానిసలుగా విక్రయింపఁబడితిమి. నన్నొక వర్తకుఁడుకొనెను. ఆతఁడు దయాంతరంగుఁడు—వేఁటలో నాకుఁ బ్రావీణ్యముకలదని యాతఁడు తెలిసికొనెను. నన్నాతఁ డొక కాననమునకుఁ దీసికొనివెళ్లెను. కుంజరముల సమూహమునొండు చూపి, దినమున కుంజరమునుజంపి, దాని దంతములఁ దెమ్మనెను. బాణతూణీరములఁగొని, నేనట్లే కొన్ని సామజములఁ జంపితిని. ఒకనాఁడు కాననమునకరిగి శరము సంధించునంతలోఁ గొన్ని యేనుఁగు లరుదెంచి, నేనుగూర్చుండియున్న వృక్షమును సమూలముగఁ బెకలించుకొని పోసాగెను. నేను మిక్కిలి భయపడితిని. ఆ యేనుఁగులు నేనున్న భూరుహము నొకచోనుండి వెడలిపోయినవి. గుండె గటువుచేసికొని, నేనుమెల్లగా కనులుతెఱచి చూచితిని. మహాశ్చర్యము. ఏనుగుల దంతములట గుట్టలుగుట్టలుగాఁ బడియుండెను. పాపము. వానిని, నే ననుదినము చంపుచుండుట గ్రహించికాఁబోలు, నన్నటకుఁ గొనిపోయి విడిచినవవి. నేను వర్తకుని గృహమునకుఁ బోయితిని. ఆతఁడు నాకొఱకాందోళనాయత్తచిత్తుఁడై యుండెను. నేనావర్తకునిఁ గొన్ని బండ్లను దీసికొని, యటనున్న దంతముల నన్నిఁటినిఁ దెచ్చితిని. ఆ వణిక్పుంగవుఁడు సగముదంతములను మాత్రమే తానుతీసికొని,

మిగిలినవన్నియు నాకిచ్చెను. నేను వాని నోడలోవైచి, పయనమై పలుతావులందు దంతములనమ్మి యమిత ధనార్జనమొనరించి, బాగ్దాదు చేరితిని. ఖలీఫా కిదియంతయుఁదెలుప నాతఁడు ప్రముదితాత్ముఁ డయ్యెను. నేనాధనముతో కులాసాగాఁ గాలము గడుపసాగితిని—"

సింద్‌బాద్ యీకథను ముగించి, విస్మయపరవశుఁడై యున్న హింద్‌బాదునకుఁ గొంతధనమిచ్చి, పంపెను.—

---

# 17 మూఁడు పండ్లకథ.

బాగ్దాదునగరమునకు కాలిఫ్ అయిన హారాన్ ఆలరాషీదు ప్రభు వొకనాఁడు వజీరగు జిఫూఫరును బిలిచి "నగరమున నాపాలనముఁ గూర్చి, ప్రజాభిప్రాయమెట్లున్నదో తెలిసికోవలసియున్నది. ఈరాత్రి సరిగా తొమ్మిదిగంటల కీ వంతఃపురమునకు రమ్ము" అనెను. రాత్రి కాఁగానే వజీరు జియూఫరు ఖలీఫాకొఱకు హాజారముకడ వేచియుం డెను. కొజ్జాలకు నాయకుఁడగు మాసూరు మార్గదర్శకుఁడుగా నా ముప్పురును మాఱువేసములఁదాల్చి, నగరసంచారమున కుపక్ర మించిరి. రాజవీధివిడిచి, సందుగొందులఁబడి, యొకపేటను జేరిరి. అచ్చట వారొక బెస్తనుగాంచిరి. ఖలీఫా "ఓయీ! నీ వేమిచేయు చుందువు? నీ వెవరవు? ఈదేశపురాజు మంచివాఁడేనా? మేము పర దేశస్థులము. కావున మాకెఱిఁగింపు" మనెను.

"ఆర్యా! మాదేశపురాజు చాలమంచివాఁడు. నేను బీదవాఁ డను. జాలరిని. నేఁడొకచేఁపయైన లభింపలేదు. నేఁటిరాత్రి యెట్లుగడ చునో తెలియకున్నది".

ఆ జాలరిపలుకల నాకర్ణించి, ఖలీఫా "ఓయీ! రాత్రియని శంకింపక మమ్మనుసరించి, నదీతీరమునకువచ్చి, వలవేయుము. నీకు మంచి బహుమానమిచ్చెదను" అనఁగా, నాబెస్త సంతోషభరితాత్ముఁడై యందుల కంగీకరించి, వలనుగొని వారివెంటజనెను. నదిలో నాతఁడు వలవిసరి, కొంతసేపటి కీవలకుఁదీయఁగా నావలవో నొకపేటిక చిక్కెను. ఆపేటిక చాలబరువుగానుండెను. ఆ జాలరిచే రాజభవనమునకు వారాపేటికను మోయించుకొని పోయిరి.

ఖలీఫా యా జాలరి కేఁబదివరహాలనొసంగి పంపివైచి, యాపేటికను దెఱచిచూచెను—అతఁడు కాంచినదేమి? నవమోహనాంగి యగు నొక స్త్రీయొక్క మృతకళేబరము. ఆమె యెవరోగాని, హత్యఁ గావింపఁబడియుండెను. ఆమె శరీరావయవము లన్నియు ఖండింపఁబడి యుండెను. ఆ పేటిక రక్తాక్తమై, భయానకముగనుండెను. ఖలీఫా క్రోధఘూర్ణితమానసుఁడై, కనుల నగ్నికణములురాల "ఓయీ వజీర్! నీ యధికారముక్రింద నెట్టిదురంతములు జరుగుచున్నవో చూచితివా? ఈతరుణి యెవ్వరో, యేదుర్మార్గుఁ డిట్టియమానుష కృత్యమునకుఁ బాల్పడియెనో తెలిసికొనుట నీవిధి. మూఁడుదినములలో నీరహస్యము భేదింపఁజాలవేని, మరణదండన పాలగుదువు. పోయిర" మ్మనెను.

పాపము వజీరు భయకంపితుఁడై, యేమిచేయుటకుదోఁచక, రహస్యాపరాధపరిశోధకుల నియమించియు, చారులను నియోగించియు ప్రయత్నించెను. అతఁడెంత ప్రయత్నించినను లాభము లేకపోయెను. మూఁడుదినములు గడచిపోయెను. ఖలీఫా వజీరును బిలిపించి యడిగెను. వజీరు ఖిన్నవదనుఁడై తన్ను మన్నింపుమని కోరెను. కోపావేశపర

వశుఁడై ఖలీఫా భటులనుబిలిచి, వజీరును వధించుమని యాజ్ఞాపించెను. విచారభాష్పాకులనయనుఁడై వజీరు వెడలెను.

మఱునాఁటియుదయమున నెనిమిదిగంటలకు వజీరు ఉరితీయఁబడునని ప్రకటింపఁబడెను. సన్మార్గానువర్తియని పేరొందిన వజీరునిట్లు రాజు శిక్షింపఁబూనినందులకుఁ బ్రజలు మిక్కిలిగా విచారించి, తండోపతండములుగ వధాస్థానమగు మైదానమునకరిగిరి. వజీరును రాజభటులు గొనివచ్చిరి. అతనిముఖము వెల్లదనము నెలిబుచ్చుచుండెను. అతనిదుఃఖమూర్తినిఁగాంచి, యందఱును దుఃఖితాత్ములైరి. వధ్యశిలపై వజీరు నిలుపఁబడెను. ఇంతలో నాజనమును ద్రోసికొనుచు నొక వృద్ధుఁడు, నొకయువకుఁడు నచ్చిరి. యువకుఁ "డార్యా! హంతకుఁడను నేను. నన్నురిఁదీయుఁడు. నిరపరాధియగు వజీరును విడిచిపెట్టుఁ" డని పలికెను.

వృద్ధుఁ "డయ్యలారా! హంతకుఁడనునేనుగాని యీ యువకుఁడుకాఁడు. కావున నన్నురితీయు" డనెను. రాజకీయోద్యోగులు వజీరును, ఆవృద్ధుని, యువకుని ఖలీఫాసమక్షమునకుఁ గొంపోయిరి. యువకుఁడు ఖలీఫానుద్దేశించి "ప్రభూ! హంతకుఁడను నేను. నాకథను దమకుఁ దెలుపుదును" అనెను. ఖలీఫా "సరే! చెప్పు" మనఁగా, నాయువకుఁడిట్లు చెప్పదొడఁగెను.

---

## 18 యువకుని కథనము.

———:o:———

"చనిపోయిన యాపె నాభార్యయేయని ప్రభువులు గుర్తించి యుందురు. ఈవృద్ధునికామె కొమరిత. పదకొండు వత్సరములకుఁ బూర్వము నావివాహము జరిగియుండెను. నాకు ముగ్గురు తనయులు

కలరు. నాసతి సుశీలయైనామాటకెన్నఁడు నెదురాడక, నన్నానందజలధి తరంగమాలికలఁ దేలియాడజేయుచుండెడిది. ఇట్లుండగా నామె సుమారు రెండునెలలకుఁ బూర్వము రోగగ్రస్తయైనది. ఆరోగమునుండి యామెను విముక్తనుజేయుటకై, యమోఘములైన యౌషధముల సేవింపఁ జేసితిని. దైవానుగ్రహమున నామె యారోగ్యవతియాయెను.

ఆమెకుఁ బుట్టినింటికేగ నభిలాషజనించెను. అందులకై యామె నన్ను బజారునుండి కొన్ని ఫలములఁ దెమ్మనెను. అదేమి విడ్డూరమో ఆనాఁడు బజారులోఁగాదు, ఆయూరనైన నొక్క ఫలము లభింపలేదు. ఆమె కుతూహలమెట్లయిన నెఱవేర్చు నభిప్రాయముతో, పదునైదు రోజులు తిరిగి తిరిగి, తుదకు బాల్సోరానగరమునుండి మూఁడుపండ్లను తెచ్చియిచ్చితిని. రెండురోజులుగడచెను. ఒకనాఁడు నేను నా వస్తు విక్రయశాలలోఁ గూర్చుండియుండగా నొక వికృతాకారుఁ డరుదెంచెను. ఆతని చేతిలో నొకఫలముండెను. దేశములో నెచ్చటను ఫలములు దొరకని యాకాలమున నాతనిచేతిలో నేను బాల్సోరానుండి తెచ్చినఫలమే యుండుటగాంచి, యాశ్చర్యచకితుఁడనై “ఓయీ! నీకీ పండెక్కడి” దని ప్రశ్నింప, నాతఁడు పకపకనవ్వుచు “ఈఫలము నా ప్రియురా లిచ్చినది. ఆమెభర్త పదునైదుదినములు తిరిగితిరిగి, బాల్సోరానుండి మూఁడుఫలములఁదెచ్చెనట. నా కందొకటి యిచ్చిన” దని, వెడలిపోయినాఁడు. ఆపాదమస్తకము నాయొడలు క్రోధముచేఁ గ్రాగిపోయినది. విక్రయశాలను మూసివైచి, తిన్నగా నింటికిఁబోయితిని. నా సతి ప్రక్క రెండేఫలములుండెను. మూఁడవపం డేదియని యడుగ నామె ‘యేమో నాకుఁదెలియ’ దనినది. నా యనుమానము ప్రబలమైనది. నా కొడలు తెలియని కోపముకల్గినది. వెంటనే యామెను బాకుతోఁబొడిచి, చంపి, యామృతకళేబరము నొకపేటికలోనుంచి, నదిలోఁబడవైచితిని. తదుపరివృత్తాంతమంతయు మీకు సాంతముగఁ

దెలిసెగదా. నా మామగారువచ్చి తనకూతురు మరణమునకు వగవసాగెను. నే నింటికిఁ దిరిగిరాఁగానే నా మూఁడవకుమారుఁ డేటు నుండియో యేడ్చుచువచ్చి "అమ్మకడనున్న ఫలములలో నొకదానిఁ దీసికొని వీధిలో నాడుకొనుచుండ నీగ్రోబానిస యొకఁడు నాచేతిలోని ఫలము లాగికొనెను. నేను బ్రతిమాలితిని. మా యమ్మకు జబ్బుగా నుండుటచే మాతండ్రి పదునైదుదినములు కష్టపడి, బాసొరానుండి యీఫలములఁ గొనివచ్చెనని చెప్పినను, వినక, యాతఁడు వెడలిపోయె" నని చెప్పెను—

నేను నిర్విణ్ణుఁడనైతిని. ప్రియమయురాలైన నాసతిని నిష్కారణముగఁ జంపినందుల కెంతయుఁ బశ్చాత్తాపపడితిని". అని, యా యువకుఁడు తనకథ ముగించెను. ఖలీఫా యాలోచించి "ఈ యువకుఁడు కోపాతిరేకమున నట్టియకార్యముఁ జేసెను. ఇదంతయు నా నీగ్రోబానిసవలన జరిగినది. అతఁడు వధార్హుఁడు. వజీర్ ! ఈ యువకుని వదలివైచెను. ఆ నీగ్రోబానిసను మూఁడుదినములలోఁ బట్టుకొనవలెను. లేదా నాలవనాఁ డాతనికి బదులు నీవే మరణదండనను ననుభవింపవలసియుండును". అనెను.

వజీరు గుండెలలో తాయిపడెను. హంతకుఁడు దొరకుటచే తనబాధ్యతఁ దీఱెనని యాతఁ డానందించుచుండఁగాఁ బిడుగువలె నీవార్త సోకెను. అతఁ డింటికిఁబోయి, దైవముపై భారమిడి యూఱకుండెను. నాలవనాఁ డాతని నురిఁదీయుటకుఁ గొనిపోవ రాజభటు లేతెంచిరి. ఆస్తినంతయు భార్యాపుత్రులకు వ్రాసి, నిరాశాహతుఁడై వజీరు యీవలికివచ్చెను. గృహప్రాంగణమున దాది తన తనయు నాడించుచుండెను. ఆ బాలుని కరమునందొక ఫలముండెను. ఆఫల మెచ్చటిదని వజీరు పరిచారికను బ్రశ్నించెను. ఆమె "మన బానిసనుండి బేడకు కొంటిని స్వామీ" అనెను. ఆపలుకులు కర్ణానందకరములైతోఁచ,

వజీరు ఖానిసను బిలిపించి, ఫలము వివరయమడిగెను. ఆతఁ డావృత్తాంత మును జెప్పెను. వజీరా ఖానిసనుగొంపోయి ఖలీఫాసన్నిధి నుంచెను. ఆ ఖానిసకు ఖలీఫా మరణదండన విధించెను. వజీరు "ప్రభూ! నౌరుద్దీనాలీ కథ మిక్కిలిచిత్రమైనది. అద్భుతఘటనావిలసితము విని, మీకు దయఁగల్గినచో నీ ఖానిసను విడిచిపెట్టు" డని, యిట్లు చెప్ప సాగెను.

---

# 19 నౌరుద్దీనాలీ.

ఈజిప్టుదేశమును బరిపాలించుచున్న సుల్తానును ప్రజానురంజక ముగాఁ బరిపాలించువాఁడని ప్రశస్తిగాంచెను. సకలసద్గుణసంశోభితుఁ డగు మంత్రి యా భూమీశునకు జేదోఁడువాదోడుగానుండెను. ఆ మంత్రి కిర్వురుకుమారులు మొదటివానిపేరు మంసుద్దీను. రెండవ వాని నామధేయము నౌరుద్దీనాలీ. వజీరు వృద్ధుఁడై, పరమపదమం దెను. ఆతఁడు చనిపోయినపిదప నాసుల్తాను వారలకుఁ గబురంపి "మంత్రి తనయులారా! మీతండ్రి మరణము మీ కెంతయు దుఃఖ దాయకమని యెఱుంగుదును. మీతండ్రి యుద్యోగము మీ కిచ్చెదను. జాగ్రతగఁ జేసికొనుఁడు" అనెను. మంసుద్దీనును, నౌరుద్దీనాలీయు వల్లెయని, మంత్రిత్వమువహించి, కడుంగడు జాగరూకతతో మెలంగు చుండిరి. ఒకనాఁటిరాత్రి వారిర్వురును భోజనమొనరించి, వెన్నెలలోఁ గూర్చుండి, సరససల్లాపనిమగ్నులై యుండిరి. అపుడు మంసుద్దీ నిట్లని యెను.——

"తమ్ముఁడా! నేను రేపటియుదయమున సుల్తానుతో మృగయావినోదార్థమై కాంతారమునకుఁ బోవలసియున్నది. మనకు వివాహము లోకేదినంబునఁ గావలయును. ఒక కుటుంబములోని బాలికలను వివాహముఁ జేసికొనవలయును. నీ సతియు, నా ప్రేయసియు గర్భవతులగుట సంభవించునేని. నీకుఁ బుత్త్రుఁడును, నాకుఁ గుమార్తెయు జన్మించుట తటస్థించునేని వారికి వివాహముఁ జేయవలయును. అదిగాక, యామెకాభరణములఁ జేయించవలయును". అనెను—

నౌరుద్దీనాలీ "అన్నా! అందులకు వెనుదీయను. గాని వరునకు మూఁడువేలు సువర్ణనిష్కములు నరణముగ నీయవలె" ననెను.—

"ఏమీ! నీ కుమారునకుఁ గట్నమీయవలయునా? నేనల్లుఁడు నీయను. నీ కుమారున కసలే నాతనూభవనీయను. తెలిసినదా? జాగ్రతగ మెలంగుము. నీ వనిన నాకిందులకే పరమాసహ్యము". అని షంసుద్దీను కష్టములతోఁపఁ బలికెను. క్షణములో వారి సరససల్లాపములు జగడముగమాఱెను. ఇర్వురిచిత్తములును కోపోద్దీపితములయ్యెను. క్రోధోన్మత్తులై, వారు తమతమశయ్యాగారములకుఁబోయి శయనించిరి. షంసుద్దీనుకుకంటె నౌరుద్దీను హృదయము మఱింతవ్యాకులత నొందెను. వేకువనే లేచి, షంసుద్దీను సుల్తానుతో వేఁటకేగెను.

నౌరుద్దీనాలీ, తనయెడ నాగ్రహమూనియున్న సోదరునితో నుండనొల్లక, తగుసామగ్రిఁగొని, వెడలిపోయెను. ఆతఁడు తిన్నగా కైరోనగరమునకుఁబోయెను. ఆసమయమున బాల్సోరావజీరు ఏనుఁగు నెక్కి వెడలుచు, మార్గమునకుఁ బ్రక్కగాఁ దొలఁగియున్న నౌరుద్దీనాలీనిఁ జూచెను. తేజస్ఫురితమైయున్న యాతనిమోము వజీరునాకర్షించెను. ఆతఁడు నౌరుద్దీనుఁబిలిచి, "నీదేయూరు? నీనామధేయమేమి?" యని ప్రశ్నించెను. నౌరుద్దీనాలీ తనయుదంతము నెఱిం

గించెను. ఆవజీరు దయార్ద్రహృదయుఁడై, నౌరుద్దీనాలీని దనతో బాల్సొరాకుఁ గొంపోయెను. నౌరుద్దీనాలీ సుందరుఁడు. వజీరుకుమార్తె యాతనిఁ బ్రేమించెను. వజీరు శుభముహూర్తమున వారికి బెండ్లిచేసెను. ఆనాఁడే కైరోనగరంబున మంసుద్దీను వివాహితుండయ్యెను. మంసుద్దీను వేఁటనుండి యింటికిఁ దిరిగివచ్చి, సోదరుఁడు తానాడినపలుకుల కలుకజెంది యెటకో వెడలిపోయినందులకు వగచి, యాతని నన్వేషింప కైరోనగరమునకేగి, యొకయున్నతోద్యోగి తనూభవ పాణిగ్రహణ మొనరించెను. అదేమివిచిత్రమోగాని యిర్వురిభార్యలును గర్భవతులై, పుత్రికను, పుత్రుఁగాంచిరి. మంసుద్దీనుభార్య కద్వితీయసౌందర్యోపేతయగు కుమార్తెకల్గెను. నౌరుద్దీనునకు సకలసద్గుణఖనియగు కుమారుఁడుదయించెను. ఆతఁడు తన నందనునకు హాస్సానని నామకరణము సల్పెను. వజీరు వృద్ధుఁడగుటచే నౌరుద్దీనాలీ యాతని స్థానమున వజీరయ్యెను.

నౌరుద్దీనాలీ తనతనూభవుఁడగు హాస్సానునకు సకలవిద్యాబుద్ధుల గఱపెను. హాస్సాను పదునేడువత్సరముల వయస్సుగలిగినపుడు నౌరుద్దీనాలి వ్యాధిగ్రస్తుఁడాయెను. తనయవసానదశయసి గ్రహించి, నౌరుద్దీనాలీ కుమారుని చెంతకుఁ బిలిచి మంసుద్దీను వృత్తాంతము తన యుదంతము వ్రాసియున్న యొకకాగితమునిచ్చి, 'దీనిని భద్రముగ నుంచుకొను' మనియు, వజీరుగానుండి, సుల్తాను మెచ్చుకొనునట్లు మెలంగు' మనియుఁ బలికి ప్రాణముల వీడెను.

దేశాచారము ననుసరించి, హాస్సాను స్వగృహమున నొకమాసము విచారాంబుధి నిమగ్నుఁడై గడపవలసియుండఁగా రెండునెలల వఱకు నీవలకు రాడాయెను. సుల్తానున కియ్యది కోపకారణమయ్యెను. సైన్యాధ్యక్షుని బిలిచి, హాస్సానును గొనిరమ్మనిపంపెను. ఆతని రాకను గాంచి, పరిచారకుఁడు "ప్రభూ! సుల్తాను తమయెడ క్రోధమూని

పంపిన సైన్యాధ్యక్షుఁడు వచ్చుచున్నాఁడు. మిమ్మాతఁడు బంధించును. లేఁడు. శీఘ్రముగ నెటకైన వెడలిపొండు" అనెను.

అప్పటికి భానుఁడ స్తంగతుఁడై, యంధకారచ్ఛాయలు క్రమ క్రమముగఁ బ్రపంచము నాక్రమించుకొనుచుండెను. హస్సాను భయకంపితుఁడై పాణిద్వారమునఁ బరువెత్తెను. అతఁడు మసీదును సమీపించెను. ఒక యూదవర్తకుఁడు హస్సానునకు నమస్కరించి, "ఆర్యా! తమ జనకుని యోడలలో మొదటియోడ తేపటిదినమున వచ్చును. ఆయోడలోని సామగ్రిని నేనుకొని, విక్రయించుకొందును. ఇందులకు మీరు సమ్మతించుచో ధరావతుఁగ వేయిసువర్ణనాణెముల నిపుడిచ్చెద" ననెను. అట్లేయని, వేయినాణెములనుగొని, హస్సాను రశీదిచ్చి, తిన్నగా జనకునిసమాధికడకేగెను. రసీదునుగొని, యూద కులజుఁడగు ఐశాక్ సంతోషభరితాంతరంగుఁడై వెడలిపోయెను.

సమాధినిజేరి, దుఃఖాశ్రుపూరితలోచనుఁడై హస్సాను ప్రార్థించి, నిద్రాముద్రితుఁడాయెను. ఒకరక్కసుఁడు గగనమండలమునుండి క్రిం దకువచ్చి, నిద్రాబద్ధుఁడైయుండిన హస్సానుంగాంచి, "ఈతని యపూ ర్వరూపలావణ్యములఁజూడ గంధర్వుఁడో, సిద్ధుఁడోయని తోఁచు ను" యని, యాతనివంక తదేకదృష్టితోఁ గొంతసేపుచూచి, మఱల నింగి కెగిరిపోయెను. వియత్పథమునఁ బోవుచు నాతఁడొక దేవతను గలిసికొనెను. అతఁడు "సుందరీ! దేవతాకాంతలే సుందరాంగులని ప్రసిద్ధి. రమ్ము. మన్మథుని ధిక్కరింపఁజాలిన తారుణ్యవిలసితు, నొక యువకునిఁజూపింతు" నని యామెను మసీదుకడకుఁ గొంపోయి, హస్సానుం జూపెను.

ఆమె "నిజముగా నీతఁడు నవమోహనాంగుఁడే, కాని, నేను జెప్పునది వినుము. కైరోనగరమున షంసుద్దీనను వజీరుకలఁడు. ఆతని కుమార్తె చక్కనిచుక్క. ఆమె వివాహోచితప్రాయమున నున్నది.

ఆమెనుచూచి, సుల్తాను తనకిచ్చి పెండ్లిచేయుమని బలవంతము చేసి నాఁడు. ఆతఁ డట్లుచేయ వీలు లేదనియు తన మేనల్లునకే తన తనయ నీయ నిశ్చయించితిననియు ఖండితముగాఁజెప్పెను. అందుపైఁ గోపిష్ఠ మూని, "తప్పక నీతనయను గూనివాఁడు, వికృతాకారుఁడు నగు వాని కిప్పింతు" నని శపథమూనెను. ఇప్పుడా వివాహము జరుగఁ బోవుచున్నది మనమొక పనిచేయుదము. ఈ సుందరాకారునకా కన్యను బెండ్లిచేసి, యానందింత" మనెను. దానవుఁ డందులకంగీక రింప, నా యిర్వురును హాస్సాను నెత్తుకొనిపోయి, కైరోనగరమున షంసుద్దీను మందిర ప్రాంతమున నుంచిరి. వివాహ కోలాహలముచే నాతఁడు నిద్రనుండి మేల్కాంచెను. నిర్జనసమాధికడనుండిన తానపుడు మఱొకచోట నుండుటగాంచి, దిగ్భ్రాంతుఁడై యేడ్వసాగెను.

రక్కసుఁడును, దేవతయు నట సాక్షాత్కరించి "ఓయీ హాస్సాను! నీవేమియు భీతిల్లకుము నీవిపుడు బాల్సొరానగరమున లేవు. కైరోనగరమిది. ఇది షంసుద్దీనుభవనము. ఆతనిదుహిత జగన్మోహిని ఆమె యొకవిరూపునకు వివాహము చేయఁబడనున్నది. నీవామెను బెండ్లియాడుము. ఇదిగో, ఈదీపమును, యీధనమును గొనిపొమ్ము. అటనున్నవారి కందఱకును ధనమునుయిమ్ము. మేముకూడ నదృశ్యు లమై నిన్ననుసరించియే యుందుము. పో" మ్మనిరి.

హాస్సానా యూరేగింపుటుత్సవమునఁ బాల్గొని, షంసుద్దీను గృహముఁజేరెను. నవలావణ్యతారుణ్య విలసితుఁడగు హాస్సానునుజూచి యొల్లరు "నాహా! ఎంతచక్కనివాఁడు. ఇతఁడే, వజీరుకుమార్తెకుఁ దగినవాఁడు. గూనివానికిఁ గట్టఁబెట్టి, యామెకుత్తుకను గోయుచు న్నారు మనమేట్లయిన నదివారించి, యీయిర్వురకుఁ బెండ్లిసేయుట యుత్తమోత్తమము. శ్రేయస్కరము" అని తలంపసాగిరి. వివాహ

మయ్యెను. వధువావలకుఁబోయెను. వరుఁడు పర్యంకముపైఁగూర్చుండి, మురియుచుండెను. హసాను నేమిసేయుటకునుదోఁచక, యటఁగూర్చుండెను.

ఆవరుఁడు హసానునుంజూచి, "ఏమి ? నీవింకను నిటఁగూర్చుంటివి ? పోవేమి ?" యని గద్దించెను. ఆతఁడు బిక్కమొగమువైచుకొని, యావలకువచ్చునరికి, రక్కసుఁడును, దేవతయుఁ బ్రత్యక్షమై "ఓయీ ! నీవిట్లు పిఱికివాఁడవై తివేమి ? ఆవికృతాంగు నెట్లయిన యావలకు సాగనంపెదను. ఆమెను మధురభాషణముల నలరించి నీవే యామెభర్తవని తెలుపుము" అని యదృశ్యుఁడై యొకబల్లిరూపముఁ దాల్చి, వరుఁడున్న గదిలోఁ బ్రవేశించి, యాతని గ్రుమ్మసాగెను. ఆ వరుఁడు భయాకంపితుఁడై యావలకుఁ బాఱిపోయెను.

వధువు మనోజ్ఞముగ నలంకరించుకొని, శయ్యాగారములోఁ బ్రవేశించెను. వికృతాకారుఁడుగాక, నవమోహనాంగుఁడగు యువకుఁడుండుటగాంచి, యాశ్చర్యానందమగ్నమాయెను. ఆమె హసానును సమీపించి, మెల్లగ "జగన్మోహనకరమైన సౌందర్యముచేనొప్పు నీవెవరవో నే నెఱుంగవచ్చునా ?" యనెను.

"నీపతిని నేనే. ఆవికృతాంగుఁడు వెడలిపోయినాఁడు".

హసాను భార్యతో నానందసాగరతరంగముల నోలలాడెను. ఇరువురు నిద్రాముద్రితులైరి.

రక్కసుఁడును దేవతయుఁ గలిసికొని, హసాను నెవ్వరును జూడకుండ గొంపోయి సిరియాదేశపు ముఖ్యపట్టణమగు డమాస్కసు నగరమున నొకచోనుంచి, మాయమైపోయిరి. ఉదయమున ప్రార్థనాలయమునకుఁబోవుచు జనులు హసానునుంజూచి "రాత్రి ధరించు దుస్తుల నీతఁడు విడువక యిట్టేఁబడియుండుట యీతఁడు త్రాగుబోతని సూచించుచున్న" దని, యొకఁడును, "పాపము, ప్రియురాలితోఁ

గలపి, యీతఁడు నిద్రకు మొగమువాచియున్నాఁడని, తెలుపు చున్న" దని యొకఁడును బలువిధములఁ జెప్పుకొనసాగిరి. వారికోలా హాలముచే హస్సాను మేల్కాంచి, కూర్చుండి, యా ప్రజానమూ హాము నుద్దేశించి "అయ్యా! మీరేల నన్నువింతగాఁ జూచుచు న్నారు? నేనిపు డెచటనున్నా?" నని ప్రశ్నించెను.—

వారిలో నొకఁడు "ఓయీ! ఇది డమాస్కసు నగర" మనెను—"ఆర్యా! నాతోఁ బరిహాసమా! నిన్నసాయంకాలము నేను బాల్సోరాయందును, రాత్రి కైరోమహానగరమునను, గడపి తిని". అని హస్సానుపలుక వారు పకపకనవ్వుచు "నిజముగా నీతఁడు మతిభ్రష్టుఁడై నాఁడు. నిన్న బాల్సోరాయందు, రాత్రి కైరోలోను, ఉదయమున డమాస్కసు పట్టణమునను నుండుట యసంభవము గదా!" అనిరి—

"అయ్యా! నిజము! రాత్రి కైరోనగరమున నొక కన్యను బెండ్లియాడితిని".

ఆ జనులు మఱింత హేళన చేయసాగిరి. అతఁడు పిచ్చివాఁడని ఱాలు రువ్వసాగిరి. హస్సాను తన దురదృష్టమును నిందించుకొనుచు, పరుగిడసాగెను. ఆయాసము హెచ్చుగా నాతఁడొక మిఠాయి యంగ డిలోఁ బ్రవేశించి, తలదాచుకొనెను. ఆ యంగడియజమాని హస్సాను వృత్తాంతము నాకర్ణించి, దయార్ద్రహృదయుఁడై "ఓయీ! ఓరిమి సర్వశ్రేయములకు మూలము. నేను పుత్రహీనుఁడను. నిన్ను పెంచు కొందును. నాకడ నుండుము. నీ కెట్టిలోపమును రాదు." అనెను.— నిరాశ్రయుఁడై యుండుటచే, హస్సానుకా యజమానిపలుకు లమృ తోపమానము లయ్యెను. అతఁడందుల కంగీకరించెను. ఇట నిట్లుండగా, హుస్సానును బరిణయమైన మంసుద్దీను దుహితస్థితిఁ గాంచుదము.

ఆమె నిద్రనుండి మేలుకొని, ప్రియునిగానక, సందేహాయత్తచిత్త యాయెను. షంసుద్దీను తనకుమార్తె, సుల్తానుచేఁ బంపఁబడిన యా గూనివానితో నెట్లుగడపినదోయని, వ్యాకులితాత్ముఁడై చూడనేగెను.

ఆపె యానందవికసితాననయై కన్పట్టుట యాతనికివిస్మయకారణ మయ్యెను. "అమ్మాయీ! ఏమిది? ఆ వికృతాకారుఁడు—అదుష్టుఁ డేమయ్యె?" నని ప్రశ్నించెను.—

"తండ్రీ! నేను వికృతాకారునిపొందుఁ బడయలేదు. సుంద రాంగుఁడగు యువకుఁడే నాభర్త. సుల్తానుబంపిన యాతఁడు నాకుఁ గాన్పించనేలేదు".

ఆతఁడు భయపడెను. కుమార్తెపలుకుల యర్థమాతనికి బోధ పడలేదు. సుల్తానాగ్రహపరవశుఁడై తన్నేమిచేయునోయని, యాతఁడు సంశయించెను. ఆతఁడు గృహప్రాంగణమున నొకచోఁ బడియున్న గూనివానింజూచి, యాతని శరీరమునకుఁ గట్టబడియున్న త్రాళ్ళను విప్పెను. ఆ గూనివాఁ డొక్కక్షణమైన నటనిలువక పాఱిపోయెను. షంసుద్దీను మఱల కుమార్తెకడకరిగెను. ఆమె "తండ్రీ! నామాట లను విశ్వసింపవేమి? ఇదిగో నా ప్రాణేశ్వరుని తలపాగా". యని యిచ్చెను. ఆ శిరోవేష్టనిర్మాణచాతుర్యమును షంసుద్దీను "ఇది మెస్ప టోమియా లోని నేఁతపనివారలచేఁ జేయఁబడియుండవచ్చు" నని, పరిశీలించెను. ఆ శిరోవేష్టమునందొక పత్రము నాతఁడు గాంచెను. అందిట్లుండెను —

"బాల్సొరావజీరగు నూరుద్దీనాలీకిఁ జెందియున్న యోడలలో మొదటవచ్చు నొకలోనిసామగ్రిని గొనుటకొడంబడి, నూరుద్దీనాలీ తనయుఁడగు హసానునకు ధరావత్తుగా యిచ్చినదూపాయలు వేయి.

ఇట్లు వర్తకుఁడు ఐశాక్".

ఈరసీదుగాక, నౌరుద్దీనాలీ యవసానదశలోఁ గుమారునకిచ్చిన వ్రాత ప్రతియు, నాతఁడు చదివెను. అందు నౌరుద్దీనాలీ తనకు వివాహమైన తేదీయును, పుత్త్రుఁడు జన్మించినతేదీయును నుల్లేఖించెను. కుమార్తె యింతలోఁ దలగడక్రింద నీసంచియున్నదని, యొకసంచిని దెచ్చెను. అందు వేయిరూప్యములుండెను. వానినన్నిఁటినిఁ జూచి, షంసుద్దీను కెవ్వున గేకవైచి, మూర్ఛాగతుఁడాయెను. ఆతనిదుహిత శీతలోపచారములఁ జేసెను. మూర్ఛనుండి తేరుకొని, షంసుద్దీను "అమ్మా! కొలఁదివత్సరములకుఁ బూర్వము నీవివాహవిషయమై నీవుజన్మింపకుండగనే మేమొకరినొకరు దూలనాడుకొంటిమి. ఆనాఁడే నాసోదరుఁడు నౌరుద్దీనాలీ కోపగించి, యింటినుండి వెడలిపోయెను. విచిత్రమైనఘటన ? ఆతనికిఁ బుత్త్రుఁడును, నాకు నీవును నొకేదినమున జన్మించిరి. ఇరువురకు దైవానుగ్రహమున వివాహము జరిగినది. కాని యిపుడాతఁ డెచ్చటనున్నాఁడో కన్గొనవలయును" అనెను—

షంసుద్దీను కొమరిత గర్భవతియాయెను. శుభదినంబున నామె చక్కని మగశిశువును గనెను. ఆ బాలునికిఁ దాతయగు షంసుద్దీను 'అజీబ్' అని, నామకరణముఁ జేసెను. తోడిబాలురలో నాతఁడు గర్వోన్మత్తుఁడై సంచరించుచుండెను. ఆ బాలురు క్రుద్ధులై, యాతని నెల్లయినఁ బరిభవింపనెంచి, యొకనాఁ డాటలోఁ దమతమ తలిదండ్రుల పేర్లు చెప్పుకొనుచు, నజీబును "నీ తండ్రి పేరెవ ?" రని, యడిగిరి. షంసుద్దీనని యాతఁడు బదులుచెప్పెను. వారందఱును "నీ తండ్రి యెవరో తెలియదా ? షంసుద్దీను నీతాతగాని తండ్రి కా" డని, వివిధముల గేలిసేయసాగిరి. అజీబు తన తల్లికడకేగి, విషణ్ణవదనుఁడై జరిగినదంతయుఁ జెప్పెను. షంసుద్దీ నిదియంతయుఁ దెలిసికొని, సుల్తాను కడ సెలవుఁబెట్టి హసాను నన్వేషించు తలంపుతో సపరివారముగ

బయలుదేఱి, కతిపయదివసములకు డమాస్కసు నగరముఁజేరి, పుర బాహ్యప్రదేశమున గుడారముల నిర్మింపఁజేసెను. నౌకరును వెంట నిడుకొని, అజీబు సాయంసమయమున నగరమును జూచుట కేగెను.

అజీబు సుకుమారసుందరాంగుఁడు. ఆతనిఁజూచి, డమాస్కసు నగరవాసులు మిక్కిలి యాశ్చర్యము నొందసాగిరి. వారు హస్సాను మిఠాయి దుకాణమును సమీపించిరి. ఆబాలుఁ డాకర్షకముగ నుండు టచే హస్సాను దుకాణములోనికిఁ గొంపోయి, రుచ్యములగు భక్ష్యము లచే సంతృప్తునిఁజేసెను. షంసుద్దీను హవరా, ఆలెఫ్, మార్డిన్ మొద లగు నగరములఁ జూచుకొనుచుఁ దుదకు బాస్సోరాచేరెను. ఆతఁడు నౌరుద్దీనాలీ సౌధమున కేగెను. నౌరుద్దీనాలీ భార్యనుజూచి, షంసుద్దీను తన యుదంతమును సాంతముగ నెఱింగించెను. ఆమె "అన్నా! నా కుమారుఁడు హస్సానుజాడ తెలియకపోవుట మిక్కిలి విచారకరముగ నున్నది. ఏమిచేయుదు?" నని ప్రశ్నింపఁగా, నాతఁడు "అమ్మా యీ! నాతో బయలుదేఱిరమ్ము. ఏనగరమునకైన నాతఁడు కాన్పిం పకపోఁ" డనెను.

వా రందఱును మఱల బయలుదేఱి, డమాస్కసునగరముఁ జేరిరి. అజీబు మఱల నౌకరుతో సాయంసమయమున వాహ్యాళికై బయలుదేఱి, హస్సాను మిఠాయిదుకాణమును సమీపించిరి. హస్సా నజీబును దుకాణములోనికిఁ గొంపోయి, యప్పుడే తయారుచేసిన మిఠాయిని దినుమనెను. అజీబా మిఠాయియుండలను దిని, నౌకరుతో గుడారమున కేగెను.

అప్పటికి నౌరుద్దీనాలీభార్య మిఠాయిని దయారుచేసియుంచెను. ఆమె యజీబున కామిఠాయిని బెట్టెను. ఆతఁడు నేనిఁక నేమియుఁ దినలేను. ఇప్పుడే యంగడిలో మిక్కిలి రుచికరమైనమిఠాయిని దింటి"

ననెను. ఆమె పరిచారకుఁడగు షాబానును బిలిచి "ఓరీ! మూర్ఖుఁడా! ఆగర్భశ్రీమంతుఁడైన అజీబును బజారులో నేదుకాణములోనో మిఠాయిఁ దిన్పింతువా? ఏమియాగడము?" అని కేకలిడెను. నౌకరగు షాబాను చిన్నబుచ్చుకొని, "అమ్మా! మీరుచేసిన మిఠాయినిఁ బెట్టుఁడు. ఎట్లో భుజింతుము" అనినాఁడు. అజీబును, షాబానును మిఠాయి భుజించినారు. అజీబు "మామ్మా! ఇవి మేముతినిన లడ్డులంత రుచికరముగా లేవు" అనినాఁడు—

"ఏమీ! ఈ లడ్డులను దయారుచేయుటలో నాకుఁ బ్రత్యేక ప్రావీణ్యముగలదని నేను గర్వించుచుందును". అని, యామె పలికెను.

"ఏమో! మేముతినిన లడ్డులే చాలబాగుగనున్నవి". అని అజీ బనెను.

"రెండు లడ్డులను గొనిరమ్ము" అని, యామె నౌకరగు షాబాను నంపెను. షాబానేగి యాలడ్డులఁదెచ్చెను. వానిని భుజించి, యామె మూర్ఛాగతయయ్యెను. దాసీలు శైత్యోపచారములఁ జేయఁగా, నామె స్మృతిఁగోల్పోయెను. షంసుద్దీనుపకీ విషయము తెలిసి, యామెను జూడనేగెను. ఆమె యిట్టులనెను—

"అన్నా! నేఁడుసుదినము. నాతనయుఁ డీనగరముననున్నాఁడు. అతఁడే యీలడ్డులను జేసియున్నాఁడు. నేను నాతఁడుతక్క, తదన్యులు లడ్డుల నింతరుచికరముగఁ జేయఁజాలరు. నిజము".

"సరే". యని షంసుద్దీ నేఁబదిమంది పరిచారకులఁబిలిచి, "ఓరీ! మీరలు హస్సానంగడికేగి, 'ఓయీ! ఈలడ్డులఁ జేసినది నీవేనా?' యని యడుగుఁడు. అతఁ డగునని బదులుపలుకును. అంత మీరాతనిని యంగడిలోని మిఠాయి నొకపాత్రలోనుంచి, తిన్నగా, యిటకుఁ గొనిరండు" అనెను. ఆ పరిచారకులేగి, హస్సా నుద్దేశించి,

యట్టులే యడిగినంతఁ నతఁడౌనననియెను. "సరే. నిన్నిపుడు బంధించు చున్నా" మని, వారాయంగడిలోని లడ్డూల నొకవిశాలమగు పాత్ర యందిడి, యాతనిని బంధించి, గొంపోయిరి. నూరుద్దీనాలీభార్య హాస్సా నుంజూచి "నిజముగా నీతఁడే నాతనయుఁ" డనెను.—"నా నాధుఁ డాయనయే" యని, షంసుద్దీను కుమార్తె వచించెను.—

"మీ రేమియుఁ బలుకకుఁ" డని, షంసుద్దీను "హాస్సాను నట్లే బందీగానుంచుఁ" డని, యానాఁడే సపరివారముగా కైరోకు బయలుదేఱెను. కొలఁది దివసములట్లు పయనమొనరించి, షంసుద్దీను కైరోనగరముఁ జేరెను.

అందఱును షంసుద్దీను సౌధముంజేరిరి. షంసుద్దీను కొమరిత నుద్దేశించి "అమ్మాయీ! వివాహమైన రోజున శయ్యాగారమేరీతిగా నలంకృతమైయున్నదో, నేఁడుకూడ నట్లుచక్కగా నలంకరింపుము" అనెను.— ఆరాత్రి హాస్సాను నిద్రాముద్రితుఁడై యున్నవేళ, పరి చారకు లాతని నాశయ్యాగృహమునఁ బ్రవేశింపఁజేసిరి. ఆమె యొక శయ్యపైఁ బవ్వళించెను. కొంతసేపైన పిమ్మట హాస్సాను నిద్రనుండి మేల్కాంచి, యాగదిని, యెదుట నర్ధనిమీలితనేత్రయైయున్న సుంద రాంగినిజూచి, కొన్నివత్సరములకుఁ బూర్వము జరిగిన తనవివాహము నాఁటిరాత్రి జరిగిన విషయములన్నియుఁ గ్రమముగా స్ఫురించు చుండెను.

షంసుద్దీను తనూభవ "నాధా! ఏమిది? అట్లు తెల్లఁబోయి చూచుచున్నారే?" మని ప్రశ్నించెను. హాస్సాను "సతీమణీ! ఇది విచిత్రముగానున్నది. నిజమా స్వప్నమాయని నాచిత్తము భ్రాంతి యుతమైయున్నది. నేను నిన్నువిడిచి యెన్నివత్సరములైనది? ఎన్ని కష్టముల ననుభవించితిని? తుదకు డమాస్కసునగరమున మిఠాయి యంగిడికూడ నేర్పాటుచేసితినే. ఇచ్చటకు ఖైదీగాఁ గొనిరాఁబడి నానే?" అనెను.

ఆమె "ప్రాణేశ్వరా! మీరిపుడేకదా నిద్రనుండి మేల్కొన్నా-నది? మీరేదో స్వప్నావస్థలోనుండియుందు" రనియెను—

"నిక్కముగా నిదియొక యద్భుతస్వప్నము" అని యూపె యూరకొనెను. ఆరాత్రి యాదంపతులు ప్రణయజలధితరంగముల నోలలాడిరి. ఉదయమున హాస్సాను శయ్యాగారము తలుపులఁదెఱచుకొని, యీవలకు వచ్చునరికి షంసుద్దీను బ్రత్యక్షమయ్యెను.

"ఏమీ! విచిత్రము? నీవేనా యీకథకు కారకుఁడవు?"

అని హాస్సా నాశ్చర్యముతోఁ బలికెను. అజీబును, హాస్సాను జననియు నచ్చటికిరాగా, షంసుద్దీను జరిగినదంతయుఁ బూసఁగ్రుచ్చి నట్లు చెప్పెను. ఆనాఁడు గొప్పవిందుజరిగెను. ఆ దంపతు లత్యధికానందభరితాంతరంగులై కాలము గడపసాగిరి".

అని కథను వజీరు జియాఫరు ముగించినంతనే, ఖలీఫా యాబాని సను శిక్షింపకుండ మన్నించెను.

---

# 20 ఇబ్రహీం—గెమిలా.

—:0:—

ఈజిప్టుదేశాధిపతియైన కాసిబ్ నృపాలునకు ఇబ్రహీం అను కుమారుఁడు గలఁడు. ఆతఁ డసాధారణసౌందర్యవిలసితుఁడు. ఆతని ప్రశాంతమనోజ్ఞసౌందర్య సౌకుమార్యములు జగద్విదితములు. అట్టి నవమోహనాంగుఁడగు కుమారు నొక్కక్షణమైన యా కాసిబ్ భూపాలుఁడు విడఁజాలకుండెను. ప్రతిశుక్రవారమునాఁడును యిబ్రహీం మసీదునకుఁ బోవుచుండెను. అతఁడు పోవుదారిలో నొక గ్రంథవిక్రేత

విక్రయశాల నేర్పఱచుకొనియుండెను. ఇబ్రహీం మొకనాఁడా గ్రంథ విక్రయశాలకేగి, యటనున్న గ్రంథముల నన్నిఁటినిఁ దిరుగవైచెను. ఒక గ్రంథములో నాతని కతిలోకసుందరియగు నొక యౌవనవతి చిత్తరువు కాన్పించెను. ఆ చిత్రముచే నాకర్షింపఁబడిన రాకొమరుఁడు "ఓయీ! ఈ చిత్రమున్న గ్రంథము నాకుఁగావలయును. దీనివెల యెంత?" యని ప్రశ్నించెను.

"ప్రభూ! ఈదేశమునకుఁ దాము ప్రభువులు. తమభృత్యుఁడను. నాకేమియు వల" దనియెను.

అట్లుకాదని, యిబ్రహీము జేబునుండి కొన్ని బంగారునాణెముల నాతనికిచ్చి యా గ్రంథమును గొనినాఁడు. ఆ చిత్రము నాతఁడదేపనిగఁ జూడసాగినాఁడు. ఆ చిత్రములోని కన్యను జూచినచో నెంతయానందమొదవునోయని యాతఁ డుప్పొంగిపోయినాఁడు. నెలలకొలఁదియాతఁ డా ప్రతిమనే చూచుచుఁ గృశించి పోసాగినాఁడు.

ఇబ్రహీం మొకనాఁడు తనలోఁ దా నిట్లనుకొనినాఁడు—
"ఆ గ్రంథవిక్రేతనే యీ ప్రతిమ విషయమై యడిగియుండవలసినది. ఈ చిత్తరు వేదైన కన్యదై యున్నచో, ఆమె నెట్లయిన కన్గొనవచ్చును. లేక యిది చిత్రకారునిచే నూహింపఁబడి వ్రాయఁబడినదైనచో నాశవదలుకో వచ్చును"—

ఇట్లు తలపోసి, శుక్రవారమునాఁడు మసీదునకుఁబోవుచు నిబ్రహీంమా పుస్తకాలయాధికారికడ కరిగి "ఓయీ! ఈ ప్రతిమ యెవరి?" దని యడిగెను.

"ప్రభూ! ఆప్రతిమ యెవరిదో నాకుఁదెలియదు బాగ్దాదు నివాసియైన సందాలిసియను చిత్రకారుఁడా చిత్రమురచించినాఁడు".

మఱుచటిదిన ముదయమున నేరికినిఁ దెలియకుండ, యిబ్రహీము విలువైన యాభరణములను ధనమునుగొని, బాగ్దాదునకుఁ గొందఱు ప్రయాణికులతోఁ గలిసి వెళ్లెను.

రెండుమాసములు ప్రయాణముచేసి, యాతఁడు బాగ్దాదు చేరినాఁడు. అతఁడు గ్రంథవిక్రేతచెప్పిన యానవాళ్ళ ననుసరించి, యొకవీథిలోనికిఁబోయి యొక గృహప్రాంగణమున నిలిచియున్న షేకు నొకనింజూచి "అయ్యా! ఈనగరమున బసలెచ్చటదొరకు?" నని యడిగెను.

"అద్దె యవసరములేదు. మా యింట మా యతిథుఁడుగా నుండుఁ" డనెను. ఇరువురును భోజన మొనరించినపిదప, హుక్కా పీల్చుచు, "తమ దేయూరు? ఈనగరమునకు వచ్చినకారణమే?" మని యడిగెను. ఇబ్రహీము తన వృత్తాంతమును దేటతెల్లముగాఁ దెలుప, నాషేకు దరహాసితవదనారవిందుఁడై యిట్లనెను—

"ఆర్యా! ఇది మిక్కిలి విచిత్రముగానున్నది. నేనే సందాలిని. నేనే యాచిత్రము రచించితిని. నీ విచ్చటకేవచ్చుట మిక్కిలి యాశ్చర్యకరము. ఈ చిత్తరువులోని కన్య నా మేనమామకుమార్తె. ఈమెపేరు గెమిలా. ఈమెతండ్రి బాస్సోరాదేశపు గవర్నరు. ఈమె సౌందర్య మసమానము. ఈ ప్రపంచములో నీమెయందముతోఁ బోల్పఁదగిన చక్కఁదనము కలిగినవారెవ్వరును లేరు. గాని, పురుషులనిన నీమె విముఖయైయుండును. ఎవరిని వివాహము చేసికొననొల్లను. ఆపెను వివాహము చేసికొందునని నామామతో నొకనాఁడు చెప్పితిని. నేను ధనహీనుఁడనగుటచే నాన్నెను నాకొసంగి పెండ్లిసేయుట కాతఁ డిష్టపడలేదు. ఆమె నా యభిలాషనెఱింగి, "నీవీ నగరమునుండి వెడలి పోయెదవా లేదా? మానుషమున్నవాఁడవైనచోఁ దప్పక వెడలిపోయి యుందు" వని కబురంపినది. ఇఁక నానగరమున నుండుట కిష్టము లేని

వాఁడనై, బాగ్దాదునకు వచ్చితిని. ఆమెచిత్రము నిట్లు గ్రంథమూల మున బహుళవ్యాప్త మొనర్చి, యూఅటఁజెందినాను. మిత్రమా! ఆ సుందరియందు నీకుఁ బ్రేమకలదేని నేను చెప్పినచొప్పునఁ జేయుము. ఆమె నీకు వశంవదయగుటకు నేను తప్పక సాయపడెదను".

ఇట్లని యాతఁ డిబ్రహీమున కొకనొకను గుదిర్చినాఁడు. బాగ్దాదునకు దిగువనున్న బాల్సోరానగరమునకు నావపైఁ బ్రయాణముచేసి నగరద్వారపాలకుఁ గలిసికొన్నచో, నాతఁడే కర్తవ్య ముపదేశించునని చెప్పినాఁడు.

ఇబ్రహీము బాల్సోరాకరిగి, నగరద్వారపాలకునితో స్నేహముచేసి, తనచరిత్ర నాతనికిఁదెలిపెను. ఆ ద్వారపాలకుఁ డంతయువిని, నగరములోని యొక గూనిదర్జీవాని సాహాయ్యముఁ గోరుమని చెప్పినాఁడు. ఇబ్రహీమా దర్జీకడకేగి, కొన్ని బంగారునాణెముల నిచ్చినాఁడు.

ఆ గూనిదర్జీ "రాకుమారా! నగరము వెలుపలనున్న నదిలో నావనెక్కి యొక మైలుదూరము దిగువకేగినచో నొకతోఁటలోని కేగుము. అట మఱొక దర్జీని చూడఁగలవు. నీ కాతఁడు సాహాయ్యమొనరింపఁగలఁడు. ఆ యుద్యానవనము గెమిలా రాకుమారిదే. కాని మిత్రమా! నీయీప్రయత్నము మిక్కిలి సాహసమునక తప్పదు. జాగరూకతగలిగి మెలఁగవలయునుసుమా" యని చెప్పెను.

ఎంద తెన్నివిధముల నధైర్యము కలిగించినను వెనుదీయక యిబ్రహీము మఱునాఁటి ప్రాతఃకాలమున టైగ్రిసు నదీతీరమునకేగి యొక నావికునితోఁ దన్నాతోటకడకుఁ గొనిపొమ్మనెను. ఆ పడవవాఁడు "అయ్యా! నే నొకమైలుదూరముమించి, తమ్ముఁ గొంపోఁ జాలను". అనిచెప్పఁగా, నిబ్రహీము సమ్మతించి, నావనెక్కెను.

నావికునకుఁ గొన్నినాణెములిచ్చి, యిబ్రహీము అరమైలుదూరము నడచి, ఆ యుపవనముం జేరెను.

ఆ యుద్యానవనద్వారమున్ముక్తమై యుండెను. ఆ ద్వారము నుండి, యిబ్రహీము లోపలికేగి, విలువైనవస్త్రములఁ ధరించి, యొక యున్నతాసనముపైఁ గూర్చుండిన దర్జీవానిని సమీపించెను. ఆతఁడు యిబ్రహీమునుజూచి, "ఆర్యా! నీ వెవరు? నీ వెట్లీ దుర్గమమైన వనముం జొచ్చితివి? నిన్నెవరిచ్చోటికంపినా?" రని ప్రశ్నించినాఁడు.

ఇబ్రహీము తనయుదంతమును సాంతముగ నెఱిఁగించి "మిత్రుఁడా! నేనారమణిని జూడనియెడల నీయెదుటనే బలవన్మరణ మొందుదును. ఆమె ప్రతిమయే నాయెదనపహరించినది" అని చెప్పెను. ఆదర్జీ యాతనింజూచెను. రాకుమారుని సుందరనయనములు దుఃఖాశ్రుసిక్తములయ్యెను. ఆతఁడు "రాకుమారా! వగవవలదు. నీయందు నాకకారణవాత్సల్య ముదయించినది. ఇతరు లెవరైన వచ్చియున్నచో నీవేకాదు, నిన్నుపంపినదర్జీ, ద్వారపాలకుఁడు నందఱును మరణశిక్ష విధింపఁబడియుందురు. ఇంతవరకు గెమీలారా కొమరితయు, నామెతండ్రియుఁ దప్ప నితరులేరును నీయుద్యానవనమునఁ బ్రవేశింపలేదు. నేనిచ్చోట నిరువదివత్సరములనుండి నివసించుచున్నాను. నలుబది దినములకొకతూరివచ్చి, గెమిలారాకుమారి రెండురోజులుండి వెడలిపోవును. ఆమెతో నిరువదిమంది పరిచారికలు వచ్చుచుందురు. నీవామెను జూచుట చాలప్రమాదకరము. ఐనను నీకొఱకై నేను సాహసించుచున్నా" ననినాఁడు.

మఱునాఁడే గెమిలావచ్చునని యిబ్రహీము తెలిసికొని, పొందిన యానందమునకు మేరలేదు. దర్జీ యిబ్రహీమునకు వివిధకుసుమ

తరులతావిలసితంబైన యీయుద్యానవనమును జూపించినాఁడు. గెమిలారాకొమార్తెవచ్చి, కూర్చుండుమండపమున కెదుటనున్న యొకమల్లె పందిరివెనుక దాగొని, యామెను జూడుమని చెప్పినాఁడు. మఱునాటి యుదయమున గెమిలా పరిచారికాసహితయై వచ్చినది. ఉద్యానవనములోని కాసారమున సఖీజనసమేతముగ జలకమాడినది. చీనిచీనాంబరములఁదాల్చి, గెమిలా మండపముపైఁ గూర్చుండినది. ఆమె చెలులలో నొకర్తుక సితారుపై నత్యంతమనోహరముగఁ బాడసాగినది.

గెమిలా రూపలావణ్య విలోకనమున యిబ్రహీము ముగ్ధుఁడై పోయినాఁడు. అతఁడా యానందాతిశయమున తనయునికిఁ దానే మఱచి పోయినాఁడు. ఆమె కంఠసీమ నలంకరించిన వజ్రహారము ధగద్ధగాయమానముగఁ బ్రకాశించుచుండెను. తరువాత నామెకూడ మోదులు చిగుర్చునట్లు పాడినది. ఆ జగన్మోహనకరమైన గానామృతముఁగ్రోలి, యిబ్రహీము పరవశుఁడైనాఁడు. ఆమె యాతనివంక నొకపారిచూచినది. చెలికత్తెలనుజూచి, "ఇప్పుడేవచ్చెదను. పాటబాడుచుండుడు" అని, మొలనున్న యొఱనుండి చిన్నబాకునుదీసి, మల్లెపందిరిచాటుననున్న యిబ్రహీముకడకువచ్చి, తీక్షణముగఁజూచినది. ఆమెబాకుతో నెత్తినచేయి క్రిందకు వ్రాలిపోయినది.

ఇబ్రహీము ప్రశాంతసుందరస్వరూపమునుజూచి, గెమిలా విమోహితయై పోయినది. ఆమె యాతనింజూచి, "నవమోహనాంగా! నీ వెవరవు? ఇచటి కెందుండివచ్చినావు?" అని ప్రశ్నించినది. ఇబ్రహీము తనవృత్తాంతమును పూర్తిగ నామెకుఁ జెప్పినాఁడు. ఆమె నారీజనమనోహరా! ఈజిప్టుదేశాధిపతియగు కాసిబ్ కుమారుఁడగు నిబ్రహీమువుకాదుగదా" యనినది. అతఁడౌనని నంతనే, గెమిలా "నేను ధన్యనైతిని. నీసౌందర్యమునుగూర్చి యనేకులు చెప్పగావిని, నిన్ను ప్రేమించియున్నాను. దైవానుగ్రహమున నిన్ను గాంచఁగలిగినాను.

మనవివాహమునకు నాజనకుఁ డంగీకరించునో లేదో. నేనువచ్చి నిన్ను కలిసికొందును. చీఁకటి పడునంతదనుక నదీతీరమున వేచియుండుము" అని చెప్పినది.

ఇబ్రహీము మహదానంద భరితాత్ముఁడై యాకోమలిని ముద్దిడుకొని, వెడలిపోయినాఁడు. సాంకేతికస్థలమున యిబ్రహీము నౌకలో గూర్చుండెను. జగమెల్లెడల నంధకారముఁ గ్రమ్ముకొనియెను. ఖడ్గధారియై యొకఁడానౌకలోఁ బ్రవేశించెను. ఆతఁడు యిబ్రహీమును జూచి "ఓయీ! నీ వెవ్వఁడవు. ఇచట నెవరికొఱకువేచియున్నావు?" అని ప్రశ్నించినాఁడు. ఇబ్రహీము భయకంపితుఁడై యాలోచించుకొనుచుండఁగా, నాసైనికుఁడు తనకవచమును దొలఁగించెను. గెమిలా ప్రత్యక్షమై "ప్రియసఖా! నేనెవఁడనోయని హడలిపోయితివా?" యని పరిహాసము చేసెను.

నౌక నతివేగముగ నడిపి, నావికుఁడు గెమిలా యిబ్రహీములను బాగ్దాదునగరమునకుఁ జేర్చెను. అచట మఱొకనౌకలోనున్న సందాలినీనిఁజూచి, గెమిలా తెల్లబోయినది. సందాలినీ యిబ్రహీమునుజూచి "ఓయీ! నీవు సురక్షితముగా నిచ్చటికే తెంచినందులకుఁ జాలసంతోషమొందవినది. నేను పనియుండి బాల్సోరా కేగుచున్నాను. మీరు ప్రయాణపుఁ బడలికనొందిన ట్లగపడుచున్నారు. ఈతినుబండారముల దినుఁడు" అని యిచ్చి వెడలిపోయినాఁడు.

ఇబ్రహీము క్షుత్పీడితుఁడై యుండుటచే నాఫలాహారముల నారగించినాఁడు. వెంటనే యాతఁడు స్మృతిహీనుఁడై క్రిందఁబడి పోయినాఁడు. ఆతఁడు చైతన్యముఁగోల్కొని, జనులఁదెఱచి చూచుసరికెవ్వరును గనబడలేదు. పడవయును, గెమిలాయును మాయమైరి. అప్పటికింకను చీఁకటిగ నుండెను. కొందఱు సైనికులు తనదెసకువచ్చు

చున్నట్లాతఁడుగాంచి, భయకంపితుఁడై, యచటనేయున్న యొకశిథిల గృహములోనికిఁ బరుగిడెను. ఆగృహములో నాతఁడు దేనిమీఁదనో తూలిపడినాఁడు. అది యేదై యుండునాయని చూచినాఁడు. మృత కళేబరము ! నవమోహనాంగియగు స్త్రీ నెవరో హత్యగావించి యట పాఱవైచినారు. ఇబ్రహీముచేయి రక్తాక్తమైనది. సైనికులా గృహ మునఁ బ్రవేశించినారు. ఇబ్రహీము గోడవెనుక దాగినాఁడు. ఒక సైనికుఁ డిబ్రహీమునుజూచి "నీవెవరవు ? ఇచ్చట నెందులకు నిలచి యున్నావు ? ఆస్త్రీని జంపినది నీవేనా ?" యని యడిగినాఁడు.

ఇబ్రహీము "అయ్యా ! నే నెవరినిఁ జంపలేదు. ఆమెను హత్యగావించినదెవరో నాకుఁ దెలియదు. మిమ్ములనుజూచి, భయ పడి, యిచట దాఁగొనియున్నా" నని సమాధాన మిచ్చినాఁడు. ఆ సైనికుఁ డిబ్రహీమును సైన్యాధ్యక్షునికడకుఁ గొంపోయినాఁడు. అధ్యక్షుఁడు యిబ్రహీము చేతిమీఁదనున్న రక్తపుమఱకలఁగాంచి, "ఆ రక్తపుఁజుక్కలే యీతఁడు హంతకుఁడని ఋజువుచేయుచున్నవి. ఈతని శిరస్సును ఖండించుడు" అని యాజ్ఞాపించెను. ఇబ్రహీము కెవ్వనఁ గేకవైచెను. ఆ సైన్యాధ్యక్షుఁడు "ఆతఁడే హంతకుఁడు వెంటనే శిరచ్ఛేదముఁ జేయుఁ" డని సైనికుల కాజ్ఞాపించెను.—

"హా ! నే నిలుపీడి, యింతదూరమువచ్చి యెట్టిశిక్ష ననుభ వింపవలసివచ్చిన" దని, యిబ్రహీము నిట్టూర్పువిడిచెను. ఇంతలోఁ గొంద ఱాశ్వికులువచ్చి "అగుఁ డాగుఁ" డనిరి. ఆ యాశ్వికుల ముందు యీజిప్టుదేశపు సేనానాయకుఁడు కాసిబ్ నృపాలునిచేఁ బాగ్దా దు ప్రభువైన ఖలీఫా హారాన్ అలరాషీదు సముఖమునకుఁ బంపఁబ డెను. సేనానాయకుఁడు ఖలీఫా కొకలేఖనిచ్చెను. ఆ యుత్తరములో నిట్లున్నది. "మిత్రమా ! నా ప్రియతనూభవుఁడగు యిబ్రహీమిలుపీడి

మోసములైనది. ఆతనిజాడ యింతవఱకును దెలియలేదు. దయయుంచి, యాతనిని వెదకించి, మా సేనానాయకునితోఁ బంపఁగోరెదను.

ఇట్లు,
నీ మిత్రుఁడు కాసిబ్.

ఆ లేఖనుజదివి ఖలీఫా "ఓ సేనానాయకా! నీవు బాల్సోరా లోనున్న మా గవర్నరును గలిసికొని, యీలేఖ నిచ్చినచోఁ గార్యము సానుకూలము కాఁగల" దనిచెప్పెను. ఆ లేఖనుగొని, యీరాజిప్టు సేనానాయకుఁడు బాల్సోరాకుఁ బోవుచుండఁగా, సైన్యాధ్యక్షుని యిబ్రహీమును జూచెను. సైన్యాధ్యక్షు నుద్దేశించి యాతఁడు "ఈ యువకుఁడెవరు? ఈతని నేలవధింపఁబూనినా?" గని ప్రశ్నింప, నా సైన్యాధ్యక్షుఁడు జరిగినదంతయుఁ జెప్పెను. అదివిని, యీరాజిప్టు సేనానాయకుఁడు "ఈ యువకుని సుందరవదనమండలమున క్రౌర్య చ్ఛాయలు కనబడుటలేదు" అని, యిబ్రహీము వంకచూచి "ఓయీ! నీ జన్మస్థలమెయ్యది? నీ వెట్లీప్రదేశమునకు వచ్చితి?" వని యడిగెను.

ఇబ్రహీ మాతనివైపు తేఱిపారఁజూచి, "ఓయీ! నన్ను గుర్తింపఁజాలవా? నీ ప్రభువగు కాసిబ్ మహీపాలుని కుమారుఁడను గానా" యనెను. సేనానాయకుఁ డిబ్రహీమును గుర్తించి, యాతని పాదములకు నమస్కరించి "రాకుమారా! మన్నింపు" మనెను. బాగ్దాదు సైన్యాధ్యక్షుఁడుకూడ పశ్చాత్తాపతప్తుఁడై యిబ్రహీము పాదములకుఁ బ్రణమిల్లి, ఖలీఫా సన్నిధికి గౌరవపురస్సరముగఁ గొంపోయెను.

ఇబ్రహీమును గౌరవించి, జరిగినదంతయు నాతనివలననే యాల కించి, ఖలీఫా బాల్సొరాగవర్నరును దోషిమ్మని కొండజేసం పెను. సందాలినీ యిల్లు సోదాచేసి, ఆతనిని బంధించి తీసికొనిరమ్మని కొందఱు సైనికులనంపెను. ప్రభునానతి ననుసరించి, నల్వురుసైనికుల మఱల టైగ్రీసునదీతీరముననున్న శిథిలగృహమును సోదాచేసి హంతకుని బం ధించిరి. కరచరణములు బంధింపఁబడియున్న గెమిలాకు బంధవిముక్తిఁ గలిగించి, సైనికులు సందాలినీని బంధించి, ఖలీఫాకడకుఁ గొనిపోయిరి. సందాలినీకి కారాగృహవాసశిక్ష విధించి, ఖలీఫా యాతనిభాగ్యము బీద లకు దానపూర్వకముగా వినియోగించెను. బాల్సొరాగవర్నరునకు ఖలీఫా యిబ్రహీమునుజూపి, "నీకుమార్తె సందాలినీమూలమున మృత్యువువాలుగాకుండ సంరక్షింపఁబడుటకు హేతుభూతుఁడైన యీ యీజిప్టునృపాలుని కుమారుఁడగు నిబ్రహీమును జూచితివా ? ఈతనికి నీతనయనిచ్చి పెండ్లిసేయుము" అనినాఁడు—

ప్రభూ ! తమ భృత్యుఁడను. తమమాట కెదురాడగలనా ? అట్లేచేయుఁ" డని గవర్నరు పలికెను.

శుభముహూర్తమున గెమిలాకును యిబ్రహీమునకును వివా హము చేయఁబడెను. దంపతులు ఖలీఫాచే విశేషముగ బహూకరింపఁ బడి, ఈజిప్టునకుఁ బోయిరి. కాసిబ్ కుమారుని, కోడలునుజూచి, నిరతి శయానందభరితాత్ముఁ డాయెను.

# 21 దున్యాసుందరి.



పూర్వకాలమునం దొకప్పుడు సులేమాన్‌షా యను మహామ్మదీయప్రభుండు ధర్మమూర్తియై ప్రజల దన కన్నబిడ్డలవలె జూచుకొనుచు ధరాపాలనంబు గావించుచుండెను. ఒకనాఁడు సులేమాన్‌షా, నిండుకొలువుండిన సమయంబున గొందరు రత్నాలవర్తకు లటకరుదెంచి, యా నవాబునకు నమస్కరించి, తాము వివిధదేశముల దిరిగి గొనివచ్చిన యమూల్యములగు మణుల నాతనికి జూపిరి. ఆ నవాబును వర్తకుల నుచితరీతిగా గౌరవించి, వారు గొనివచ్చిన రత్నములను దగు మూల్యమునిచ్చి కొనియెను. అనంతర మావర్తకులు తాము నానా దేశంబులందును గాంచినవిశేషములను సులేమాన్‌షాకు జెప్పుచుండు నవసరమునఁ దామొకచోట గాంచిన జహార్‌షా కుమార్తెయైన దున్యాయొక్క యపరూపలావణ్యములను, నద్వితీయసౌందర్యమును బెక్కుతెరంగుల వర్ణించిచెప్పి, వెండియు నాసుందరి నవాబున కెల్లవిధముల దగిన భార్యయని నుడువుచు, ఆ మహాద్భుతతేజోరాశియొక్క పొందును గూడజాలనివారిజన్మ నిరర్థకమని నుడివి చనిరి.

అంతట నవాబైన సులేమాన్‌షా ప్రధానామాత్యుని రావించి, వర్తకులుదెచ్చిన సమాచారము నాతనికి వివరించిచెప్పి, తన కెట్లయిన నా దున్యాసుందరి, సతియగునట్లు చేయవలసినదిగాజెప్పి, కొంతధనమును పరివారమునునిచ్చి పంపెను. ప్రభునాజ్ఞ ననుసరించి, యామంత్రియు, పరివారసహితుండై ప్రయాణంబైచని, యనతికాలంబులోనె జహారషాయుండు నగరప్రాంతమునగల యొక నదియొడ్డున విడిసి, తన పరివారజనంబులలో మిక్కిలి నేర్పరియు చతురుండును నైనవానినొకనిబిలచి, జహార్‌షాయొద్ద కరిగి, తనరాక నెరుకపరచి రమ్మని పంపెను. ఆ పరిచారకుండును మంత్రియానతి ననుసరించి, జహార్‌షాయొక్క పురమున బ్రవేశించి, యాప్రభునకు నమస్కరించి,

"అయ్యా! నేను ఖుద్రాకును ఇస్పయిక ప్రాంతములకును సర్వాధికారి యైన సులేమాన్‌షా నవాబుగారియొక్క రాయబారిని. మా ప్రధానామాత్యుండు తమ్ము దర్శింపవలయునని యరుదెంచి, యిట కనతి దూరముననున్న నదియొడ్డున విడసెను". అనిచెప్పగా నా జహార్‌షా పరమానందభరితుండై "అయ్యా! మేమెల్లరమును మీయేలిక పాల నలోనివారము. నేడు మీ ప్రధాని మాకడ కరుదెంచుటవలన మేమెంతయు ధన్యులము. నేనిపుడు సులేమాన్‌షా గౌరవార్థమాతని మంత్రి నెదుర్కొనుటకుగా నా పరివారజనంబుల బంపగలను". అని నుడివి, వెంటనె దనవజీరును రావించి, "ఓయీ! నీవు మనసామంత ముఖ్యోద్యోగ్యాది ప్రముఖుల వెంటనిడుకొని, యీ రాయబారితోనేగి, సులేమాన్‌షా నవాబుగారియొక్క మంత్రి నెదుర్కొని, మంగళవాద్యములతో సగౌరవంబుగా నగరులోనికి దోడ్కొనివచ్చుట మనకువిధి. మన ప్రభుండయిన సులేమాన్‌షాయొక్క గౌరవమును మనమిపుడు వెల్లడిజేయవలసియున్నది. గాన నట్లొనరింపు" మనగా, నావజీరును, ప్రభునియాజ్ఞ ననుసరించి, సర్వసామంతాది పరిజనంబులతోడను, నమూల్యవస్త్రాభరణములతోడను, రాయబారితోనేగి, సులేమాన్‌షా యొక్క మంత్రినిగలసుకొని, వారికి దానుగొనివచ్చిన కానుకల సమర్పించి, సగౌరవంబుగా, గ్రామమంతయు నూరేగించి, నవాబుగారుండు అంతఃపురంబులోనికి గొనిపోయెను. జహార్‌షాయు, సులేమాన్‌షా యొక్క ప్రధానామాత్యుని గనినంతనే సింహాసనముడిగ్గి, వాని కెదురేగి, సవినయంబుగా దోడ్తెచ్చి, పంచభక్ష్యంబులతోడను, సులేమాన్‌షాయొక్కమంత్రి మొదలగువారల కెల్లరకును విందొనర్చి, యనంతరమా మంత్రిని జహార్‌షా సుఖాసీనుంజేసి, కుశలప్రశ్నంబుల నడిగిన యనంతరమాతడు వచ్చినకార్యము నడుగగా, నా మంత్రిశేఖరుండు నవాబున కిట్లు సవినయంబుగా జెప్పదొడంగెను.—

" ప్రభూ! నేను మాయేలికపంపున దమశ్రేయోభిలాషినై యరుదెంచినవాడను. సర్వధర్మస్వరూపులును, నద్వితీయపరాక్రమో పేతులును నయిన సులేమాన్‌షానవాబుగారు, మీకుమార్తెయగు దున్యాకన్యయొక్క రూపలావణ్యాది గుణంబులవిని, యామెయందు బద్ధానురాగులై యుండి, ఆసుందరిని వివాహమాడ దలంచుచున్నారు. ఈసమాచారమును దమకెరుకపరచి, యిందులకు దమయొడంబడికను బడిసి రావలసినదిగా నాకనుజ్ఞనిచ్చియున్నారు. ఆమహనీయులు దమకొసంగవలసినదిగా గొన్నియమూల్యములగు వస్త్రాభరణములను, మణులను బంపియున్నారు. స్వీకరింపుడు" అని నుడివి, తాను గొని వచ్చిన భూషణంబులను, పట్టువస్త్రములను నింకనునెన్నియో నమూల్యములగు కానుకలను నా నవాబునకు సమర్పించి, యతని సమాధానమునకై వేచియుండెను. అంతట జహర్‌షా మితిలేనియానందముగలవాడై, సులేమాన్‌షా తనకై బంపిన కానుకలనన్నింటిని సవినయంబుగా నందుకొనిన యనంతరమా మంత్రి కిట్లు చెప్పెను—

" అమాత్యపుంగవా! మేమెల్లరము సులేమాన్‌షా వారి యొక్కపాలనలోని వారమగుటచే మాజన్మలన్నియు చరితార్థంబులై యున్నవి. ఇపుడా ప్రభువులు నాకుమార్తెను వివాహమాడగోరుట మాపూర్వపుణ్యఫలంబుగాక, వేరొండెద్దియునుగాదు. వారు కోరిన ప్రకార మాచరించుటకన్న, యితరవాంఛితం బెద్దియునుగూడ మాకు లేదు. వారియానతి శిరసావహించుట నాకెల్లవిధంబుల విధియైయున్నది. యిపుడే వివాహమునకై శుభముహూర్తమును నిర్ణయింపజేయుదము" అని జహర్‌షా సమర్థులగు బురోహితులనురావించి, వారికెల్లవృత్తాంతంబును దెలియపరచి, తనకుమార్తెయైన దున్యాసుందరిని, సులేమాన్‌షా నవాబుగారికొసంగి వివాహముగావించుటకై యొకశుభముహూ

ర్తము నిర్ణయింపుడని కోరగా, వారును పరమానందభరితులై, కొలది గడవులోనె యొకమంగళదినమును స్థిరపరచిరి.

ఆయేర్పరుపబడిన శుభముహూర్తమునకు జహర్‌షా, మతగురువులతోడను, యెల్లర రాజోద్యోగీయులతోడను, యితరబంధుజనంబులతోడను, సర్వాభరణాంబర విభూషితయగు దున్యాసుందరితోడను పయనంబై, యనతికాలంబులో సులేమాన్‌షాయొక్క పట్టణముజేరెను.

అంతట సులేమాన్‌షాయొక్క మంత్రి వారలనెల్లరను పురప్రవేశముగావించి, యోగ్యములయిన విడుదుల నేర్పాటుగావించిన యనంతరము, తన శుభాగమనంబునకై వేచియుండి తహతహపడుచున్న ప్రభువును దర్శించి, యీశుభవృత్తాంతమునెల్లను వానికిసవిస్తరంబుగాజెప్పి, జహర్‌షా దున్యాసుందరీసహితుండై మహావైభవంబున నరుదెంచి, విడిదియందు బసగావించియుండెనని విన్నవించి, మరియు నాతనిచే యొసంగబడిన చీనిచీనాంబరములను, యితరకానుకలను సమర్పించి, వానిని సంతోషాంబునిం దేల్చెను. అంత సులేమాన్‌షా పెండ్లికుమార్తెను, నామెతండ్రిని పెద్దయూరేగింపుతో గొనిరావలసినదని మంత్రి కాజ్ఞాపించి, వివాహమునకువలయు సర్వసన్నాహములను గావింపదొడంగెను. అంత నామంత్రియు, ప్రభునాజ్ఞ ననుసరించి, జహర్‌షాను, దున్యాసుందరిని, వివిధమంగళ వాద్యంబులతో పట్టణమంతయు నూరేగించి, నవాబైన సులేమాన్‌షాగారియొక్క యంతఃపుర ప్రవేశంబును గావింపజేసెను. అనంతరము పెద్దలచే యేర్పరుపబడిన యాశుభముహూర్తమున, సులేమాన్‌షాకును దున్యాసుందరికిని దేవేంద్రవైభవంబున, కులాచారముల ననుసరించి, వివాహకార్యము జయప్రదముగా గొనసాగింపబడియెను. అనంతరము సులేమాన్‌షా యెల్లరబంధుజనంబులకును, యుద్యోగస్తులకును, యితరపరివారజనంబులకును రెండుమాసములవరకును విందులగావించి, వారినందరను బెక్కు

సత్కారంబులచే దృప్తులగావించెను. అంత పెండ్లికుమార్తెయగు దున్యాసుందరియొక్క తండ్రియగు జహర్‌షా అల్లునికడ శెలవంది, కుమార్తెకుశలయు నీతులుగరపి, తాను నిజపట్టణంబునకు పరివారసహితుండై చనియెను.

నాటినుండియు సులేమాన్‌షా తాను మనసార ప్రేమించి, అగ్నిసాక్షిగా వివాహమాడిన దున్యాసుందరితో సంసారభోగంబుల ననుభవించుచు, మితిలేనియానందముతో గొంతకాలము గడపెను. అనంతరము గొన్నాళ్లకు దైవానుగ్రహంబువలన దున్యాసుందరి గర్భమును దాల్చి క్రమముగా నవమాసములును మోసి, యొకశుభముహూర్తమునందొక మహాతేజరాశియగు పుత్రరత్నమును గనియెను. ఈ పుత్రోదయమునకు సులేమాన్‌షా పరమానందభరితుండై, యాబాలకునికి సకాలంబున బురోహిత జనంబులచే జాతక, నామకరణాదికార్యముల నెరవేర్చి, యల్లారుముద్దుగా బెంచుచుండెను.

తాజెల్‌ముల్కు అనునామముతో నాబాలకుండు శుక్లపక్షచంద్రునిభాతి దినదినము నభివృద్ధిగాంచుచు, క్రమముగా నేడేండ్ల ప్రాయమువా డయ్యెను. అంత జనకుడయిన సులేమాన్‌షా సమర్థులగు గురువులనురావించి, కుమారునకు మహావైభవంబున విద్యాభ్యాసము గావించెను. నాటనుండియు తాజెల్‌ముల్కు గురువులకడ క్రమముగా సర్వవిద్యలను నభ్యసించి, పదునాలుగువత్సరములు వచ్చునప్పటికి గుఱ్ఱపుస్వారి, వివిధాయుధోపకరణ విధానము యుద్ధప్రావీణ్యాదియెల్ల విద్యలయందును నారితేరినవాడై, చూచువారు మెచ్చునట్లుండి, యెల్లరకును దనకృత్యములవలన గన్నులపండువు గావించుచుండెను. తాజెల్‌ముల్కుయొక్క సుగుణసంపత్తిని, సాహసాది యోధగుణంబులను సుందరరూపంబును గనిన వారెల్లరును నాతడీశ్వరాంశసంభూతుడనియెంచి,

యతివాత్సల్యమున జూచుచు, పరమానందభరితులగుచుండిరి. తలిదండ్రులును నాకుమారరత్నమునుగని మితిలేని యానందము నందసాగిరి.

అట్లు తాజెల్ముల్కు మహదైశ్వర్యములమధ్య బెరుగుచు, క్రమముగా పదునెనిమిదివత్సరముల ప్రాయముగలవాడై నిండుయౌవనముదాల్చి, నవమన్మథునివలెనుండి, స్త్రీపురుషవివక్షతలేక, యెల్లవారలను దన సౌందర్యాది గుణంబులచే విమోహితుల గావించుచుండెను. ఆ రాజకుమారునకు వేటయనిన నధికప్రీతి. దానంజేసి యతడు తరుచు మిత్రులంగూడి, యడవులకరిగి, కొన్ని సుందరమృగంబులను, పక్షులను వేటాడి తెచ్చుచుండెను. ఇట్లుండ నొకనాఁడు రాజకుమారుడైన తాజెల్ముల్కు వేటకై నిజమిత్రపరివారజనంబులతో పయనంబై పెక్కుదవ్వరిగి, అనేకములయిన వన్యమృగంబులబట్టి, యప్పటికి సాయంసమయమయి, సూర్యభగవాను డస్తాద్రి గ్రుంకుటచే, తాజెల్ముల్కు తన పరివారజనంబులతో నారాత్రి కటనేవిశ్రమించి యింకను మరికొన్నిమృగంబులబట్ట, వలలబన్ని, యట విహారము సల్పుచుండుసమయంబున నారాజకుమారునకు గొంతదూరములో గొన్ని గుడారములు కానుపించెను. తాజెల్ముల్కట్టి యర్ధరాత్రంబున నా భీకరారణ్యమునందా విధముగా గుడారములు వేయబడియుండుటనుగని యచ్చెరువంది, తన పరివారజనంబులోనివాడగు నొకసమర్థుని బిలచి "ఓయీ! నీవిపుడే యా కనుపించుచుండిన గుడారములకడకరిగి, యం దెవ్వరుండినదియు, వారేల యిక్కడిట విడసినదియు దెలిసికొని రమ్ము". అనిచెప్ప, నా పరిచారకుండు రాజకుమారునకు నమస్కరించి, యాతని యాజ్ఞానుసారముగా, గుడారములచెంతకరిగి, వారి వృత్తాంతమును దెలుసుకొని తిరుగ తాజెల్ముల్కు కడ కరుదెంచి, వానికి సలామొనర్చి, యా గుడారములలోని వారివృత్తాంతము నిట్లు చెప్పెను.

" ప్రభూ ! మీరుగాంచిన యీ గుడారములలో విడసినవారు కొందరు రత్నాలవర్తకులు. వారు నానాపట్టణములను వ్యాపారార్థము దిరుగుచు, తమరిట విడసియున్నారనివిని, తమకు గొన్ని విచిత్రవస్తువులను గానుకగా నీయవలయుననియెంచి, యట వేచియున్నారు. ఇదియె ఆ వర్తకుల వృత్తాంతము ". అనిచెప్పగా నా రాజకుమారుడా వర్తకుల సదుద్దేశమునకును, వారలకు దనయెడగల గౌరవభావమునకును నెంతయు సంతసించి, వెంటనే కొందర పరివారజనంబుల వెంటనిడుకొని ప్రశస్తములగు నరబ్బీగుఱ్ఱముల నధిరోహించి, తనదర్శనమునకై వేచియున్న యీవర్తకుల గలయుగోరి, యీ గుడారములున్నవైపునకు జనియెను. అట నావర్తకశ్రేష్ఠులును రాజకుమారుడే తమకడ కరుదెంచుచుండెనని యెరింగి, పరమానందభరితులై, తాజెల్ముల్కున కెదురేగి, వానిని సగౌరవంబుగా దమ గుడారములోనికి గొనితెచ్చి, యొక్క రత్నాలఖచితమల్‌తివాసీపై యీ రాజకుమారు నాసీనుంజేసి, తామాతనికై గొనివచ్చిన కొన్ని యమూల్యములయిన భూషణంబులను, జరీతో చిత్రవిచిత్రముగా నల్లబడిన గొన్ని విలువయైన వస్తువులను సమర్పించి, వాని నుచితరీతి గౌరవించి విందుగావించిరి. అంతట రాజకుమారుడా వర్తకులు తనకుజూపిన మర్యాదలకును, గౌరవములకును నెంతయు సంతసించి, తిరుగ నశ్వారూఢుండై నిజపరివారసమేతముగా దన గుడారమునకు మరలనున్న సమయమున నా చేరువను మరియొక వర్తకు డొకరాతిపై గూర్చొని, ఖిన్నవదనముతో దుఃఖించుచుండెను. తాజెల్ముల్కు, సుందరవదనముతో నొప్పుచు, మంచి యౌవనములో నున్న నాయువకు డట్లేల విచారించుచున్నాడో దెలియగోరి, వెంటనే గుఱ్ఱమునుదిగి, పాదచారియై వానికడకరుగ, నా పురుషుడింకను నట్లే దుఃఖించుచు, రాజకుమారున కెదురేగి, తమ వంశగౌరవానుసారముగా బ్రణమిల్లి, నేలను మూడుసారులు ముద్దుసడుకొని, రాజకుమారునకు

నమస్కరించి, వెక్కి వెక్కి యేడువదొడంగెను. అంత రాజకుమారుడు వానిని లేవదీసి, వాత్సల్యముతో "ఓయీ! నీవును నీవర్తకులలో నొక్కడవేగదా! ఏల యిట్లు విచారించుచుంటివి? నీకు వచ్చినయాపద యెట్టిది. నీకడగలవస్తువుల నెవ్వరును కొనకుండిరా? నాకు వాటిని జూపుము. వాటికి దగినమూల్యమునిచ్చి కొందును. లేక నీ వెవ్వరి కయిన ఋణపడియుంటివేమొ చెప్పుము. ఆ ఋణము నీ క్షణమునందె దీర్చి, నీవిచారమును బాపుదును". అనియెను. అంత నా వర్తకయువకుఁడు మరింత దుఃఖించుచు "అయ్యా! నాకడ దమకుజూపింప నర్హములయిన వస్తువులెవ్వియును లేవు. నావిచారమును బోవునదికాదు. నన్నిట్లే విచారముతో గుందుచుండనిండు". అనిచెప్పగా రాజకుమారుడు తిరుగ వానితో, "ఓయీ! నీవద్ద యెట్టివస్తువులున్నను నాకు జూపించకదప్పదు. నీ విచారకారణమును నా కెరింగింపవలయును. అంతదనుక నేను నిన్ను విడచువాడనుగాను". అని కఠినముగాజెప్ప, నా వర్తకుడిక చేయునదిలేక, తన వస్తువులున్న మూటలనుదెప్పించి, అందున్న సామగ్రినంతను రాజకుమారునకు జూపుచుండు సమయమున నొకచక్కని ముఖమల్‌గుడ్డ మడతయొకటి క్రిందపడెను. వర్తకుడు వెంటనే యాగుడ్డనుదీసి మరుగుపరచుకొన జూచుచుండ, రాజకుమారుండదిగ్రహించి, "ఓయీ! ఆగుడ్డ నేలదాచుచుంటివి? దానిని గూడ నాకుజూపింపగూడదా?" యనియడుగ, వర్తకుడు "అయ్యా! దీనిని తమరు చూచుటకు నా కిష్టములేదు. దానివల్లనే, నేనావస్తువుల దమకు జూపింపనని తొలుతనంటిని". అనియెను. అంత రాజకుమారుండు మరింత ఆశ్చర్యముతో నాముఖమల్‌గుడ్డ నావర్తకుని చేతినుండి బలవంతనుగాలాగి, విప్పి చూచునంతలో నందుండి యొకసుందరమయిన అల్లికరుమాలు క్రిందపడెను. రాజకుమారు డద్దాని నెత్తిచూడగా, నాతనికి గన్నులు మిరుమిట్లుగొల్పెను. ఆ రుమాలుపై పట్టుతో

నల్లబడినలేడియు వెండితీగలతోనల్లబడిన మరికొన్ని సుందరములయినలత లును నుండి, రాజకుమారునకుమరింత ఆశ్చర్యముగొల్పెను. వర్తకుడా రుమాలును జూచినంతనే మరింతదుఃఖముతో నెత్తిని మోదుకొనుచు "అయ్యో! ఈ దగ్ధహృదయమిక చల్లారనే జల్లారదుగాబోలు!" యని నిట్టూర్పుపరంపరల విడుచుచు నధికశోకంబు నందసాగెను. అంత రాజకుమారుం డాతని వృత్తాంతము నేమియు దెలసికొనజాలక, ఆ వర్త కుని గాంచి,

"ఓయీ! నీచేష్టలన్నియు మిగుల ననుమానాస్పదముగా నున్నవి. ఈముఖమల్ చేతిరుమాలును గాంచినంతనే నీవీరీతిగా శోకిల్లు టేమి? ఈరుమాలునకును నీకును గలసంబంధమేమి? ఈవృత్తాంతము నంతను నాకు సవిస్తరముగాజెప్పినంగాని, నిన్నువిడుచునదిలేదు. నీవిచా రకారణమును దెలిసికొనినపిమ్మట దప్పక నీవిచారమును బోగొట్ట బ్రయత్నింతునుగాన, నీసర్వవృత్తాంతమును నీవు సంకోచమునువీడి వివరింపకదీరదు" అని చెప్పగా నావర్తకుడు సంతత ధారాపాతములై ప్రవహించు కన్నీళ్లనుదుడుచుకొనుచు "ప్రభూ! ఈముఖమల్ రుమాలునకును, దానియజమానురాలునకును సంబంధించినంతవరకు నాచరిత్ర చాలవిషాదకరమయినది. నన్నుబోలిన దురదృష్టవంతులీ జగత్తునందు మరియొకరుండరు. ఈనాయంతములేని విచారమును బో గొట్టుట కెవ్వరికిని సాధ్యముకాదు. అయినను నీనిర్భాగ్యునిచరిత్రను వినవలయునని పట్టుదలవహించితిరిగాన, దానినంతయు వివరించిచెప్పెద సావధానచిత్తులై యాలకింపుడు" అని యావర్తకుడు రాజకుమారు నుచితాసీనుంజేసి, యిట్లు తనవృత్తాంతమును జెప్పదొడంగెను.

# 22 అజీజేపతివ్రతకథ.

—————:0:—————

"ఓ రాజకుమారా! నాతండ్రి మిక్కిలి ధనవంతుడైన యొక వర్తకుడు. నాపినతండ్రికి అజీజేయను నొకమహాసౌందర్యరాసియైన కుమార్తెకలదు. ఆమెతండ్రి చిన్ననాటనే స్వర్గస్థుడగుటవలన నజీజే బాల్యమునుండియు, మాయింటనేయుండి, నాతోడనే నల్లారుముద్దుగా పెరిగెను. మాజనకు డజీజేకన్యను నాకొసంగి వివాహముచేయుటకు నిశ్చయించెను. మాయమ్మయు నితరబంధుగులునుగూడ అజీజేనాకెల్ల విధముల దగినభార్యయనియెంచి, మావివాహమున కనుమతించిరి. అంతట మానాయన వివాహమునకువలయు సర్వసన్నాహములనుగావించి, శుభముహూర్తమును నిశ్చయించెను. ఎల్లతావులనుండియు బంధుగులును మిత్రులును నరుదెంచిరి. అనతికాలములోనె ముహూర్తదినము కూడ నరుదెంచగా, నాకును, అజీజేకును మంగళస్నానములు గావించిరి. ఆసాయంకాలమిక ప్రధానము జరుగవలసియున్నది. అంత మాజనకుండు మంగళవాద్యములతో పట్టణములోనున్న యెల్లబంధుమిత్రులను నాహ్వానించుటకై యరిగెను. రావలసినవారందరును నరుదెంచిరి. అపుడు మాగృహమంతయు దేవేంద్రలోకమువలె మహాశోభాయమానముగా నుండెను. కాని వివాహమునకు ముఖ్యముగా రావలసియుండిన నాయాంతరంగిక మిత్రుడొకడుమాత్రము రాకుండుటచే నామనసెంతయు వ్యాకులతపడజొచ్చెను. ఆపట్టణముననే యున్నవానికొరకై యెందరచేతనో, యెన్నిమారులో కబురులనంపితిని. కాని ప్రతిసారియు నాతడగుపించలేదనియే వర్తమానము వచ్చుచుండెను. అంత నేనే స్వయముగా నాతనికొరకై బయలుదేరి, ప్రార్థనకై మసీదున కరుగుచుంటినని, యింటిలోనివారికిజెప్పి పోతిని. ఆనాడతని నెట్లయిన బట్టుకొని, నావివాహసమయమునకు గొనిపోవలయునని పట్టుదలగలవాడనై

పట్టణమంతయు నామూలాగ్రముగఁదిరిగి వేసారితినిఁ గాని నామిత్రుఁడెందును గానరాడాయెను. అంతకుముందు జలకమాచరించియుండుటచేతను, దేహమంతయు బరిమళప్రపూర్ణం బగుటచేతను మిగుల నలసిపోతిని. కాని మిత్రుని గనుగొనవలయునను పట్టుదలను మాత్రము వీడనివాడనై, యింకను మరికొంతదవ్వరిగి, అంతకుమున్నెన్నఁడును చూచియెరుంగని యొకసందుమార్గమునుజొచ్చి, నాలుగువైపులను గలయ వెదుకజొచ్చితిని. కాని నామిత్రుఁడెంతకును గానరాలేదు. అప్పటికి పూర్తిగా యలసిపోయి, యొక్కయడుగయినను ముందునకు వేయజాలనంతటి సీరసస్థితిలోనికివచ్చితిని ఒడలంతయు జమటచే తడిసిపోయెను. ఇక చేయునదిలేక, యూకారుచున్న చెమటతోడనే నావీధికి జివరనున్న యొక్కచిన్నయరుగుపై గూలబడి మిత్రుని గలసుకొనలేకపోతినేయని విచారించుచుంటిని. చేతిరుమాలు నెక్కడనో మార్గమునందు జారవిడచుకొనియుండుటచే, జెమటనుదుడుచుకొనుట కేమియు లేక, తొడుగుకొనిన పట్టుయంగీనెత్తి, దేహమునుండి ప్రవాహరూపమున జారుచున్న చెమటను దుడుచుకొన నుద్యుక్తుడనై యుండు సమయమున నెటనుండియో యొకమృదువైన చేరుమాలువచ్చి నాముందు పడెను. అంత నేనత్యంతాశ్చర్యనిమగ్న మానసుండనై యారుమాలును చేతబట్టి యందల్లబడిన చిత్రవిచిత్రములజూచి ముగ్ధుడనయితిని. కాని యది యెందుండి పడినదియు, ఎవరు పడవేసినదియు దెలియక విభ్రాంతుడనై, యదిపడినదెసకు తలనుపైకెత్తి చూచితిని. ఆపైభాగమునంగల యొకమేడకిటికీలో నాకొక దేదీప్యమానవిభాసితయగు నొక్కతరుణవయస్కురాలగు విలాసిని నాకంటబడుటచే, నామె తేజమునకు నాకన్నులు మూతలుపడెను. అట్టియద్భుతలావణ్యవతిని నాజన్మమధ్యమునందెన్నఁడును జూచియెరుంగను. అపుడు నామనస్సు పరిపరివిధంబుల బోవ, యప్పటి నాప్రకృతస్థితినంతను మరచిపోతిని. ఆమగువయొక్క

యసామాన్యవయోరూపురేఖలను వర్ణించుటకు నాకు వేయినాలుక లయినను నీయని విధాతను బెక్కుతెరంగుల దూలనాడితిని. రెప్పవా ల్పక నామోహనాంగిపై పట్టులేచేష్టలదక్కి తిలకింపనారంభించితిని. అంతనా వన్నెలాడియు నావైపుజూచుచు, చిరునవ్వు ముఖమున హొయలుమీర, దనచూపుడు వ్రేలును నోటబెట్టుకొని దానిని తిరుగ నడిమి వ్రేలుతోచేర్చి, వాటిని వక్షముననాన్చి, పిమ్మట ముఖమునావ లకు ద్రిప్పుకొని, కిటికీతలుపులనుమూసి వెడలిపోయెను. ఆమె వెడలి పోయినంతనే నాకీజగమంతయు నంధకారబంధురమయ్యెను. తలపై పిడుగుపడినరీతిగా, నాతల గిర్రున తిరిగిపోజొచ్చెను. ఇంకను నేనామె నెంతయోసేపు జూడవలయుననుకొంటినిగాని, నాయాశనిరాశయయ్యెను. ఆమె గావించిన సౌంజ్ఞలభావమేమియు నెరుంగజాలనినేను తల్లడిల్లి పోతిని. తిరుగ గిటికీతలుపునుదెరచి, యామెనచ్చునను తలంపుతో నేనాసాయంకాలము వరకును సర్వమునుమరచి, ఆయరుగుపైననేగూ ర్చొని యాకిటికీవైపు రెప్పవాల్పకజూచుచు కూర్చుంటిని. నామెడలు పడిపోయినవేగాని, యామగువ మరిరాలేదు. అవిధముగానె నర్ధరా త్రంబువరకును నాసుందరాంగిని తిరుగదర్శింపవలయునని గూర్చొంటిని. కాని, నాకోరిక నెరవేరలేదు. ఎవరినయిన యాసుదతియొక్క సమా చారమునడిగి తెలుసుకొందమన్న, నట జనసంచారమేలేకుండ బో యెను. ఇక తడసినలాభములేదని యెంచి, యట గృహముకడ నాకొ రకై గావింపబడిన వివాహప్రయత్నమును, బంధుగులెల్లరును వచ్చి యుండుటను నొక్కపరిజ్ఞప్తికిరాగా, వెంటనే యాతావునువీడి, చరచర నిజగృహాభిముఖుండనై పోతిని.

నేను గృహము చేరుకొనుసరికి, పెండ్లిముహూర్తము దాటి పోయి, యప్పటికి జాలతడవయ్యెను. నేనెటకో బోయితినని బంధుగు లెల్లరును, యెవరియిండ్లకువారు వెడలిపోయియుందురు. అంత నొక

గదిలో నా భార్యయగు అజీజే బోరుననేడ్చుచు, నొకమూల గూర్చొని యుండి, నన్ను గాంచినయంతనే మరింతదుఃఖ మతిశయింపగా నన్ను కౌగలించుకొని "అయ్యో! ప్రియా! ఇంతవరకు నెందేగితివి? పట్టణములోని పిన్నపెద్దలందరును శుభముహూర్తమువరకును వేచియుండి, నీ వెంతకును రాకుండుటచే, విందులమాత్ర మారగించి వెడలిపోయినారు. మీ నాయన నీ ప్రవర్తనమునకు మిక్కిలి ఆగ్రహముకలవాడై, మన వివాహమును ఒక సంవత్సరమువరకును జరుగకుండున ట్లేర్పాటు గావించి, యీ మనపెండ్లి ముహూర్తమున కై దానుగావించిన ప్రయత్నములును, ద్రవ్యమును వ్యర్థమయ్యెగదాయని మిక్కిలి విచారించి, విచారించి, రహస్యాలోచనమందిరమున బరుండబోయినారు. నీవు రాకుండుటవల్ల యెంత అల్లరైయైనదో నీ వెరుంగవుగదా! అయ్యో! నాథా! ఇంత తడవెచట నేమిచేయుచుంటివి? ఎంత అన్యాయకార్యమొనర్చితివి?" అని పెక్కుతెరుంగుల విచారించుచుండ, నే నామెను గొంతవరకు నోదార్చి, నాకు తటస్థించిన పరిస్థితియంతయు నామెకామూలాగ్రముగాజెప్పి, నేనుగొనివచ్చిన చేతిరుమాలు నామెకుజూపి, యీ కిటికీలో గానుపించిన సుందరాంగియొక్క పొందు గూడనిచో నేను బ్రతుకజాలననియు, నామెపై అధికమోహమును గలిగియుంటి ననియుజెప్పి, మరియు నాచతురమతి గావించిన సౌంజ్ఞల నామెకెరింగించి, నాకెట్లయిన నా సంజ్ఞలభావమునె దెలిపి యీ కోమలాంగితో భోగించు భాగ్యమును గలుగజేసి తీరవలసినదిగా నేను అజీజే పాదములనుబట్టుకొని పెక్కుతెరంగుల బ్రాధేయపూర్వకముగా బ్రతిమాలితిని.

అట్లు సిగ్గువిడచి, నేను ప్రార్థించిన యనంతరము అజీజే నా ముఖమువైపు పారజూచినది. వెంటనే గన్నులుమూసికొని, యొక్కక్షణ మేదియో యాలోచించి, యనంతరము నాతో యిట్లులనియెను. "అయ్యా! నీ కోరికను నెరవేర్చుట నాకు విధియైయున్నది. ఇంత

మాత్రమునకై నన్నింతగా నీవు వేడుకొన నవసరములేదు. నీకు సహాయముజేసి, నీవు ప్రేమించిన యా సుందరాంగియొక్క పొందును నీకు గలుగజేయుటకై, యవసరమైనయెడల నా ప్రాణముల సయితము నవ్వుచు, నవ్వుచు నీయగలను. ఇక నీవు విచారమునుదక్కి యుండుము. ఆ మోహనాంగిని నీ వనతికాలములోన గూడగలవు". అని చెప్పుచున్నపు డామెనేత్రములు నక్షత్రములవలె మిలమిల మెరసి పోయెను. అధర మొందులకో చెలించిపోవుచుండెను. ఆమెకు నాయందు గల నిర్మలప్రేమకును, త్యాగబుద్ధికిని నే నాశ్చర్యపోతిని. ఏ యిల్లాలయినను తనభర్త వేరొకవనితను బ్రేమించియుండెనని దెలిసిన యెట్లు సహించుకొనగలదు? ఓ రాజకుమారా! నా భార్యయైన అజీజే, నా ప్రియురాలిని నన్ను గూర్చుటకై యా మహాపతివ్రత తన ప్రాణముల సయితము నర్పింప సంసిద్ధయై యుండెను; కంటివా? అనంతరము నేను కిటికీలోనుండి, యా చతురమతియైన మోహనాంగి గావించిన సౌంజ్ఞలయొక్క భావమును దెలుపుమనికోరగా, నామె యిట్లు చెప్పెను—

"అయ్యా! ఆమె తనవ్రేలిని నోట బెట్టుకొనుటవలన నీవామె శరీరమున కాత్మవంటివాడవని యామె యభిప్రాయమై యున్నది. చేరుమాలు నామె నీ కొసంగుటచే, నీ వామెకు మనోవల్లభుడవని సూచిన. ఏమందువేని, చేరుమాలు ప్రియులకు ప్రియురాండ్రొసంగు ప్రేమ చిహ్నమగు ప్రధానపారితోషికము. ఆ మగువ తనహృదయముపై రెండువ్రేళ్ళను నిడుకొనుటచే, నామెహృదయము నీయందు లగ్నమై యున్నదని తెలుపుట రెండువ్రేళ్లను జూపుటలోగల విశేష మేమందు వేని—మరిరెండు రోజులు పోయినయనంతరము నీవామెను జూడగలిగినయెడల, నామె నీకై పొందు ఖేదమును నీవే యూహించగలవని యామె యభిప్రాయమైయున్నది. దీనినిబట్టి ఆసుందరాంగియు, నీవలెనే నీకై పరితపించుచున్నదనియు, రెండురోజులు పోయిన యనంతరము

నీవు తిరుగ యీ తావునకు బోవలసియుండెననియు గ్రహింపుము ".
అని నాభార్యయగు అజీజే చెప్పగా నాకు పరమానందము గలిగెను.
ఆ సౌంజ్ఞలభావమును జెప్పగల్గిన యామె సామర్థ్యంబున కెంతయు
సంతసించి, రెండుదినముల నెట్లో గడపితిని. మూడవదినంబున నా ప్రియు
రాలుండు తావునకు బోసనుకట్టితిని. అంత నాభార్య నాకు స్వయ
ముగా మంచిదుస్తుల ధరింపజేసి 'నీకు జయముగలిగి, నీ కోరిక నెర
వేరుగాక !" యని దీవించిపంపెను.

అంత నేను వడివడిగా మున్ను కూర్చొనియున్న చిన్నయరుగు
కడకుబోయి, యటకూర్చొని 'మేడ కిటికీవైపు జూచుచుంటిని. ఎంత
కును నా కిటికీతలుపులు పీడుటగాని, నన్ను వలపించిన వలపులాడి
వచ్చుటగాని జరుగలేదు. కొంత తడవునకా కిటికీతలుపులు వీడెను.
ఆ సుందరాంగిని జూచినంతనే నాకన్నులు మిరుమిట్లుగొల్పెను. ఆమె
నన్ను జూచి, తన అయిదువ్రేళ్లతోను గుండెలపై గొట్టుకొని, నాకొక
యద్దమును, ఎర్రని జేబురుమాలునుజూపి, దానిని రెండుమూడుసారు
లూపించి, తరవాత శిరఃకంపమొనర్చుచు నాతో నొక్కమాట నయి
నను పలుకక, కిటికీ తలుపును మూసి వెడలిపోయెను. ఆనాటికి నా శ్రమ
యంతయు నిరర్థకమయ్యెను. ఆ సౌంజ్ఞలభావము నాకేమియు దెలియ
లేదు. ఆ రేయంతయు నట్లేవృథాగా గడుపవలసివచ్చెను. అంత నేను
నిరాశుడనై నిజగృహముచేరితిని. అప్పటికి అజీజే మోకాళ్లపై శిరము
నుంచుకొని మితిలేని దుఃఖము ననుభవించుచుండుటను గాంచితిని.
నన్ను జూచినంతనే యామె నా కెదురువచ్చి, దుఃఖమును దిగమ్రింగి,
నా దుస్తుల నన్నింటినిదీసి, నా శ్రమవోవ గొంతతడవు శీతలోపచార
ములు గావించిన యనంతరము నా వృత్తాంతమునడిగి, నేను నా ప్రియు
రాలిని గలసుకొని యేమిగావించినదియు మిక్కిలి యాదరతభావముతో

నడుగ, నే నామెకు జరిగిన యెల్లసమాచారమును నెరింగించి, యామె సౌంజ్ఞలభావమును దెల్పుమనికోరి, యిక నాకా మోహనాంగిని గూడుభాగ్యము లేదేమోయని పెద్దపెట్టున నేడువ నారంభించితిని. నా యిల్లాలు నాకు బెక్కువిధంబులగు యూరడివాక్యములబల్కి-"అయ్యా! విచారింపబనిలేదు. నీ ప్రియురాలిని నీవు తప్పక బొంద గలవు. ఆమె తన అరచేతితో గుండెలపై గొట్టుకొనుట కర్థమేమందు వేని, అయిదురోజులు పోయిన యనంతరము రావలయునని. అద్దమును, రంగు జేబురుమాలును గనపరచుటవలన, ఆనాడు తనవద్దనుంచి వర్త మానము వచ్చునరకును నీవా వీధియందుగల రంగులువేయువాని యంగడియొద్ద వేచియుండవలసినదిగా యామె యభిప్రాయమైయున్నది. కాన నీవిక విచారము నువీడి యానాడుపోయి, ఆ చెప్పినతెరంగు నాచ రించి, నీ మనోవాంఛితమును నెరవేర్చుకొనుము". అని చెప్పినది. నాభార్యయగు అజీజేయొక్క మాటలు వినగనే నాకు గొంత నూతనో త్సాహము గలిగెను. అయిదురోజుల నెట్లెట్లో గడపితిని. ఆరవనాడు నాభార్య నన్ను బెక్కు తెరంగుల నలంకరించి, "యీ సారియైనను నీకు దప్పక జయముగలుగుగాక!" యనిదీవించి, పంపెను.

అంత నే, నత్యుత్సాహముతో నా భార్య చెప్పినతెరంగున నా ప్రియురాలుండు వీధికరిగి, నట రంగులువేయు దుకాణముండెను గాని, యది యానాడు మూయబడియుండెను. అంతట నాయుత్సా హము క్షీణించినది. 'ఇక చేయునదేమా, యని యోజించుకొనుచు, నే నంతకుముందు గూర్చొనియుండు చిన్నయరుగుకడకు బోయి, కిటికీ వైపునకు తదేకధ్యానముతో దిలకించుచు కూర్చొనియుంటిని. కొంత తడవునకు కిటికీతలుపులు వీడెను. నేను ప్రేమించిన మోహనాంగి మెరుపుతీగవలె నాకిటికీలో మెరిసెను. ఆ సుందరాంగియొక్క దివ్యతేజ మునకు నా కన్నులు చలించెను. ఆమె నన్నుగాంచినంతనే యొక

నీవు తిరుగ యీ తావునకు బోవలసియుండెననియు గ్రహింపుము ". అని నాభార్యయగు అజీజే చెప్పగా నాకు పరమానందము గలిగెను. ఆ సౌంజ్ఞలభావమును జెప్పగల్గిన యామె సామర్థ్యంబున కెంతయు సంతసించి, రెండుదినముల నెట్లోగడపితిని. మూడవదినంబున నా ప్రియురాలుండు తావునకు బోసమకట్టితిని. అంత నాభార్య నాకు స్వయముగా మంచిదుస్తుల ధరింపజేసి 'నీకు జయముగలిగి, నీ కోరిక నెరవేరుగాక !" యని దీవించిపంపెను.

అంత నేను వడివడిగా మున్నుకూర్చొనియున్న చిన్నయరుగు కడకుబోయి, యటకూర్చొని మేడ కిటికీవైపు జూచుచుంటిని. ఎంతకును నా కిటికీతలుపులు విడుటగాని, నన్ను వలపించిన వలపులాడి వచ్చుటగాని జరుగలేదు. కొంత తడవునకా కిటికీతలుపులు వీడెను. ఆ సుందరాంగిని జూచినంతనే నాకన్నులు మిరుమిట్లుగొల్పెను. ఆమె నన్ను జూచి, తన అయిదువ్రేళ్లతోను గుండెలపై గొట్టుకొని, నాకొక యద్దమును, ఎర్రని జేబురుమాలునుజూపి, దానిని రెండుమూడుసారు లూపించి, తరవాత శిరఃకంపమొనర్చుచు నాతో నొక్కమాట నయినను పలుకక, కిటికీ తలుపును మూసి వెడలిపోయెను. ఆనాటికి నా శ్రమయంతయు నిరర్థకమయ్యెను. ఆ సౌంజ్ఞలభావము నాకేమియు దెలియలేదు. ఆ రేయంతయు నట్లేవ్యర్థాగా గడుపవలసివచ్చెను. అంత నేను నిరాశుడనై నిజగృహముచేరితిని. అప్పటికి అజీజే మోకాళ్లపై శిరము నుంచుకొని మితిలేని దుఃఖము ననుభవించుచుండుటను గాంచితిని. నన్ను జూచినంతనే యామె నా కెదురువచ్చి, దుఃఖమును దిగమ్రింగి, నా దుస్తుల నన్నింటినిదీసి, నా శ్రమవోవ గొంతతడవు శీతలోపచారములు గావించిన యనంతరము నా వృత్తాంతమునడిగి, నేను నా ప్రియురాలిని గలసుకొని యేమిగావించినదియు మిక్కిలి యాదరతభావముతో

నడుగ, నేనామెకు జరిగిన యెల్లసమాచారమును నెరింగించి, యామె సౌంజ్ఞలభావమును దెల్పుమనికోరి, యిక నాకా మోహనాంగిని గూడుభాగ్యము లేదేమోయని వెక్కివెక్కి యేడువ నారంభించితిని. నా యిల్లాలు నాకు బెక్కువిధంబులగు యూరడివాక్యములబల్కి “ అయ్యా ! విచారింపబనిలేదు. నీ ప్రియురాలిని నీవు తప్పక బొందగలవు. ఆమె తన అరచేతితో గుండెలపై గొట్టుకొనుట కర్థమేమందువేని, అయిదురోజులు పోయిన యనంతరము రావలయునని. అద్దమును, రంగు జేబురుమాలును గనపరచుటవలన, ఆనాడు తనవద్దనుంచి వస్త్రమానము వచ్చునవరకును నీనా వీధియందుగల రంగులువేయువాని యంగడిమొద్ద వేచియుండవలసినదిగా యామె యభిప్రాయమైయున్నది. కాన నీవిక విచారము నువీడి యానాడుపోయి, ఆ చెప్పినతెరంగు నాచరించి, నీ మనోవాంఛితమును నెరవేర్చుకొనుము ”. అని చెప్పినది. నాభార్యయగు అజీజేయొక్క మాటలు వినగనే నాకు గొంత నూతనోత్సాహము గలిగెను. అయిదురోజుల నెట్లో గడపితిని. ఆరవనాడు నాభార్య నన్ను బెక్కుతెరంగుల నలంకరించి, “ యీ సారియైనను నీకు దప్పక జయముగలుగుగాక ! ” యనిదీవించి, పంపెను.

అంత నే, నత్యుత్సాహముతో నా భార్య చెప్పినతెరంగున నా ప్రియురాలుండు వీధికరిగి, నట రంగులువేయు దుకాణముండెను గాని, యది యానాడు మూయబడియుండెను. అంతట నాయుత్సాహము క్షీణించినది. ఇక చేయునదేమా, యని యోజించుకొనుచు, నే నంతకుముందు గూర్చొనియుండు చిన్నయరుగుకడకు బోయి, కిటికీవైపునకు తదేకధ్యానముతో దిలకించుచు కూర్చొనియుంటిని. కొంత తడవునకు కిటికీతలుపులు వీడెను. నేను ప్రేమించిన మోహనాంగి మెరుపుతీగవలె నాకిటికీలో మెరిసెను. ఆ సుందరాంగియొక్క దివ్యతేజమునకు నా కన్నులు చలించెను. ఆమె నన్నుగాంచినంతనే యొక

యద్దమును నాకుజూపి, దాని నొకసంచిలోవేసి బిగించికట్టి, ఒకచో నుంచి, తిరుగ నొకపచ్చని మొక్కలతోనున్న కుండిని, యొకలాంతరును దెచ్చి, ఆ కుండిని నాకుజూపి, లాంతరు నాకుండిపై బెట్టి తలను విరియబోసుకొని క్షణకాలముండి వెంటనే కిటికీతలుపును మూసి వెడలి పోయెను. అపుడు నా కెక్కడలేని దుఃఖమును కలిగెను. కాని యేమి చేతును. నా నిర్భాగ్యదశకు లోలోననే విచారించుచు తలను వ్రేలవేసి కొని నిజగృహాభిముఖముగా నడచిపోవుచుండ, నా భార్య యీమె గావించు సౌంజ్ఞలను దప్పుడుభావము జెప్పుచున్నదేమోనను యభిప్రాయము నాకు గలిగెను. ఆ భావముతోనె నే నిల్లుచేరుకొంటిని.

నేనింటికరిగి చూచునప్పటికి నాభార్యయగు అజీజే కుళ్ళి కుళ్ళి యేడ్చుచు నేలపై బరుండి నన్నుగనినంతనే లేచివచ్చి, నామస్తులనుదీసి దుఃఖమును దిగమ్రింగి "అయ్యో! ఏమయినది. నీప్రేయసిని గలుసు కొంటివా? ఆమెతో గోరికదీర సుఖించితివా?" యని యడుగు నప్పటికి నాకు క్రోధమాగినదికాదు. గుండెలమీద నామెను కోపముకొలదియు దన్ని, "ఛీ! పాపాత్మురాలా! నీమూలముననే నాకిట్టియవమానములు గల్గుచున్నవి. నా ప్రేయసియొక్క సౌంజ్ఞలకు దప్పుడు భావములనుజెప్పి, నన్ను మోసపుచ్చితివి. ఇకనెన్నడును నీమాటలు నమ్మరాదు. నీవు చెప్పినరీతిగా నొక్కసారియు జరుగుటలేదు." అని దూలనాడితిని. నేను తన్నినతన్నుతో నామెనేలపై పడిపోయెను. గుండెలనుండి నెత్తురు కారజొచ్చెను. ఆమె వెంటనేలేచి, కండ్లనుండి కారు నీరును తుడుచుకొని, నేలపైనుండు కొంతబూడిదనుదీసి గాయమును బూడ్చి, మిక్కిలి శాంతముతో నాకిట్లులనియెను. "నాథా! అల్లానీకు జయమును గూర్చుగాక! నాకఠినహృదయమును దన్నుటచే నీకాలెంతగా నొచ్చెనోగదా!" యని చెప్పి, నేలపై బడినరక్తపుమరకలన్నింటిని దుడిచి, అక్కడి నాక్రూరకార్య మొరులకుదెలియకుండ జేసెను.

అప్పుడా మహాసాధ్వినిగనిన నాపాషాణహృదయము కరిగెను. ఓరాజకుమారా! అజీజేవంటి యిట్టియుత్తమయిల్లాలును నీవెందయిన జూచితివా? అనంతరమామె తిరుగనన్ను జేరి సదయసీతలవచనంబుల నాతో “నాథా! నీవు కృతకృత్యుడవు కాగలవు. జరిగినవిషయమేమో జెప్పుము. ఆమె నీప్రేమయెట్టిదో బరీక్షింపవలయుననెడి తలంపుతో నిట్లుచేయుచుండెనని తోచుచున్నది. ఏమి జరిగినదో విపులముగా జెప్పుము” అని పలుతెరంగుల వేడ, నేనామెకు గతరాత్రంబున జరిగిన యెల్లవిషయములను జెప్పి, యానాడామె యొనర్చిన సౌంజ్ఞలనుగూడ నెరింగించి, వాటిభావమును జెప్పుమనగా నాభార్య యిట్లు చెప్పెను. “అయ్యా! ఆమెకు నీయందు ప్రబలమోహము కలదు. నీవామెను గూడి సుఖింపగలవు. ఆమె అద్దమును నీకుజూపి సంచిలో గట్టివేయుట వలన రేపు సూర్యాస్తమయమైనవెంటనే నీవురావలసినదిగా యామె యభిప్రాయమైయుండెను. మొక్కలకుండలను, లాంతరును నీకుజూపుట వల్ల ఆమె భవనమునకు వెనుకతట్టుననున్న పూలవనములో నామెవచ్చు వరకును నీవు వేచియుండవలసినదిగా నామె యభిప్రాయమని యెరుంగుము. ఇది నిన్నటిదినమున జరిగినవిషయముగాన, ఈనాటిసాయంసమయముననే నీవట కరుగవలసియున్నది. ఈనాడు నీకు దప్పక ఆమె పొందు లభింపగలదు. ధైర్యమును వహించియుండుము” అనియామె పలుకగనే నాకు తిరుగ నూతనోత్సాహము కలుగ నారంభించెను. సాయంకాల మెప్పుడగునా, సూర్యుడెప్పుడస్తమించునా, యెప్పుడు నా ప్రేయసిని గలసికొందునాయని నాహృదయము తహతహపడజొచ్చెను.

క్రమముగా సాయంకాలమయ్యెను. అంత నాభార్యయైన అజీజే నన్ను జలకమాడించి, చలువవస్త్రముల గట్టించి, సుష్టుగాభోజనమిడి, కడుపుపగులునట్లు విలపించుచు నాకడకువచ్చి, “నాథా! యిక మీరరుగుడు. అల్లా మీకోరికను నెరవేర్చుగాక! ఆసుందరాంగి

యద్దమును నాకుజూపి, దాని నొకసంచిలోవేసి బిగించికట్టి, ఒకచో నుంచి, తిరుగ నొకపచ్చని మొక్కలతోనున్న కుండీని, యొకలాంతరును దెచ్చి, ఆ కుండీని నాకుజూపి, లాంతరు నాకుండీపై బెట్టి తలను విరియబోసుకొని క్షణకాలముండి వెంటనే కిటికీతలుపును మూసి వెడలిపోయెను. అపుడు నా కెక్కడలేని దుఃఖమును కలిగెను. కాని యేమి చేతును. నా నిర్భాగ్యదశకు లోలోననే విచారించుచు తలనువ్రేలవేసి కొని నిజగృహాభిముఖముగా నడచిపోవుచుండ, నా భార్య యీ మె గావించు సౌంజ్ఞలను దప్పుడుభావము జెప్పుచున్నదేమోనను యభిప్రాయము నాకు గలిగెను. ఆ భావముతోనె నే నిల్లుచేరుకొంటిని.

నేనింటికరిగి చూచునప్పటికి నాభార్యయగు అజీజే కుళ్ళి కుళ్ళి యేడ్చుచు నేలపై బరుండి నన్నుగనినంతనే లేచివచ్చి, నా దుస్తులనుదీసి దుఃఖమును దిగమ్రింగి "అయ్యా! ఏమయినది. నీ ప్రేయసిని గలుసుకొంటివా? ఆమెతో గోరికదీర సుఖించితివా?" యని యడుగు నప్పటికి నాకు క్రోధమాగినదికాదు. గుండెలమీద నామెను కోపముకొలదియు దన్ని, "ఛీ! పాపాత్మురాలా! నీమూలముననే నాకిట్టియవమానములు గల్గుచున్నవి. నా ప్రేయసియొక్క సౌంజ్ఞలకు దప్పుడు భావములనుజెప్పి, నన్ను మోసపుచ్చితివి. ఇకనెన్నడును నీమాటలు నమ్మరాదు. నీవు చెప్పినరీతిగా నొక్కసారియు జరుగుటలేదు." అని దూలనాడితిని. నేను తన్నినతన్నుతో నామెనేలపై పడిపోయెను. గుండెలనుండి నెత్తురు కారజొచ్చెను. ఆమె వెంటనేలేచి, కండ్లనుండి కారు నీరును తుడుచుకొని, నేలపైనుండు కొంతబూడిదనుదీసి గాయమును బూడ్చి, మిక్కిలి శాంతముతో నాకిట్టులనియెను. "నాథా! అల్లానీకు జయమును గూర్చుగాక! నాకఠినహృదయమును దన్నుటచే నీకాలెంతగా నొచ్చెనోగదా!" యని చెప్పి, నేలపై బడినరక్తపుమరకలన్నింటిని దుడిచి, అక్కడి నాకార్యాకార్యములకు దెలియకుండ జేసెను.

అప్పుడా మహాసాధ్వినిగనిన నాపాషాణహృదయము కరిగెను. ఓరాజకుమారా! అజీజేవంటి యిట్టియుత్తమయిల్లాలును నీవెందయిన జూచితివా? అనంతరమామె తిరుగనన్నుజేరి సవయసీతలవచనంబుల నాతో "నాథా! నీవు కృతకృత్యుడవు కాగలవు. జరిగినవిషయమేమో జెప్పుము. ఆమె నీప్రేమయెట్టిదో బరీక్షింపవలయునని తలంపుతో నిట్లుచేయుచుండెనని తోచుచున్నది. ఏమి జరిగినదో విపులముగా జెప్పుము" అని పలుతెరంగులవేడ, నేనామెకు గతరాత్రంబున జరిగిన యెల్లవిషయములను జెప్పి, యామె యొనగ్చిన సౌంజ్ఞలనుగూడ నెరింగించి, వాటిభావమును జెప్పుమనగా నాభార్య యిట్లు చెప్పెను. "అయ్యా! ఆమెకు నీయందు ప్రబలమోహము కలదు. నీవామెను గూడి సుఖింపగలవు. ఆమె అద్దమును నీకుజూపి సంచిలో గట్టివేయుట వలన రేపు సూర్యాస్తమయమగుటనే నీవురావలసినదిగా నామె యభిప్రాయమైయుండెను. మొగ్గలకుండును, లాంతరును నీకుజూపుట వల్ల ఆమె భవనమునకు వెనుకతట్టుననున్న పూలవనములో నామెవచ్చు వరకును నీవు వేచియుండవలసినదిగా నామె యభిప్రాయమని యెరుంగుము. ఇది నిన్నటిదినమున జరిగినవిషయముగాన, ఈనాటిసాయంసమయముననే నీవట కరుగవలసియున్నది. ఈనాడునీకు దప్పక ఆమె పొందు లభింపగలదు. ధైర్యమును వహించియుండుము" అనియామె పలుకగనే నాకు తిరుగ నూతనోత్సాహము కలుగ నారంభించెను. సాయంకాల మెప్పుడగునా, సూర్యుడెప్పుడస్తమించునా, యెపుడు నాప్రియసిని గలసికొందునాయని నాహృదయము తహతహపడజొచ్చెను.

క్రమముగా సాయంకాలమయ్యెను. అంత నాభార్యయైన అజీజే నన్ను జలకమాడించి, చలువవస్త్రముల గట్టించి, సుష్టుగాభోజనమిడి, కడుపుపగులునట్లు విలపించుచు నాకడకువచ్చి, "నాథా! యిక మీరరుగుడు. అల్లా మీకోరికను నెరవేర్చుగాక! ఆసుందరాంగి

మిమ్ము గలసుకొని, యామెతో సంగమించుటకు మీకనుమతి నొసంగి నవు డీచిన్న మెత్తుకస్తూరి మ్రింగినయనంతరము మాత్రమె యాకార్య మునకు దిగుము. మరియు ఆమె నొక ప్రశ్నను దప్పకయడుగుము అదేమందువేని—"దుర్భరమైన మోహమును గలిగియున్న యావను లైన మోహితులేమిచేయవలయును ?" ఇదియే నీవామెనడుగవలసిన ప్రశ్న. ఈవిషయమును నీవు మరచిపోక, ఆమె యేమిసమాధానము చెప్పునదియు నాకెరింగింపుము" అని నుడివి, అజీజే దుఃఖముచేకుమిలి పోవుచు, నన్ను నా ప్రియురాలికడకు బంపెను.

అప్పటికి బూర్తిగా చీకటిపడుటచే నేను తొందర తొందరగా, వేగముగా కొట్టుకొనుగుండెలతో, నా ప్రేయసియొక్క సౌంజ్ఞాభావము ననుసరించి, యామె భవనముయొక్క వెనుకతట్టునుండు యుద్యానవన మును బ్రవేశించి, అందామెకొరకై జాలతడవు వేచియుంటిని. కాని యెంతకును నామె రాకుండుటచే నేనువిసిగి, నా కగుపించిన మార్గము ననుసరించి పోతిని. ఆ బాట నన్నొకదివ్యభవనములోనికి గొనిపోయెను. ఆ భవనమంతయు విద్యుద్దీపములతో దేదీప్యమానమై వెలుగుచు, పట్ట పగలువలె నుండెను. అందనేకములయిన మృదుతల్పంబులును సోఫా లును నందముగా నమర్పబడియుండెను. ద్రాక్ష, అంజూర, దానిమ్మ మొదలగు ఫలజాతులును సారాయము మొదలగు వివిధపానీయము లును వింత సీసాలలో నమర్పబడియుండెను. అచట మేజాలపైనున్న వింతవింత బంగారుబొమ్మలును ; అల్లికచిత్రములును నచటి నిలువు టద్దములలో ప్రతిఫలించుచు నతిమనోహరముగానుండెను. అప్పటికే మిక్కిలి యలసిపోయియున్న నా కచటి తినుబండారములను ద్రాక్షరస మును జూడగనే నోరూరెను. ఇక నేను తడవుచేయక యచటిఫలముల నన్నింటిని కడుపుపట్టినంతవరకు భక్షించి, యొకసీసాడు ద్రాక్షసారా

యమును గ్రోలి కడుపునింపుకొంటిని. వెంటనే నన్ను నిద్రాదేవి వరించుటచే కన్నులు మూతలుపడనారంభించెను. అంతట నేను చేయునది లేక నచటగల యొకమృదుపాన్పుపై మేనువాల్చి, గాఢనిద్రాపరవశుండనయితిని. ఆవిధముగా నే నెంతసేపు నిదురించినదియు నే నెరుంగను. ఉదయమే లేచి చూచుసరికి కొకయిసుకనేలపై యొండలో బరుండియుంటిని. అప్పుడు నాకడుపై గొన్ని మసిబొగ్గులును, గొంతయుప్పును నుండెను. నే నాశ్చర్యముతో వాటిని దులుపుకొని, యిక గత్యంతరము గానక, తూలుచు నిజగృహాభిముఖుండనై పోతిని. నే నిల్లుచేరుకొనునప్పటికి నాభార్యయైన అజీజేకన్నులు వాచునట్లేడ్చుచు, నాకెదురువచ్చి, నాదుస్తుల నన్నింటిని దీసి, యొక మృదుతల్పంబున గూర్చుండబెట్టి, శీతలోపచారముల జేయుచు, కన్నీరు సంతతధారాపాతమై యామె చెక్కుటద్దములనుండి జార, ఆమె యద్దానిని సరకుగొనక, నా శరీరమునంతను ప్రేమపూర్వకముగా నిమురుచు "అయ్యో! ఏమయినది? నీ ప్రేయసిని గలుసుకొని సుఖింపగల్గితివా! నీ కోరిక నెరవేరినదా? నేనామెను అడుగుమనిన ప్రశ్నడిగితివా? ఆమె యేమని చెప్పెను?" అని నన్ను ప్రశ్నింప నేను తెల్లమొగమువైచి, నిరుత్సాహముతో జరిగినవిషయమంతయు జెప్పి, ఆ యుదయముననే నెండలోబడియుంటయు, నాఉదరముపై మసిబొగ్గులును, ఉప్పును ఉండుటయు మొదలయిన నెల్లవిషయములను నామె కెరింగించితిని.

అంతనామె "నాధా! ఎంతటి యవివేకముతో ప్రయత్నించితివి. ఆ చతురమతి నిన్నెట్టిచిక్కులకు లోనుగాజేయునో కదా! నీవు నిద్దురపోవుటచే నిట్టియవమానము సిద్ధించినది. ప్రేమతత్త్వము నీకు బూర్తిగా దెలియునని నీవు గర్వపడుచుంటివి. ప్రేమచే దహింపబడు హృదయముగలవా రట్టిస్థితిలో నెట్లు నిద్దురపోగలరు? నీవట్లు నిద్దురపోవుటవలన నిన్నామె పహ్యాముగాబరిగణించి, నీవంటి సంఘుమారుడు

బ్రతికియుండుటకంటె ఉప్పులో నూరవేయబడుట యుచితమని ఆమె అభిప్రాయపడి నీ యుదరముపై యుప్పునుంచెను. ఇక పసిబాలకునివలె నీవు తినుటయు త్రాగుటయుదప్ప నితరమేమియు నెరుంగవనియెంచి, ఆమె నీయుదరముపై బొగ్గులనిడి, నీ మనస్సెట్టి మసిబొగ్గువలె మలిన భూయిష్ఠమని యెంచుచున్నది. అయ్యో! అయినను అధైర్యపడకుము. నీకా సుందరిపొందు లభించుటకు అల్లా నీకు సాయముజేయుగాక! ఈ రాత్రికూడ నీ వచటికి తప్పకయరుగుము. ఆమెతో నీకు గూటమి సంభవించినయెడల నే నడుగమనిన ప్రశ్నమాత్రము తప్పకలడుగుము". అనిచెప్పి, అజీజే నన్ను జలకమాడించి, శుభ్రవస్త్రముల గట్టించి, యానాటి రాత్రికూడ నన్ను నా ప్రియురాలికడకు బంపి నిద్దురపోక ఆమె వచ్చువరకును మెళకువగా నుండుమని హెచ్చరించి పంపెను.

నేనును మామూలుగా ఆ భవనముకడకరిగి రాత్రి చాలసేపటి వరకును నిద్దురపోక అందే వేచియుంటిని. కాని, ఆమెరాలేదు. తిరుగ ఆ మధురపానీయములును, ఫలములును నన్నాకర్షించెను. నేను హృదయముండబట్టక వాటిని కరువుగొట్టువానివలె కడుపునిండ భుజించుటచే నైకము గ్రమ్మి నిదురపోయి, ఉదయముననే నిరుత్సాహపూరితమాన సుండనై నిజగృహంబునకేగ, నా భార్యయగు అజీజే కన్నులు చిల్లులు పడునట్లు దుఃఖించుచు, నా యవివేకమునకు బెక్కురీతుల నగచి, నన్ను తిరుగ నారాత్రికూడ నిద్దురపోవలదని హెచ్చరించి పంపెను. ఈరీతిగా నేను నా ప్రియురాలి భవనమున కేడురాత్రులు పోతిని. ఏడురాత్రులునుగూడ, నేను మూర్ఖుడనై యచటిఫలముల భుజించుచు, పానీయముల ద్రావి మత్తెక్కి పడిపోవుచుండెడివాడను. ఏడవరాత్రి నా గుండెలపై యొకశూలమును గత్తియు నుంచబడుటచే ఆ మరునాడటకు

నే నేగి నిమరించినయెడల చచ్చుట నిజమని నాభార్య చెప్పి నిద్దుర పోక ఉండవలసినదని అజాజే నన్ను మరింతహెచ్చరించి దుఃఖాస్రువులతో నన్ను నాప్రియురాలికడకు బంపెను.

---

# 23 డెలీలేకథ.

ఎనిమిదవరాత్రి నాభార్యనువిడచి, యథాప్రకారముగా నా ప్రియురాలినిగూడు తలంపుతో నాభవనమున ప్రవేశించి, నిద్దురపోగూడదని పట్టుదలగలవాడనై కన్నులు తెరుచుకొని, దేనినిగాని భుజింపక రాత్రంతయు నల్లే కొరడావలె గూర్చుంటిని. కాని యెంతకును నాప్రియురాలు రాదయ్యెను. ఇక తెల్లవారుటకుగూడ నెంతయో న్యవధిలేదు. నిరాశుడనయిననేను యిక ఆమెరాదనియెంచి, రాత్రంతయు నిద్దురలేకపోవుటచే మిక్కిలిబడలిన శరీరము గలవాడనై కొంచము ద్రాక్షరసమును ద్రావితిని. వెంటనే నాకెప్పటివలె మైకముగప్ప నారంభించెను. ఇక చేయునదిలేక యొకమృదుపాన్పుపై కొరగబోవునంతలో నాకెటనుండియో కాళ్లగజ్జలధ్వని వినిపించెను. అంతనేను వేగముగా గొట్టుకొను హృదయముతో నలువైపులకును దిలకించితిని. ఇంకేమున్నది! నేనిన్నిరాత్రులును నిద్రాహారములసహితము విసర్జించియే మోహనాంగికొరకై కన్నులుతెరచుకొని వేచియుండి యామెను గానక నిరాశుడనగుచుంటినో, ఆతన్వియే తటిల్లతవలె నాముంగల చిరునవ్వుమోముతో ప్రత్యక్షమై, “ఇంకను నీనాడునిదురపోకుంటివేమి?” యనియడుగ సిగ్గుచే నాతల భూమిలోకి కృంగిపోయెను. అంతట నా విలాసవతి నావక్షమునకొరిగి నన్నుకౌగలించుకొని, వేయిముద్దులబెట్టుకొని “ఓయీ! ఇన్నినాళ్ళనుండియు నీకు నాపై యెట్టిప్రేమగలదో

యని పరీక్షించితిని. నిజమైనప్రేమగలవారు నిద్రాహారముల సనహ్యించుకొందురు. ఇప్పటికి నీవీ రాత్రంతయు నాకొరకు నిద్రను మానివేచి యుండుటచే నీప్రేమ గాఢమయినదని నేనిప్పుడు మాత్రమె యనుకొనుచున్నాను. నీవలె నిట్లు పదురాత్రులిట సోమరులై పరుండి నిదురించియుండిన మరెవ్వరయినను నీపాటికి మరియొకలోకమున నుండెడివారు. నీవు నాసౌంజ్ఞలకన్నింటికిని భావములనెరింగిన వాడవగుట వల్లనే రక్షింపబడితివి. ఇక మనయానందమున కెట్టికొరతయు నుండదు". అని యామెనన్ను పదేపదే ముద్దులిడుకొనియెను. ఆరాత్రి యంతయు నేనాసుందరాంగితో దనివితీర కామభోగంబుల ననుభవించి ఉదయముననేలేచి వెళ్లుట కుద్యుక్తుడనై యుండ నామెనాకొక యద్భుతమయిన యీయల్లికరుమాలును నాకొసంగ, అనుదినమును నల్లెవచ్చుచుండునట్లు నాచే ప్రమాణము జేయించుకొని పంపెను. ఇపుడు నీవు చూచుచుండిన యీబంగారు లేడిపిల్లలుగల యీముఖమల్ రుమాలే ఆమె నాకు బహుమానముగా నొసంగినది. నేను దీనియద్భుతచిత్రశిల్పచాతుర్యమున కపరిమితానంద బరితుడనై ప్రతిదినమును నల్లెవచ్చి యామగువతో సుఖింతునని బాసయొనర్చితిని. ఆమహానందముతో నా భార్య యామెనడుగమనిన ప్రశ్నను మరచిపోతిని. కాని యామెను 'నీపేరేమి?' అనిమాత్ర మడిగితిని. అంత నామెపేరు 'డాలిలే' అని చెప్పినది. అంతనేను నాకోరికను నెరవేర్చిన అల్లాను బలుతెరంగుల వినుతించుకొనుచు నిజగృహమునకరిగి, నాభార్యయైన అజీజేను కలసుకొనునప్పటికి ఆమె మితిలేనిదుఃఖము ననుభవించుచు "అయ్యో! నీకోరిక నేడయినను నెరవేరెనా? నేనడుగమనిన ప్రశ్నను నీప్రియురాలి నడిగితివా?" యని యడుగ నేనారాత్రి జరిగిన యావద్వృత్తాంతమును నామెకుజెప్పి, ప్రశ్ననడుగుట మరచితిననిచెప్పి, యానాడద్దానిని తప్పక అడుగుదునని నుడివి డాలీలే నాకొసంగిన బహుమాన

మును అజీజేకు జూపితిని. ఆమెయు దానియద్వితీయ సౌందర్యమున కును అందల్లబడిన స్వభావసిద్ధమయిన లేడిపిల్లలయొక్క సౌకుమార్య మునకు నద్భుతమంది యారుమాలును దనకొసంగుమని నన్నుకోరగా నేనద్దాని నామెకొసంగి యావిచారమును గొంతమరపింప గల్గితిని.

ఆ మరునాడు నాభార్యయైన అజీజే నన్ను వివిధాలంకారము లచే నలంకృతినిజేసి, సుగంధ ద్రవ్యముల నొడలంతయు బులిమి, తన ప్రశ్న విషయము మరియొకసారి నాకు జ్ఞప్తియొనర్చి నన్ను నాప్రియు రాలికడకు సంతతధారాపాతములై పారు కన్నీటితోనె సాగనంపెను. గతరాత్రంబునకు వలెనే నేను నాప్రియురాలైన డెలీలేయొక్క భవ నమున కరుగునప్పటి కామె నాకొరకై సర్వాంబరాభరణవిభూషితయై వేచియుండెను. నన్ను గనినంతనే నా మోహనాంగి నన్ను కౌగలించు కొని మృదుతల్పంబునజేర్చి ప్రియభాషణంబుల బల్కుచు మా ప్రేమ శాశ్వతముగా నుండవలయుననియు ఒండొరుల నెన్నడును నెడబాయ రాదనియు పెక్కురీతుల బోధించెను. నేనును నామె కనుగుణముగా బల్కుచు నామెతో వివిధక్రీడలదేలుచు నాభార్య యడుగమనిన ప్రశ్న నామె నీ విధముగా నడిగితిని—"ఓ ప్రియురాలా! నాకొక ధర్మసందేహము గలదు. దానిని నిన్నడిగి సందేహనివృత్తిజేసికొనదలంచి తిని. అదేమందువేని — "మోహము భరింప నశక్యమైనప్పుడు యావ నులైన కాముకు లేమియొనర్పవలయును ఇదియే నా సందేహము". డెలీలే నా ప్రశ్ననాలకించి కంట తడిబెట్టుకొనుచు "అట్టివారు మోహము నణంచుకొని కార్యసిద్ధి యగువరకును నోపికతోనుండు టయే లెస్స" అని సమాధానమిడెను. ఆమె యొసంగిన యీ సమా ధానమును నేను బాగుగా మనస్సునకెక్కించుకొని యా రాత్రియం తయు నావిధముగా నానందవార్ధి నోలలాడి నా నిజభార్యయగు అజీజే కడకుబోయి చూచునప్పటి కామె అంతవరకును గుండెలు బ్రద్దలగు

నట్లు దుఃఖించి నన్ను గనినంతనే యాదుఃఖమును గొంత దిగమ్రింగి "అయ్యా! నే నడుగమనిన ప్రశ్నను నీ ప్రియురాలి నడిగితివా? ఆమె యేమని సమాధానము జెప్పెను?" అని యడుగ నేను "ఆ! అడిగితిని. ఆమె యిట్లు నీ ప్రశ్న కుత్తరంబుగా జెప్పినది—'దుర్భర మయిన మోహము గలిగియున్న మోహితులైన యావనులు కార్య సిద్ధి యగునరకును మోహము నణంచుకొని వేచియుండవలయును'. అని డెలీలే నుడివినట్లు చెప్పితిని.

అంత అజీజే కలువరేకులవంటి తన కన్నుగవనుండి చెక్కులమీ దుగా ప్రవహించు వేడి కన్నీటిబిందువులను కొనగోళ్ళ మీటుకొ నుచు "అయ్యా! ఈ రేయి నీవు నీ ప్రియురాలిని గలసుకొనినప్పుడు మోహము నణంచుకొని యోపిక పట్టియున్నను కార్యసిద్ధికానిచో ఆవేదనాపరులైన మోహితు లేమిచేయవలయునో నీవామెనడిగి ఆమె యేమిచెప్పినదియు జ్ఞాపకముంచుకొనివచ్చి నాకు దెలుపుము". అని చెప్పి నన్ను మామూలు ప్రకారము అలంకృతునిగా నొనర్చి నా ప్రియురాలైన డెలీలేకడకు బంపెను.

నేనును మామూలు ప్రకారము డెలీలేని కలసుకొని యాసుంద రాంగితో వివిధక్రీడలందేలుచు నానిజభార్యయయిన అజీజే అడుగు మనిన ప్రశ్ననడుగగా నామె 'ప్రియా! అట్టివారికి చేయునదేము న్నది. మనోవ్యాధిచే గుందుటకంటెను మరణము నాశ్రయించుటయే మేలుకదా!" అని నుడివి కంట దడిపెట్టుకొన నారంభించెను. ఆరా త్రంతయు ఆనందముతో గడపినయనంతరము నేనింటికిబోయి చూచు నప్పటికి నాభార్యయయిన అజీజే వల్యావసిష్టయై మంచమున కంటుకొని పోయియుండి వెక్కి వెక్కి యేడువదొడంగెను. మాయమ్మయు మా నాయనయు నామెవిచారమును బెక్కుతెరంగుల దరచితరచి యడుగు

చుండిరి. కాని ఆమె నిజవృత్తాంతమును మాత్రము జెప్పక అట్లే లోలోనకుళ్లి కుమిలిపోవుచుండెను. ఆమె నన్నుగనినంతనే యోపిక లేక పోయినను మెల్లనతలయెత్తి "అయ్యా! నా ప్రశ్నకామె యేమని చెప్పెను?" అని యడుగ నేను డెలీలే చెప్పినట్లు 'ఎంతకును గార్య సిద్ధిలేని మోహితులయిన యౌవనాంగులు, మనోవ్యాధిచే గుందుటకం టెను మరణమునే ఆశ్రయించుట మేలు' అని ఆమె చెప్పెనంటిని. నామాటలను వినగనే అజీజే కెవ్వున కేకవేసి, స్మృహ (?) తప్పి పడిపోయెను. కొంతతడవునకు తెలివిగలుగ నామెతిరుగ నన్నుబిలచి "అయ్యా! ఆమె సందేశము ననుసరించి, నేనట్లే మరణము నాశ్రయించితినని చెప్పుము. మరియు మనయిరువురకును నెడబాటుగావించినవారికి నా వందనములని చెప్పుము" అనితిరుగ గన్నుల మూసుకొనియెను.

నేనానాఁడుకూడ నా ప్రియురాలైన డెలీలేకడకు బోయి, రాత్రంతయు నామెతో సుఖలీలలందేలి, యుదయముననే నిజగృహ మునకు బోవుసమయమున నామెతో అజీజే చెప్పిన మాటలజెప్పగా, నామె కెవ్వున కేకవైచి, 'ఓయీ! అట్లయిన ఆసాధ్వియెవ్వరు. నిష్కా రణముగా నామెమరణించునుగాబోలు! ఆమె నీకేమయిన బంధువా?' యని ప్రశ్నింప నేను 'బంధువేమిటి? ఆమె నాభార్య. కాని యిం కను వివాహముకాలేదు. కొలదిదినములలో కానున్నది. నీసౌంజ్ఞల భావములఁ జెప్పి మనలగూర్చిన దామెయె' అనిచెప్పితిని. నామాటల నాలకించిన నా ప్రియురాలైన డెలీలే బోరుననేడ్చుచు, గుండెలబాదు కొనుచు, "ఓయీ! మూర్ఖుఁడా! సర్వనాశనమును గావించితివి. ఆమె నిన్ను ప్రేమించునంతగా నీవామెను ప్రేమింపగల్గితివా? ఛీ! నీముఖము జూడరాదు. నీభార్య నుసురుబెట్టిననిన్ను గూడ భగవంతు డదేవిధముగా సర్వనాశనము గావించునుగాక! నీకు భార్యగలదని యెఱింగియుండినయెడల నిన్ను నాదరికైన జేరనిచ్చియుండను. నాసొం

జ్ఞలభావమునుజెప్పి, మనలగూర్చిన ఆమహాపతివ్రతకు దారుణమైన వ్యధను గలిగించిన నీతప్పు క్షమింపరానిది" అని అపరిమితదుఃఖము నందసాగెను. అట్లు దుఃఖించి, యామె నన్ను నాభార్యయొక్కస్థితిని గనుగొనిరమ్మని తొందరపెట్టగా, నేను బరువెక్కిన హృదయముతో నిజగృహాభిముఖుండనై పోతిని. నేనిల్లు చేరునప్పటికి నాబంధుగులు అజీజేయొక్క మృతకళేబరమును బైటబారవైచి, మహాదుఃఖమున రోధనధ్వనులు గావింపదొడంగిరి. ఆదృశ్యమునంతను గాంచిన నాగుండెలు చెదరిపోయెను. అట్లె మెల్లగా అజీజేమృతకళేబరమున్న తావునకు బోతిని. ఆమె మరణమునకై విలపించుచున్న నాతలిదండ్రులు నన్నుగాంచి "ఓరీ! నిర్భాగ్యుడా! నీమూలమున మహాసాధ్వియైన అజీజే మంటగలసిపోయినది. ఈమె సర్వనాశనమునకును నీవేకారకుండవు" అని పెక్కుతెరంగుల నన్ను దూలనాడిరి. అనంతరము మా జనకు డామెకంత్యక్రియల నేర్పాటుగావించి, పవిత్రురాలైన అజీజే సాధ్వియొక్క మృతకళేబరమును సమాధిచేయించి, అచట మతాచారముల ననుసరించి ఖురానును పఠంపజేసి, ఆమెయాత్మకు శాంతినిజేకూర్చుమని అల్లాను పెక్కురీతుల బ్రార్థించి నిజగృహము జేరుకొనియెను. నేను మాతండ్రి ననుసరించి యిల్లుచేరుకొంటిని. మాతండ్రి నాముఖమునయినజూడక ఖిన్నుడై యుండెను.

అంతట మహాదుఃఖముతో మాయమ్మ నన్నుబిలచి, "ఓరీ! మాణిక్యమువంటికోడలిని నీమూలముననే గోల్పోవలసివచ్చినది. ఆమె గుండెలట్లు వ్రీలిపోవుటకు నీవొనర్చిన ఘాతుకకృత్య మెద్దియో నాకు చెప్పకతీరదు. నేనెన్నివిధముల నడిగినను నామహాయిల్లాలు తనవిచారకారణమునుజెప్పక, యెప్పుడును 'నేమియులేద' నియెడిది. చెప్పుము— నీవామెయెడల గావించిన యపకృతి యెద్దియో చెప్పుము నేను వినవలయును" అని అడిగెను.

అంతట నేను మాయమ్మకు ఇట్లంటిని. "అమ్మా! నేను పలుమారామెకుగల వ్యాధినిగురించి అడిగితిని. కాని ఆమె యెంతమాత్రమును జెప్పక నీకు జెప్పినరీతిగనే నాకును 'ఏమియులే' దని సమాధానము జెప్పెడిది". నా సమాధానముతో మాయమ్మ తృప్తిపడక "ఓసీ! భగవంతుడు నీకు దగినశిక్ష నొసంగునుగాక! నీవు అజీజేయెడ మహాద్రోహమును దేనినో జేసినవాడవని నే నెరుంగుదును. కాని నీవొనర్చిన యా కార్య మెట్టిదో మాత్రము చెప్పలేకుంటిని. ఆ విషయమై ఆమె మరణించునప్పు డామెనడుగగా ఆమె గుండెపగులునట్లు విలపించుచు, "అత్తా! నీ కుమారుని అల్లా క్షమించుగాక! భగవంతు డతనిని దోషరహితునిగా జేయుగాక! నని ఈ నాశ్వరలోకమునుండి శాశ్వతలోకమునకు బోవుచున్నాను. అమ్మా! నా భర్తకు నా యంత్యవాక్యములుగా నీ మాటలు చెప్పుము—అతడెక్కడకు పోవుచుండు తావునకే, యికముందు కూడ బోవుట కలవాడైనయెడల 'విశ్వాసము ఉత్తమలక్షణము—ద్రోహము నీచలక్షణము' అను నీ రెండు సూక్తులను అక్కడకు వెళ్లినప్పు డుచ్చరించుట నా కడసారికోరికగా చెప్పుము". అని చెప్పి ప్రాణముల విడువబోవుచున్న నా మహాపతివ్రతయైన అజీజే నాకొక వస్తువునిచ్చి, నీ వామెకొరకు పశ్చాత్తాపపడి, నీతప్పును నీవు తెలిసికొనువరకు, నేను నీకావస్తువు నీయకుండునట్లు ప్రబలమైన ప్రమాణము చేయించుకొన్నది. నే నద్దానికి బద్ధురాలను. ఈ ప్రకారముగా నా సుగుణవతి నీకొరకు పెక్కుతెరంగుల విలపించి, పంచభూతాత్మకమయిన దనశరీరము నీ పాదయుగముపై విసర్జించి, తాను స్వర్గపురికేగెను". అని మాయమ్మ నాతో చెప్పగా, అజీజే నాకొరకై యొసంగినవస్తువు నొక్కసారి చూపవలసినదిగా నామె నెన్నియోవిధంబుల బ్రతిమాలితిని. కాని, ఆమె నాకు దానిని గనుపరచలేదు.

అప్పు డజీజేయొక్క మరణము నాకఠినహృదయము నంతగా బాధించలేకపోయినది. క్రమముగా నే నెప్పటివిలాసపురుషుండనై జలిలే గృహమునకు బోతిని. ఆమె నన్ను గనినంతనే, కన్నుల నీరుగార్చుచు "ఓయీ! నీ భార్య యెట్లున్నది. ఆమెను అల్లా రక్షించుగాక!" అనియెను. అంత, నేనే నామె మరణించినదియు, ప్రేతకర్మలన్నియు నిర్వర్తింపబడిన వనియుజెప్పి; మా తలిదండ్రులు నన్ను దూలనాడిన చందంబును, నాభార్యయైన అజీజే తాను మరణించుచు చెప్పిన మాటలను, నన్నియు నామూలాగ్రముగా జలిలేతో జెప్ప, ఆమె గుండెలను శిరమును మోదుకొనుచు దుఃఖప్రవాహము నాపుకొనజాలక "ఎంతదారుణ మెంతదారుణము! అట్టి మహాపతివ్రతను బోగొట్టుకొనిన నీజన్మ యికనేల. ఆహా! అల్లా దయామయుడు. నీ భార్యయు యీశ్వరాంశసంభూతురాలు. నిజము చెప్పుచుంటిని వినుము నేను నీకు చేదుదలపెట్టి, నీ వినాశమును జూడగోరినమాట వాస్తవము— 'విశ్వాసము ఉత్తమలక్షణము—ద్రోహము నీచలక్షణము' అని నీభార్య నాకంపిన యీ సందేశము నిశితాస్త్రమై నాహృదయమున నాటిపోయినది. ఇక నీకు నేనెట్టి యపకృతియు చేయబూనను. అజీజే నీకు సర్వరక్షయై కాపాడినది. లేకున్న నీపాలిటికి నాచే ఘాతుకమైయుండు నన్నసంగతి వాస్తవము. ఆహా! ఏమి అజీజేయొక్క మహాగుణములు! ఆమెయాత్మ కల్లా సంపూర్ణమయినశాంతిని జేకూర్చుగాక! ఓయీ! ఇప్పుడు నేను నీకాజ్ఞాపించునదేమన నీవికముం దెన్నడును నన్ను విడచి యుండరాదు. ఏ పరస్త్రీనైనను నసనే, కన్నెత్తిచూడరాదు. పన్నెత్తి పలుకరాదు. ఈనా శాసనమును నీవు దాటరాదు. నీయొక్క రక్షణాభారమును అజీజే నా కొప్పజెప్పినది. హా! అజీజే నిన్నుబోలిన మహాసాధ్వీమణు లీ పృథ్వీతలంబున లేరుగదా! ఎంత స్వార్థత్యాగివి! ఎట్టి శాంతమూర్తివి. దుర్మార్గుడయిన నీ భర్తయొక్క గుట్టును బయలు

బెట్టక, అంత్యకాలమునందు సహితము వానిమర్యాదనే గాపాడి— వానిని నా మాయాజ్వాలల నన్నింటినుండియు గాపాడి; ఆతనిని మన సారప్రేమించుటవలన కలిగెడి దారుణదుఃఖమును—లోలోన దిగ మ్రింగి—కుమిలి—కుళ్లి—చివర కీరితిగా నయిపోయిన నీ యొద్దనుండి నేర్చుకొనవలసిన వెన్ని యోగలవు—ఓయీ! నన్నొక్కసారి అజీజేయొక్క సమాధికడకు గొనిపొమ్ము. ఆమె సమాధినయినను జూడనిదే నేను జీవింపజాలను. పవిత్రురాలైన అజీజేయొక్క ఆత్మశాంతికొరకు నామె గోరిపై గొన్ని మంగళవాక్యముల లిఖించి, ఆ యిల్లాలి పేరుమీదుగా కొంత ద్రవ్యమును దానము జేయదలంచితిని". అని విచారసూచకముగా ననెను.

ఆమరునాటియుదయమున నేనును డెలీలేయును అజీజేయొక్క సమాధికడకరుగ పయనంబైతిమి. డెలీలే యొకసంచినిండుగా బంగారు నాణేములనునింపి, వాటిని మార్గముపొడుగునను బీదలకు అజీజేనామమునుచ్చరించి దానముచేయుచు క్రమముగా అజీజేయొక్క గోరీని సమీపించెను. ఆమె నాభార్య, అజీజేయొక్క మృతచిహ్నమయిన సమాధిని గనినంతనే దానిని కౌగలించుకొని విలపించుచు, "ఓపవిత్రురాలవైన అజీజే! నీపవిత్రరూపమును దర్శించి, నీప్రేమాపరావతారమైన శరీరమును కౌగలించుకొనుభాగ్యము నీవు బ్రతికియుండగా నాకు గలుగకపోయెనుగదా! నీవు శీలవతులయిన స్త్రీల కాదర్శప్రాయురాలవు; ప్రేమయును పవిత్రఅక్షరద్వయము నీనుండియే యుద్భవించియుండవలెను. అల్లానీమనస్సునకు పరిపూర్ణమయిన శాంతినొసంగుగాక! ఓ అజీజే! నీకు సర్వస్వర్గసుఖంబులును జేకూరుగాక!" అని దీవించి, మరికొంతతడవా గోరీని కౌగలించుకొని వెక్కివెక్కియేడ్చిన యనంతరమొక సన్నని మేకునుదీసికొని, యాగోరీపై కొన్ని మతగ్రంథములోని మంగళవాక్యములను లిఖించి, తిరుగనాతో నిజగృహాభిముఖముగ నడ

చుచు, సంచిలోయింకను మిగిలియున్న బంగారునాణేములనుగూడ బిచ్చగాండ్రపై విరజిమ్ముచు, అజీజేయొక్క నామమునే స్మరించుచు వట్టి సంచితో యిల్లుచేరుకొనియెను.

పిమ్మట ఆమె నన్ను బిలచి ' ఓయీ ! నీవెన్నడును నన్నెడబాయవలదుసుమా ! కపటచిత్తులగు స్త్రీలవలన నీకపాయము గలుగునని యెంచి, అజీజే నిన్ను నాకొప్పగించినది. నీకపకృతి గలిగినయెడల స్వర్గమునందుగల అజీజేయొక్క ఆత్మ దుఃఖించును. ఆదుఃఖమును నేను భరింపజాలను ". అని ఎన్నియో రీతుల నీతులగరపెను. నాటనుండియు నేను డెలీలేయొక్క కౌగిలింతలలోనె కాలముగడపుచు కొన్నాళ్లకు అజీజేయొక్క నామమునుగూడ పూర్తిగా మరచిపోతిని నాప్రియురాలైన డెలీలేయింటికి పోనిరాత్రి యొక్కటియునులేదు. నాతలిదండ్రు నావిషయమై పూర్తిగా వదలుకొనిరి.

ఒకనాటిరాత్రి శుభ్రముగా జలకమాడి, చలువవస్త్రములు ధరించి, మస్తుగాభుజించి, కొంత ద్రాక్షరసముగు ద్రాగి, మామూలు ప్రకారము డెలీలేగృహమునకు బయలుదేరితిని. ఆనాడు మామూలు కంటెను కొంచమధికముగా ద్రాగుటచే నొడలు తూలజొచ్చెను. కాళ్లు తడబడజొచ్చెను. డెలీలేగృహము ఏవీధిలోనున్నదియుగూడ మరచిపోతిని. వేరొకతప్పుడు త్రోవనుబడి నడచిపోదొడంగితిని. ఎంతనడచినను నాప్రియురాలిగృహము కనబడదయ్యెను. ఏమిచేతును ?

# 24 మోసగించిన మోహనాంగి కథ.



అట్లు దారితెన్నుగానక, ఒక యిరుకైన సందుననుసరించి నేను పోవుచుండు సమయమున నొక వృద్ధురాలు ఒకలాంతరును చేతబట్టు కొని నా కెదురుగావచ్చుచు నన్నుజూచి, "నాయనా! నీవు చదువు కొనినావా?" యని యడిగెను. అంత నేనావృద్ధురాలి యవసర మేమో అని యోజించి, "అవ్వా! చదువుకొంటిని. ఏమిపని?" అని ప్రశ్నింపగా నామె తనచేతియందున్న కాగితపుమడతను నాకం దిచ్చి, "నాయనా! నన్నుకరుణించి, ఈ ఉత్తరమును జదివి, యిందలి విషయములను జెప్పుము". అని వేడుకొనగా, నేనా కాగితపుమడ తను విప్పి, కడసరకును దానినిజదివి, "ఓయవ్వా! ఈ యుత్తరమునం దెవరో దూరముననున్న ప్రియుడు, దన ప్రియురాలి ముద్దుల దెల్పుచు, తన క్షేమమును వ్రాయుచున్నట్లున్నది". అనిచెప్పగా, నా వృద్ధురాలా శుభవర్తమానమున కెంతయుసంతసించి, నా యుపకార బుద్ధిని గొనియాడి, యాయుత్తరమునుగొని వెళ్లిపోయెను. ఆమె తిరుగ మరిరెండు నిమిషములకే నాకడకువచ్చి, "అయ్యా! నీవుచెప్పిన ఉత్త రములోని సంగతి వారికెజెప్పగా వారు విశ్వసింపకున్నారు. అసలుసంగ తేమందువేని—నాయల్లుడు వ్యాపారరీత్యా దూరదేశముపోయి, పది సంవత్సరములకు పైగానయినది. నేటివరకును నాతని వృత్తాంతమే మూకు దెలియకపోవుటచే మేమాతడు మృతినొందెనని తలంచుచుం డగా నీనా డీయుత్తరమువచ్చినది. నా కుమార్తె నేను చెప్పినమాటల నమ్మకున్నది. దయచేసి నీవు రెండడుగులు నాతోవచ్చి, వెలుపలనుం డియే నా కుమార్తెకీశుభవార్తనుజెప్పి పోయిన నీకు బుణ్యముండును" అనిచెప్పగా నదియెంతమాత్రమును శ్రమకాదని నుడివి, నేనా వృద్ధు రాలితో నడచితిని. కొంతదూరము గడచినయనంతర మావృద్ధురా

లోక పెద్దభవంతికడ నిలచి, ఏదో భామలో బిలువగా తలుపు తెరచు కొని యొక తటిల్లతనుమించిన కాంతిగలతన్వి నాకంటబడెను. ఆమె నన్ను చూడగనే కొంచెము వెనుకకుతగ్గి, "మీరేనా ఉత్తరమును జదివిపెట్టిన పుణ్యాత్ములు?" అని వృద్ధురాలినడిగెను. ఆమె మృదు స్వరమును, సుందరరూపమును గనిన నాదృష్టి చెదరిపోయెను—గుండెలు వేగముగా గొట్టుకొన నారంభించెను. తలుపుచాటున నిలుచున్న ఆమెను చూడవలయునను తలంపు నాకధికమయ్యెను. అంత నేను ఉత్త రములోని సంగతులను జెప్పబోవునట్లు అరుగునెక్కి లోపలకు తొంగి చూచుచు, గుమ్మములో నిలుచుండు సమయమున నెవ్వరో నన్ను బలముగా లోనికిత్రోసివైచిరి. అంత నేను లోపల కూలబడగా వృద్ధు రాలు లోనప్రవేశించి, ఆ పెద్దతలుపులను బిగించుటయు, ఆ సుంద రాంగి నన్నెత్తుకొని వేరొకగదిలోనికి గొనిపోవుటయు నొకేసారి జరి గెను. ఆ మాయయేమియు నా కర్థముగాక, యొడలంతయు జెమటలు పట్టి భయమువలన మూర్ఛపోయితిని. కొంతతడవునకు నేనొక దివ్య హర్మ్యములోనుంటిని. నా చెంతకూర్చొనియున్న సుందరి పెద్దగా నన్ను జూచి నవ్వుచుండెను. ఆ గదియంతయు విలాసములయిన మేజాలతో డను, సోఫాలతోడను, అందమయినబొమ్మలతోడను పూలకుండ్లతోడను నలంకరింపబడి భూలోకస్వర్గమువలె నుండెను. అంత నా మోహనాంగి, నన్ను జేరి "ఓ సుందరాకారా! చావుబ్రతుకుల రెంటిలోను నీవు దేనిని వాంఛింతువు?" అని కఠినముగా నడిగెను. ఆకస్మికముగా జరి గిన యీ దారుణమునకు నేను లోలోన అపరిమితమయిన భీతినందుచు, వణకుచున్న శరీరముతో 'బ్రతుకుటనే వాంఛింతును' అని యెట్లో అనగలిగితిని. అంత నామె తిరుగ "అయిన, నీవు నన్ను వివాహమా డుము. దుర్మార్గురాలును—హంతకురాలును నైన డెలిలే బారినుండి తప్పించుకొని వచ్చినందులకు సంతసింపుము. నన్ను పెండ్లాడితివా నీకు

సర్వసుఖములును చేకూరగలవు". అనగానే నామెమాటల కాశ్చర్యమంది, "నేను నిన్ను వివాహమాడుట అసంభవము. నా కింతకు ముందే వివాహమయినది. డెలిలే హంతకురాలా! దుర్మార్గురాలా! ఈ మాటల నెవరివలన వింటివి?" అని నేను క్రోధముగా నడుగ, నామె వికటముగా నవ్వుచు "ఇప్పటికి సుమారు రెండుసంవత్సరముల నుండి, నీవా జిత్తులమారిలో మెలంగుచుండియు, నీవామె మాయల నెరుంగకుండుట విచారకరమయిన విషయము. అజీజేయొక్క దయ వలన నీవా ఘోరహంతకురాలైన డెలిలేయొక్క మాయలనుండి బయటబడితివిగాని, లేకున్న నీ వీపాటి కేలోకమున నుండువాడవో. పుణ్యాత్మురాలైన అజీజేను నీ వనుక్షణము తలంచుకొనుచుండుము. నీవు నన్ను వివాహమాడనిపక్షమున, నీవు బ్రతుకుగాక రెండవది తటస్థపడదు. బాగుగా నాలోచించుకొనుము" అని ఆమెనన్ను హెచ్చరించెను. అంత కఠినముగా మాటాడుచున్న ఆమెను మోసపుచ్చి పారిపోవుటకంటెను నాకు వేరుతరుణోపాయ మెద్దియు గానుపింపలేదు. అప్పటికి మాత్రమామెకు సమ్మతిదెలుపునట్లు నటించి, రాత్రి యెల్లరును నిదురించుచుండు సమయమున మెల్లనలేచి, పారిపోవుటకై ద్వారముకడ కరిగితిని. తలుపును దెరచుకొనుట కా చీకటిలో తడుములాడుచుండ, ఆ యువతి తన ప్రక్కపైనుండిలేచి పకపకనవ్వుచు, నా కడ కరుదెంచి, "ఓయీ! నీవు లోపల ప్రవేశించినంతటి సులువుగా బయటకు బోగలుగుదు ననుకొంటివా? అట్టి తలంపును నీవిక పారద్రోలుము. ఇపుడు నీవున్న యీ యింటితలుపులు సంవత్సరమున కొక్కతూరిమాత్రమె తెరవబడును. నిన్న దెరువబడెనుగదా! తిరుగ నొక సంవత్సరమువరకును నీద్వారముల విడదీయుటకు బ్రహ్మాదులకయినను వశముకాదు. చూడుము. ఇనుపశిలలతో నివియెట్లు తాపడము చేయబడెనో! ఇట నొక సంవత్సరమువరకును సరిపడు సామగ్రి

యంతయు నిలువచేయబడెను. అంతవరకును నీ విటనుండి పోజాలవు. సంవత్సరమువరకును ప్రజలు నీకంటబడరు. ఇట నీవు నా కయిష్టమగు నట్లేమి యొనర్చినను నీ ప్రాణముదక్కదు. ఆ క్రూరరాక్షసియగు డెలిలేయొక్క మాయావాగులం జిక్కకుండ కాపాడుటకే భగవంతుడు నిన్నిటజేర్చినాడని గ్రహించి నన్ను వివాహమాడి సుఖంపుము ” అని బోధించెను. అప్పుడు నాతలపై పిడుగుపడినట్లయ్యెను. ప్రపంచమంతయు గిర్రున తిరుగుచున్నట్లుండెను. ఇక గత్యంతరము గానక, పన్నెండుమాసములును నామె చెప్పినట్లు చేయుట కొడంబడితిని.

ఆమరునాడె ఆమె పురోహితులరావించి, మతానుసారముగా నన్ను వివాహమాడెను. నేను కిక్కురుమనక పన్నెండునెలలును నామె చెప్పినట్లెల్ల నడచుకొని యామెను కామభోగంబులదేల్చుచు గడపితిని. సంవత్సరము పూర్తియైనమరునాడు ద్వారములు తెరువబడెను. మరు సంవత్సరమున కంతకును సరిపడు ఆహారపదార్థములు యితరసాధన సామగ్రియు, నాయింటిలో జేర్పబడుచుండెను. అంత నేనామోహ నాంగినిజేరి “ ప్రేయసీ! ఈసంవత్సరమంతయు నీచెప్పుచేతలలో మెలంగితినిగదా. నాతలిదండ్రులను ఆప్తబంధుగులను నొక్కసారి చూచి వచ్చుటకు నాకనుమతి నీయవా ? ” అని పలుతెరంగుల ప్రార్థించిన యనంతరమామె నాకోర్కెను నెరవేర్చుటకు సమ్మతించి, “ ఓయీ ! నీయిష్టప్రకారమే చేతునుగాని ఒక్కరాత్రిమాత్రమే నీవు బయట యుండవలయును. తెల్లవారులోపల నీవుతిరుగ వత్తునని నాకు ప్రబలమయిన ప్రమాణము జేయవలయును. అట్లు ప్రమాణముగావించియు రాకున్నయెడల నీవధోగతిపాలగుదువు ” అనిచెప్పి, ఆయువతి నాచే బలమయిన ప్రమాణములనెన్నింటినో జేయించుకొని తెల్లవారులోపల తిరుగవచ్చుటకు సమ్మతింపజేసి, వివిధాలంకారములతో నన్నలంకృతునిజేసి, అమూల్యములగు వస్త్రములగట్టి నన్నుపంపెను.

అంతనేను చరచరనడచి నా ప్రియురాలైన డెలీలేభవనమునకు దారితీసితిని. నేనాయిల్లు సొచ్చునప్పటికామె మోచేతులపై తలనాన్చి కండ్లనీరుకార్చుచు చిక్కి శల్యమై వాపోవుచుండెను. ఈసంవత్సరము నుండియు, నామె నాకొరకల్లే వేచియుండి విలపించుచుండినట్లు నేను గ్రహించితిని. ఆమె నన్నుగాంచినంతనే నతిశయించిన దుఃఖముతో లేచి, నన్ను కౌగలించుకొని "అయ్యో! ఇంతకాలము ఎందుబోతివి? నీకొరకిట్లు శల్యావశిష్టనై యెట్లుంటినో గంటివా? ఆనాడునీవు నన్ను బాసినదిమొదలు నేటివరకు నిద్రాహారములవిసర్జించి యిల్లే దుఃఖించు చుంటిని. వెంటనేచెప్పుము. ఇంతకాల మెటనుంటివి? ఏమాయలాడి వలలోనయిన జిక్కికొనలేదుకదా?" అని నన్నాదరమున నడుగ, నేనామెను విడచిపోయినదిమొదలు నాటివరకును జరిగిన యావద్వృత్తాంతమును జెప్పి, మరియు నిట్లంటిని.

"ఇప్పుడయినను ఒక్కసారి నిన్నుచూచి పోవుటకుమాత్రమె వచ్చితిని. తెల్లవారులోపున నేను తిరుగ పోకున్నయెడల మాట దక్కదు" అని చెప్పగా నామె ఆకొన్న ఆడుసింహామువలెలేచి, క్రోధమున "ఓయీ! ఎంతటిదారుణకార్య మొనర్చితివి. నన్నును నీతలిదండ్రులను—స్వర్గమునందున్న అజీజేనుకూడ నీరీతిగా దుఃఖపెట్టిన నీపాపమునకు ఫలితము నిప్పుడే యనుభవింపుము" అని మండిపడుచు కొందర నీగ్రోఆడబానిసలబిలచి, నాశరీరముపై చర్మమునువలచి చిత్రవధగావింపుడని యాజ్ఞాపించెను. వెంటనే బిలబిల నరుదెంచిన యానీగ్రో స్త్రీలు నన్నుబడగొట్టి, కాళ్లతోకుమ్మియు, శూలములచే బొడిచియు హింసింపదొడంగిరి. నిర్దయురాలై డెలీలే నాచిత్రవధను జూచుచుం డెను. నేనా నీగ్రోస్త్రీలుగావించు హింసలను భరింపలేకపోతిని. నేనా నాడు చచ్చుట స్థిరమె. అయినను ఆచిత్రవధను సహించుకొనలేకుం టిని. అపుడు పవిత్రమూర్తియైన అజీజేయొక్క పుణ్యావిగ్రహము

నాహృదయములో గోచరించెను. ఆమె చనిపోవుచున్నపుడు మా యమ్మతో చెప్పినమాటలు నాకు జ్ఞప్తికిరాగా, డెలీలేవినునట్లు "విశ్వాసము ఉత్తమలక్షణము—ద్రోహము నీచలక్షణము" అంటిని. ఆ మాటలనాలకించిన డెలీలే అదరిపడి నన్ను వివిధరీతుల హింసలుపెట్టు నీగ్రోస్త్రీలను తొలగుడని ఆజ్ఞాపించి, నన్నుద్దేశించి "ఓయీ! నీవిపు డుచ్చరించిన అజీజేయొక్కమాటలు నాహృదయమునకు వజ్రాయుధము వలె నాటెను. ఆపుణ్యవతి సందేశమే యిపుడు మరియొక్కసారి నిన్ను మృత్యుముఖమునుండి గాపాడగల్గెను. హా! అజీజే! ఎంతబుద్ధిమంతు రాలవు? ఎట్టి దూరదృష్టి గలదానవు! స్వర్గమునందున్న నీయాత్మకు శాంతి! నీయాదేశమునననుసరించి నీభర్తను క్షమింతును. నీయెడ మహా ద్రోహమొనర్చిన యీపాపియెడ నీవు మహోదారతను, త్యాగబుద్ధిని జూపి, నాకాదర్శప్రాయురాలవైతివి" అనిచెప్పి, నన్నుజంపక దూర ముగా విసరి పారవేయవలసినదిగా నానీగ్రోస్త్రీల కాజ్ఞాపింప, నేనా క్షణముననే ఎటనోపడి మూర్ఛపోయితిని. ఉదయముననేలేచి చూచు కొనుసరికి నేనొక ఏహ్యమగు పెంటకుప్పలోపడి పొరలుచుంటిని. మెల్లనలేచి నన్ను అనుక్షణమును సర్వరక్షియై స్వర్గముననుండిగూడ కాపాడుచున్న నాభార్యయగు అజీజేనుతలంచి, ఒక్కసారిగొల్లుననేడ్చి ఆమె పవిత్రనామముననే స్మరించుకొనుచు, మాతలిదండ్రులున్న గృహ మునకు బోతిని. మాయమ్మ నాదుస్థితినిగాంచి, కడుపు బ్రద్దలగునట్లు విలపించుచు, నన్ను కౌగలించుకొని "కుమారా! నీకీపాడురూపెట్లు కలిగెను? ఇంతకాలమునుండియు మవ్విధ్మారీతిగా దురంతదుఃఖములో మునిగి ఎందేగితివి? అయ్యో! దైవము నీయెడ నెంతటిప్రతికూలు డయి వర్తించుచున్నాడు" అని పెక్కుతెరంగుల ఏడ్చి, అజీజే చని పోయినబెంగచే మాతండ్రిగూడ స్వర్గస్థుడై అప్పటి కారుమాసము లయ్యెననియు, తాను నాకొరకారీతిగా గుందుచుంటిననియు చెప్పి,

నామలినవస్త్రములను దీసివైచి, ఒడలంతయుకడిగి, నావృత్తాంత మెల్లయు జెప్పుమనియెను. అప్పుడునేను అజీజే నామమును స్మరించు కొని నిలపించుచు క్రమముగా జరిగిన సర్వవృత్తాంతమును మాయ మ్మకుజెప్పి ఆగడచిన సంవత్సరమంతయు నేననుభవించిన కష్టముల వివ రించిచెప్పి, అజీజేమూలమున నేనింకను ప్రాణముల నెట్లుబాయకుండి నదియుదెలిపి "ఓపూజ్యురాలవైన అజీజే! నేను మహాపాపిని—మహా ద్రోహిని—నీపవిత్రప్రేమను గుర్తింపజాలని నేనింకను నెన్నిశిక్షల ననుభవించినను దప్పులేదు. కామాంధుడనై ఒకపవిత్రప్రేమజ్యోతిని చల్లార్చితిని—నవవికసిత కోమలపుష్పమును చేతులార దుమ్ములో గలుపుకొంటిని—అజీజే! ఓప్రణయమూర్తీ! ప్రేమస్వరూపిణీ! ఓ అజీజే! నాతప్పులనన్నింటిని దెలుసుకొంటిని! క్షమించుము" అని పుణ్యమూర్తియగు అజీజేనుతలంచుకొని గుండెబ్రద్దలగునట్లు ఏడ్చితిని.

అంత మాయమ్మ నన్నోదార్చి "నాయనా! గడచినదానికై ఏడ్చుటవల్లగలుగు ప్రయోజనమేద్ది! ఇపుడు పశ్చాత్తప్తుడవయిన నిన్ను స్వర్గమునందుగల అజీజే క్షమింపగలదు. అజీజే ఆజ్ఞ ననుసరించి ఆమె మరణించునపుడు నీకు పశ్చాత్తాపము గలిగినపుడు నీ కొసంగ మని నా కిచ్చినవస్తువు నిపుడు నీ కొసంగుచున్నాను. గైకొనుము". అని నుడివి ఇపుడు నీవు చూచుచుండిన ముఖమల్‌రుమాలునే నా కొసంగెను. నా అజీజేచే నొసంగబడిన యీ అల్లిక ముఖమల్‌రుమా లును కన్నులకద్దుకొని హృదయమునకు జేర్చుకొని, నాటినుండియు అజీజే మృతచిహ్నమైన దీనిని ప్రాణపదముగా జూచుకొనుచు, ప్రతి ఉదయమునందును దీనికి బ్రణమిల్లుచుందును.

ఓ రాజకుమారా! ఇక నాకథయు ముగిసెను. నా వృత్తాంత మిది. అనంతరము గొన్నాళ్లకు నాజననియు స్వర్గమునందుగల అజీజేను జేరబోయెను. నేను యిక నీ ఐహికసుఖములం దిచ్ఛలేనివాడనై యీ

వర్తకులతో నానాదేశములును దిరుగుచు, ప్రతిక్షణమును నా అజీజే నామమునే స్మరించుకొనుచుంటిని. ఈమధ్య మేముచేయు సంచార ములో, నొకచోట ఇచటి కనతిదూరములోనున్న కర్పూరద్వీప ప్రభు వగు ఎలీమోసుల్తానుయొక్క కుమార్తెయైన జుబేదాబేగం మూడు మూర్తుల నా అజీజేవలెనే నుండుననియు, ఆమెయు నా భార్యవలెనె గొప్ప అల్లికపనులు నేర్చెననియు, యిపుడీ ముఖమల్ రుమాలుపై గల అద్భుతమయిన అల్లికపనుల నీ పృథ్విలో జుబేదాబేగం తప్ప మరెవ్వ రును జేయజాలరనియు వినియున్నవాడనగుటచే, ఒకసారి ఎల్లవిషయ ములలోను నా అజీజేను బోలియుండిన, ఆ జుబేదబేగంను దర్శించి, యీ ముఖమల్ రుమాలు నామెకు సమర్పించి, ప్రణమిల్లిరావలయు నను కోరికతో పోవుచుంటిని. నా దీనచరిత్రమునంతను సావకాశముగా వినిన నీకు నాకృతజ్ఞత ".

అని యా వర్తకుడుచెప్పిన కథనంతను వినిన సులేమాన్‌షా నవాబుగారి తనయుడైన తాజెల్ ముల్కు జుబేదాబేగంనందు మోహా ముగలవాడై వర్తకునితో "అయ్యా! నీకు జుబేదాబేగం యొక్క దర్శనమును గావించి, నీ ముఖమల్ రుమాలు నామె స్వీకరించునట్లుగా జేసి, నీ హృదయభారము దీర్చువాడను. కమక నీవు నాతో మా పుర మునకు దెమ్ము. నీ కెట్టిలోటును లేకుండ గాపాడుదును". అనిచెప్పగా నా వర్తకుడు రాజకుమారునియొక్క దయకెంతయు సంతసించి, ఆత నితో నరిగెను.

---

# 25 జుబేదా బేగం.



అట్లు రాజకుమారుఁడైన తాజెల్ ముల్కు వర్తకునితో నిజపట్ట ణముజేరి వానికితగు బసనేర్పాటుగావించి, యెల్లసౌకర్యములనొనర్చి, నిజసదనమునుజొచ్చి, మృదుపాన్పుపై బరుండి వెక్కివెక్కి యేడ్వ దొడంగెను. అంత వానితండ్రియైన నవాబు తనకుమారుడట్లు చింతిల్లు టకు గలకారణము దెలియజాలక, తాజెల్ ముల్కుకడకరిగి, "కుమా రా! నీవీరీతిగా దుఃఖించునంతటి కారణమేమిగలదు? మహారాజనంద నుండవయిననీకు గలుగుకొరతయెద్ది? వెంటనే నీవిచారకారణమును దెల్పితివేని, తన్నివారణోపాయము నాలోచింపవచ్చును" అని సాదర మున బలుక నారాజకుమారుండు తండ్రితో "నాయనా! కర్పూర ద్వీపాధిపతి కుమార్తెయైన జుబేదాబేగంయొక్క సుగుణసౌందర్యాదు లనువిని, ఆమెను చూడకుండగనే మోహించితిని. ఆసుందరాంగిని బెం డ్లాడినగాని నేను జీవింపనొల్లను" అని చెప్పగా నవాబు కుమారునితో నిట్లులనియెను. "తనయా! నీకోరిక బహుగొప్పది. జుబేదాబేగ మును వివాహమాడుట కింతకుముందెందరో రాజకుమారులు వివాహ మాడ బ్రయత్నించి, విఫలమనోరథులైరి. కాన నీవాకోరికనువీడి, ఆమెకంటెను సౌందర్యములో నధికురాలును, సుగుణవతియు నయిన మరియొక కన్యను వివాహమాడి సుఖింపుము" అని చెప్పుచున్న తండ్రిమాటలకు కుమారుడెంతయు దుఃఖించి, "నాయనా! నాప్రజ్ఞ వలన నేనాసుందరాంగిని వివాహమాడి తీరుదును. నన్నందుకు బ్రయ త్నించుటకు నీవనుమతించిన నాకదియెజాలు" అని వచింపగా నవాబు కుమారునియొక్క ధైర్యసాహసములకును, కార్యదీక్షకును లోలోన సంతసించి, "కుమారా! నీప్రయత్నమునకు నేనెట్టియాటంకమును

గలుగజేయును. వలసినంతధనమును, మనుష్యులను గొనిపోయి, నీయ దృష్టమును పరీక్షింపుము. నీకు శుభము గలుగుగాక !" యని దీవించెను.

అంత రాజకుమారుడు అనేకములైన మణులను విశేషధనమును మాత్రము దీసికొని, మనుష్యులెవరును నవసరములేదనిచెప్పి, వర్తకుని మాత్రము వెంటబెట్టుకొని తండ్రియనుమతినిబడసి, యొకశుభము హూర్తమునందు కర్పూరద్వీపంబునకై పయనంబై చనియెను. అట్లు వర్తకునితో ప్రయాణంబైన తాజెల్‌ముల్కు రాత్రిదివములు ప్రయాణముసల్పి, కొన్నాళ్లకు కర్పూరద్వీపంబును జేరుకొని, యొకసత్రము నందు బసగావించి, జుబేదాబేగంను సందర్శించునుపాయంబును బెక్కు-రీతుల నాలోచింపదొడంగెను. అంత వర్తకయువకుడిట్లు చెప్పెను. "రాజకుమారా! మనమీవేషములతో నిటసంచరించినయెడల మనకీ దీవియొక్క స్థితియు, జుబేదాబేగంయొక్క నిజవృత్తాంతమును దెలియదు ; గాన మనము వర్తకులవేషములధరించి; పట్టణమంతయు సంచరించి, సంగతిసందర్భముల దెలిసికొందము" అని చెప్పగా రాజకుమారుడందులకు సమ్మతించెను.

అంత వారిరువురును, రాజమార్గమునందొక యింటిని బాడుగకు తీసికొని, అందు దాముతెచ్చిన వస్తువులనన్నిటిని, అందముగా నమర్చి, వింతయైన వస్త్రములతోడను, విలువయైన మణులతోడను నా యంగడిని విలాసముగా నలంకరించి, వారిరువురును నందువర్తకుల వలె గూర్చుండిరి. తమగ్రామములోని కరుదెంచిన యీ నూతనవర్తకుల వద్దగల విచిత్రమయిన వస్తువుల జూడవలయునని యెందరెందరోవచ్చి పోవుచుండిరి. అట్లొక వారముదినములు గడచిన యనంతరమొక వృద్ధురాలా దుకాణముకడ కరుదెంచి, అందు వర్తకరూపమున గూర్చొనియున్న రాజకుమారునిగని "అయ్యా! మీవద్ద ఏమేమి

విచిత్రమయినవస్తువులు గలవు ? శ్రీమంతులకు బనికివచ్చు వస్తువులే మయిననున్న వో జూపింపుము ". అనియెను. అంతట తాజెల్ ముల్కు ఆ వృద్ధురా లెవరికి సంబంధించినదో దెలిసికొనవలయునని " అవ్వా ! మావద్ద అనేకరకముల వింతసామగ్రి గలదు. కాని, నీకు గావలసిన దేమి ? పురుషుల కుపయోగపడునదియా, స్త్రీల కుపయోగపడు నదియా ? " యని యడుగ నా వృద్ధురాలు " అయ్యా ! మా రాజు గారి కుమార్తెయైన జుబేదాబేగంకు పనికివచ్చు వస్తువులుగాని, అమూల్యవస్త్రములుగాని గావలయును ". అనిచెప్పగా, రాజకుమారుడు ఆడబోయినతీర్థ మెదురై నందులకు లోలోన మిగులసంతసించుచు, ఒక ముఖమల్ గుడ్డనుదీసి వృద్ధురాలికి జూపి " అవ్వా ! ఈ గుడ్డమీది యల్లికపనులు బహునేర్పరులచే జేయబడెను. ఇందు చిత్రింపబడిన బంగారు లేడిపిల్లల నీ పృథ్విలో మరియొకరు చిత్రింపజాలరు. దీనిని మీ యజమానికై గొనిపొమ్ము ". అనిచెప్పి, మున్ను అజీజే తన భర్తకొసంగిన ముఖమల్ రుమాలు నా వృద్ధురాలిచేతి కొసంగగా, నామె దాని పనివాడితనమునకును, శిల్పనాసామర్థ్యంబునకు అద్భుత మంది " అయ్యా ! దీని వెలనుగూడ దెల్పుడు ". అన రాజకుమారుడు " ఆ ! ఈ మాత్రముదాని కేమని వెలచెప్పుదును. ముందు దీనిని మీ యజమానికి జూపుము. ఇంగతావిషయముల దరువాత నాలో చింతము " అనిచెప్పగా, నా వృద్ధురాలు వారికడ శలవంది, ఆ ముఖమల్ రుమాలుతో దిన్నగా దనయజమానురాలగు జుబేదాబేగంకడ కరిగి, తాను వర్తకులవద్దనుండి గొనితెచ్చిన యల్లికరుమాలు నామె దానియొక్క చక్కదనమునకును, అందు బంగారుతీగెలతో లేడిపిల్లల జిత్రించిన వారి, ప్రజ్ఞయుగని ఆశ్చర్యాద్భుతములదేలి " ఓసీ ! దీనిని తెచ్చిన వర్తకులెవ్వరో మహాప్రజ్ఞానంతులవలె నున్నారు. ఇట్టి సామర్థ్యము గలవారిని మన ముచితరీతిని సత్కరింపవలసియున్నది.

గాన నీ విపుడే వారికడకరిగి, వారు దేనినిగోరిని నద్దాని నొసంగుటకు నేను నంసిద్ధురాలనై యున్నానని దెల్పుము ". అని చెప్పగా నావృద్ధ పరిచారిక యజమానురాలి యాజ్ఞననుసరించి, తిరుగ వర్తకులకడ కరుదెంచి, " అయ్యా! మీరొసంగిన ముఖమల్ రుమాలునుగని జుబేదా బేగం పరమానందభరితురాలయ్యెను. ఆమె శిల్పనాచాతుర్యమునకు గూడ మించియున్నదట మీ రుమాలునందలి యల్లికపని. దానంజేసి యామె మీారు కోరినదాని నొసంగుటకై సిద్ధముగానున్నది. కనుక మీా కోరికను దెలిసికొనిరమ్మని నన్ను బంపెను ". అని వృద్ధురాలు చెప్పినవాక్యముల నాలకించిన వర్తకులిరువురును నొకరిముఖము లొకరు చూచుకొని, తమరొట్టె నేతిలో బడినందులకు లోలోననే సంతసించిరి. అంత వర్తకరూపముతో నున్న రాజకుమారుడా వృద్ధురాలినిగని, " అవ్వా! నేనొక చీటిని వ్రాసియిత్తును. దానిని గొనిపోయి మీా యజమానురాలి కొసంగుము. అందు మాకోరిక వివరింపబడియుండు" నని చెప్పగా నా పరిచారిక వారు చెప్పినట్లొనర్చుట కంగీకరించిన యనంతరము రాజకుమారుడొక యుత్తరమునురచించి, వృద్ధురాలి కొసంగి, తమకా శుభవర్తమానము దెచ్చినందులకా పరిచారికకు గొన్ని బంగారు నాణెముల బహుమానముగానొసంగ, వాటినందుకొనుచున్న వృద్ధురాలికం డ్లానందముతో మెరసెను. ఆమె వారలకు దన కృతజ్ఞతను దెలిపి ఉత్తరమునుగొని వెడలిపోయెను. తనకార్యము కొనసాగనున్నదని రాజకుమారుడును, తన చిరకాలజీవిత వాంఛితము నెరవేర, తన అజీజేయొక్క ముఖమల్ రుమాలు అర్హులైనవారిని జేరెనని వర్తకుడును మిగుల ఆనందించుచుండిరి.

అట్లు జుబేదాయంతఃపురమునకరిగిన పరిచారిక ఆమెనుగలసుకొని, జరిగినవృత్తాంతమంతయుజెప్పి, వర్తకునిచే నీయబడినయుత్తరము

నామెచేతియందుంప, జుబేదాయును నాయుత్తరమునువిప్పి, యిట్లు చదువదొడంగెను—

" ప్రియమైన,

జుబేదాబేగం రాజకుమార్తెకు,

కాంతా ! నీవు నాయెడ నత్యంత ఆదరమునువహించి, నేనంపిన ముఖమల్ రుమాలు నందుకొనినందులకు ఆనందపరవశుడనయితిని. అనంతరము నాకోర్కె యెట్టిదైనను దీర్తుననిపంపిన నీసందేశము నాలకించి, పరమానందభరితుడనైతిని. యౌవనపురుషులు, యౌవనాంగులగు సుందరీమణులను గోరునది. వారిపొందుగాక మరియేదిగలదు ? కాన త్వరలో నీవు నన్నుకరుణించి నీస్పర్శనాలింగనాది సౌఖ్యముల జేకూరు భాగ్యమును గలుగజేయుదువని నమ్ముచున్నాను. ఇందుల కనుకూలమైనజాబు ననతికాలములో జూడగోరుచున్నాను.

ఇట్లు,

ప్రేమాభిలాషి".

కమ్మను గడవరకు జదివినజుబేదాకన్య కోపత్రోక్కిన త్రాచు పామువలె మండిపడుచు, మహాక్రోధమున పరిచారికనుద్దేశించి " ఓసీ! సిచురాలా ! సివిట్టిసందేశమును గొనివత్తువా ? ఆవర్తకునకెంత కండకావరముగానున్నది ! ఆతనికి నాపొందుగావలయునట ! ఎంతచిన్న కోరిక గోరెనాడు ! ఇంకొకసారి యిట్లు ప్రేలినయెడల నాతనికి నాపొందుగాక, మృత్యుదేవతయొక్క పొందులభించునని చెప్పుము. తిరుగ నాతనినద్దనుండి నీవేమయిన నిట్టిసందేశము దెచ్చినయెడల నీతల పగులును పొమ్ము అతనిరుమాలు నాతనిముఖమున గొట్టుము " అనిచెప్పి ఆయుత్తరమును ముక్కముక్కలుగాచించి, " అతనియుత్తరమున కిట్టి సత్కారము జరిగెననిచెప్పుము " అని కాగితపుముక్కలను పాదముల

క్రిందవైచి నలిపివేసెను. ఇంకనుపోక అక్కడనే నిలుచున్న వృద్ధురాలితలపై నొక్కపెట్టునుబెట్టి "ఇంకను కదలవేమి?" అనిజుబేదా గర్జించగా వృద్ధురాలు గడగడవణకుచు "అమ్మా! ఈన ర్తమానమును గొనిపోయిన ఆవర్తకులు నన్ను చావగొట్టుదురేమోనని భీతిల్లుచున్నాను. ఆమాటలనే ఒకకాగితముపై వ్రాసియిమ్ము. దానిని వానిముందు బారవైచివత్తును" అని చెప్పగా, జుబేదాబేగం ఒక చీటిని వ్రాసి ముసలిదానికిచ్చి, దానితోపాటు ముఖమల్‌రుమాలును గూడ నొసంగి పంపివైచెను.

అనంతర మావృద్ధపరిచారిక జుబేదాయొసంగిన ఉత్తరమును, రుమాలును బట్టుకొని తాజెల్ముల్కుంచు దుకాణముకడకు వచ్చి, అటజరిగిన యావద్వృత్తాంతమును, జుబేదా తన తలపై బలమైన దెబ్బగొట్టిన విషయమును వానికిజెప్పి, "అయ్యా! ఎంతటి పొరబాటొనర్చితిరి! మా జుబేదా పురుషజాతిపై బగబూనెనని మీ రెరుంగక పోవుటచే నట్టిప్రేమజాబును వ్రాసి, యవమానింపబడితిరి". అని నుడివి, జుబేదాయొసంగిన యుత్తరమును రాజకుమారున కొసంగగా నత డద్దానిని వర్తకయువకుడు వినునట్లుగా యిట్లుచదువుచుండ, వృద్ధురాలు తానుదెచ్చిన ముఖమల్‌రుమాలును తిరుగ ఆతని కిచ్చివైచి "అయ్యా! ఆమె వ్రాసినయుత్తరమునం దేమున్నది?" యని యడుగ, రాజకుమారుడు వివర్ణవదనముతో నా కమ్మనిట్లు చదువ నారంభించెను.—

"ఓరీ పురుషాధమా!

మదించియున్న నీ శరీరమునకు నావంటి సుకుమారియొక్క పొందుతగదు. మృత్యువుచేనత నాలింగనము జేసికొనగోరితివేని, మరి

యొకసారి యిట్లు ప్రేలుము. నీ ముఖమల్ రుమాలును నీనత్తిని గొట్టు కొమ్ము. ఇప్పటికైనను బుద్ధితెచ్చుకొని, నీ తాహతును నీవు గుర్తించు కొని చరించుము ".

ఆ యుత్తరమునుజదివిన రాజకుమారుని వదనమున కత్తివాటున కయినను నెత్తురుచుక్క లేకుండబోయెను. వర్తకయువకుడును నీవృత్తాంతమును విని తెల్లబోయి, కర్తవ్యము నాలోచించుచుండెను. అంత రాజకుమారుడు గొంత ధైర్యమవలంభించి, వృద్ధురాలిచేతిలో మరికొన్ని సువర్ణనాణెములను బోసి, " అవ్వా! మాకు సంభవించిన యీ యవమానమున కంతగా పాటించుటలేదు కాని, నీకు నూ మూలమున దెబ్బలు తగిలెగదాయని విచారించుచుంటిని. కాని, మీ యజమానికి యీరీతిగా పురుషులపై అసహ్యముగలుగుటకు గల కారణమును నీ వెరుంగుదువా ? " యని యడుగ, నామె వానికిట్లులనియెను.—

" ఆహా ! తెలియును. ఒకనాడామె తన కలలో, ఒక ఆడుపావురమును మగపావురమునువలలోజిక్కుకొన్నట్లును, ఆడుపావురము ముట్టెతోతన బంధనముల విదల్చుకొనియు, పారిపోక, తన భర్తయొక్క కట్లనువిప్ప బ్రయత్నించుచు, చివరకెంతయో శ్రమపడి వానికట్లనుగూడ ముక్కుతో గొరికి, ప్రమాదవశమున దాను తిరుగ నా వలలోజిక్కుకొనగా, మగపావురము దన కుపకారముగావించి, వలలో జిక్కుకొనిన ఆడు పావురము మాటయైన దలంపక, ఆకసమున నెగిరిపోయినట్లును గాంచెను. అప్పటినుండియు, జుబేదాకన్య నిర్దయులైన పురుషుల నసహ్యించుకొనుచు, దన్ను వివాహమాడవచ్చిన రాజకుమారుల నెందరినో యిట్లే తిరస్కరించెను " అనిచెప్పగా రాజకుమారుడునవ్వి, "అవ్వా ! నీవు నాకొక్క యుపకారము జేయవలయును. అదేమందువేని మీ రాజకుమార్తె విహరించు ఉద్యానవనమందు నేనొక్కరాత్రి యుండునట్లుచేయుము. దానివలన నేను జుబేదాయొక్క మనస్సును మార్చి

తీరుదును ". అనిచెప్పగా, ఆ వృద్ధురాలందులకంగీకరించి, నాటిరేయి, రాజకుమారుని జుబేదా యుద్యానవనమున బ్రవేశింపజేసి వెడలిపో యెను. రాజకుమారుఁడును ఆ యుద్యానవన కావలివానికి గొన్ని బం గారునాణెముల నొసంగి తన కుపకరించునట్లు చేసికొనియెను.

అంతట రాజకుమారుఁడా యుద్యానవనమున బ్రవేశించి, దనతో గొనివచ్చిన రంగులను, కుంచెలను బయటకుదీసి, ఆ యుద్యానవనమున గల యొక తెల్లనిగోడపై, ఒకవలయు, అందొక ఆడుపావురము చిక్కు కొనియుండ, మగపావురము దానిని బంధనములనుండి విముక్తి గలిగిం చుటకు మిక్కిలి శ్రమపడి ప్రత్నించుచున్నట్లును, అపుడు దూరము నుండి యీదృశ్యమును జూచిన వేటగాడు తన బాణముచే మగపావు రము నేయనుండుటయు—అట్లు వేటగాడు వధింపజూచుచున్నను మగ పావురము తన భార్యపావురమును రక్షించుటకే బ్రయత్నించుచున్న ట్లును సతిమనోహరముగ, వింతవింతరంగులతో ప్రకృతిసిద్ధముగా జిత్రించి, ఆ రాత్రియంతయు, నా రాజకుమారు డొక పొదలో దాగొనియెను.

ఉదయముననే, జుబేదాబేగం తన వృద్ధపరిచారికతో నాయుద్యా నవనమున విహరింపనచ్చి, నాలుగువైపులను గలయదిరుగుచు గ్రమ ముగా, నటనొక గోడపై చిత్రింపబడిన బొమ్మలనుజూచి, కెవ్వున కేకవైచి, "అవ్వా! అచ్చముగా ఈ గోడపై చిత్రింపబడిన చిత్ర ములు నేను కలలో గాంచినట్లేయుండెను సుమా! ఈ శిల్పనాచమ త్కృతి యెవ్వరిదైయుండునో గదా!" అని ఆశ్చర్యమున ననుచుండ వృద్ధపరిచారిక, గతరాత్రి దనచే నాయుద్యానవనమునందు బ్రవేశ పెట్టబడిన రాజకుమారునిదే యీచాతుర్యమని గ్రహించియు నేమియు నెరుంగనిదానివలె, "ఏమోనమ్మా! ఈదృశ్యము బహుచిత్రముగా

నున్నది. ఏ దేవతలో దీనినిట్లు లోకమున కెదార్థమును జూపుటకై జిత్రించియుందురు". అని సమయోచితముగ ననియెను. అంతట జుబేదాబేగం ఆ వేటగానియొక్కయు, పావురములయొక్కయు చిత్రములను తదేకధ్యానమునతో దిలకించుచు, "అవ్వా! నే నిన్నినాళ్లనుండియు పొరపాటుబడి పురుషులను అసహ్యించుకొనుచుంటిని. ఈచిత్రమును జూడుము—వలలో జిక్కుకొనిన తన ఆడుపావురమును రక్షించుకొనుటకై మగపావురము ప్రయత్నించుచుండ నా పాడువేటగాడు నిర్దయుడై యా మగపావురమును వధింప ఎట్లు విల్లునెక్కుపెట్టెనో! అయినను దన ప్రాణములపై గూడ నాశనువీడి తన ప్రియురాలి రక్షణాకార్యమునందే నిమగ్నమైయున్న ఆ మగపావుర మెంతయు ప్రశంసింపదగినది. పురుషులలోగూడ నింతటి పవిత్రప్రేమగలవారును—దయామయులగువారును నుందురని, నా కిప్పుడుగదా తెలిసెను!" అని పలుకుచు ఆ తావునుబాసి క్రమముగా రాజకుమారుడు దాగొనియున్న పొదదగ్గరకువచ్చి, కొంతదూరములో అటనున్నవానిని జూచి, నివ్వెరపోయి, రెండడుగులు వెనుకకువైచి, "ఆహా! ఈ మన్మథాకారు డెవ్వడై యుండునోగదా! అవ్వా! ఈతడే ఆ గోడపై చిత్రించిన యే గంధర్వుడో యై యుండును సుమా! ఆహా! ఈతని సౌందర్యమనుగన వేయికన్నుల నా భగవంతుడు నాకేల యీయకుండెను? అబ్బా! అతనిని జూచుకొలదియు, నా మతి భ్రమించుచున్నదే". అని జుబేదాబేగం అటనే మూర్ఛపోయెను. రాజకుమారుడా మాటలన్నిటినివిని, ఆమె సౌందర్యమును తొలిసారి మనసారదిలకించి, చల్లగా నా తావును వీడిపోయి, నిజనివాసము జేరుకొని, అట తనరాకకై వేచియున్న వర్తకయువకునకు జరిగిన యావద్వృత్తాంతమునుజెప్పి, తనకు సపూర్ణజయము చేకూరెనని చెప్పి, వానితో పరమానందము ననుభవించెను.

అటమూర్ఛదేరియున్న జుబేదాబేగం కొంతతడవునకు మేల్కాంచి ఆపొదయం దంతకుముందున్న సుందరపురుషుడు లేకుండుటనుగని మరింతవిచారముతో "అయ్యో! ఇంతలోనె నాగంధర్వయువకు డేమయ్యెను? అవ్వా! అతడెందుబోయినదియు, నీవు చూడనయినలేదా? ఛీ! అటువంటి మోహనాకారుని గూడనినాజన్మ వ్యర్థముకదా! చెలీ! ఇక నేతాళజాలను. నీవెట్లయిన నాకామన్మధాకారుని గూర్పకున్న నేజీవింపజాలను. దేవునియాన. ఆతనిపై నామానసంబు హత్తుకొనిపోయెను నాకేదిదారి? అతనినెట్లు గలసుకొనవలయును. అబ్బా! ఆదివ్యతేజోమూర్తినాకు తిరుగగనుపించుట జరుగునో జరగదో! అయ్యో! నిష్కారణముగా జేజిక్కిన యమృతభాండమును ఒలకబోసుకొనిన నిర్భాగ్యురాలను నేనుగాక మరెవ్వరు" అని పెక్కుతెరంగుల వాపోవుచుండ, వృద్ధపరిచారిక రాజకుమారునియొక్క చాతుర్యమును, సాహసమును లోలోన వినుతించుకొనుచు జుబేదాబేగంనుగని, పొంగిపొరలువచ్చు నవ్వును లోన నణంచుకొని, "అమ్మా! ఆసుందరాకారుడెవ్వడో, ఎచ్చటివాడో తెలియుటయే బహుకష్టముకదా! అట్టితరి అతనిని నేనెట్లు గలసుకొని నీవృత్తాంతమును జెప్పగలను? అయినను నాశక్తివంచనలేకుండ బ్రయత్నించి, అవసరమైన నాప్రాణములనయిన ధారవోసి నీకాసుందరాకారునిపొందు గూర్చితీరెదను. ఇదినాప్రతిజ్ఞ. ఇక విచారమును దక్కియుండుము" అని ఓదార్చి, ఆవృద్ధపరిచారిక జుబేదాబేగంను అంతఃపురంబునజేర్చి, ఆమెకు బెక్కువిధంబులగు శీతలోపచారములచే సేదదీర్చి, తానానాడె, ఆమెయొక్క వలపుగానివృత్తాంతమును గనుగొనుదానివలె బయలుదేరి, రాజకుమారుడుండు అంగడికడకరుగ ప్రయాణంబాయెను.

అటనున్న రాజకుమారునిగాంచిన వృద్ధురాలు నవ్వుచు అమ్మా! ఎంతటిచమత్కారము కలవాడవయ్యా! ప్రజ్ఞయనిన నీదే

ప్రజ్ఞ. చివరికి కార్యమును సాధించగల్గితివి. 'పురుషాధమా!' అని నిన్ను మున్నొకప్పుడు ఉద్భోదించిన ఆజుబేదాబేగం కన్యయే యిపుడు నీదర్శనభాగ్యముకొరకు—నీపాదసేవ జేయుటకొరకు తల్లడిల్లి పోవుచున్నది. సెబాస్! శక్తిసామర్థ్యంబులనిన నిట్టులేకదా యుండవలయును. ఉత్తరమువలన అవమానింపబడిన నీకును మొట్టికాయలవలన నవమానింపబడిన నాకునుగూడ తగినఫలితము లభించెను. నీవు జాగు చేసిన నా సుందరాంగి బ్రతుకజాలదేమోననిగూడ నాకనుమానము గలుగుచున్నది. కనుక యికజరుగవలసిన కార్యమేమోవిచారించి వెంటనే నీవామెనుగలయు నుపాయంబు నాలోచింపుము. అయ్యా! ఇంతచనువేర్పడినపిమ్మట నేను నిన్నొక విషయమడుగదలంచినాను. అయితే నీవు నిజమయిన వర్తకుడవేనా? నీవెవడవో రాజకుమారుడవై యుండి, యిట్లు జుబేదాబేగంను వలలోవేసికొనుట కీవన్నాగమునంతను బన్నియుందువని నాతలంపు. ఇపుడయిన నిజముజెప్పవా?" యని యడుగ రాజకుమారుండు నవ్వుచు, "అవ్వా! నీవుతలంచినదంతయు యెదార్థము. నేను సులేమాన్‌షా నవాబుగారి కుమారుడను. నన్ను తాజెల్‌ముల్కు అందురు. నేను ఈజుబేదాబేగంయొక్క సౌందర్యాది గుణములనిపుడు నాతోనున్న యీవర్తకయువకునివలన వినియుండి ఆమెయందు గాఢమయిన మనస్సుగలవాడనై, యిప్పటికి నీయనుగ్రహమువలన జయమందగల్గితిని. ఇదియె నావృత్తాంతము. ఇకచేయవలసినదేమున్నది? రేపటియుదయముననే యీవర్తకుని నారాయబారిగా మీసుల్తానుకడకంపి, జుబేదాబేగంను నేనువివాహమాడ గోరుచున్నట్లు వర్తమానము జేయుదును. అంత సర్వకార్యములును వాటియంతట నవియే జక్కబడగలవు" అని చెప్పగా నావృద్ధపరిచారికయు నదియె యుక్తకార్యమని చెప్పి, రాజకుమారుడు సంతోషపూర్వకముగా దనకొసంగిన యనేకములైన అమూల్యాభరణములగొని యేగెను.

అట అంతఃపురంబునగల జుబేదాబేగం నిద్రాహారము లనొల్లక దానుద్యానవనమందు గాంచినమోహనాకారుని దలంచుకొని, పెక్కు రీతుల దుఃఖించుచుండ, సుల్తానామెనుజేరి, అనేకవిధముల నామెవిచారకారణమును తరచితరచియడుగ నామె సిగ్గువిడచి, సర్వవృత్తాంతమును జెప్పి, ఆయువకుని దాను వివాహమాడజాలనియెడల ఆత్మహత్య గావించుకొందునని జెప్ప, అంతవరకును పురుషుల నసహ్యించుకొనుచు వివాహముమాటనయినను దలపెట్టనీయని తనకుమార్తె నేడు తానైయొకపురుషునిప్రేమించి, వివాహమాడగోరుచున్నందుకు సుల్తాను పరమానందభరితుడాయెను. కాని ఉద్యానవనమునందు గన్పించినయతడు గంధర్వుడో—యక్షుడో—మరెవ్వడో—అతనినెట్లుతెచ్చి తనకుమార్తెకు జేకూర్పవలయును ?

ఈ యాలోచనతో నతడా తావుననీడి, మంత్రులతోడను, ఇతర ఉద్యోగస్తులతోడను యీ విషయమై తీవ్రముగా నాలోచించి, తన కుమార్తెయైన జుబేదాబేగం ప్రేమించిన యతడెందుండెనో గనుగొనిరమ్మని అనేకుల ననేకతావులకంపెను. ఇంతలో వృద్ధపరిచారిక జుబేదాబేగంకడకువచ్చి, “ తల్లీ ! నీవిక విచారింపబనిలేదు. నీ వలపుగానిని బహుప్రయాసపై గనుగొంటిని. అతడొక రాజకుమారుడట ! ప్రస్తుత మీయూరనే నున్నాడు. నీవాతనికొరకై పరితపించునట్లుగానె అతడును నిన్ను మనసారప్రేమించి, రేపు నీ తండ్రికడకు దన రాయబారినంపనున్నాడు ”. అని చెప్పగనే జుబేదాబేగం కెవ్వున అరచి వృద్ధ పరిచారకను కౌగలించుకొని, “ అవ్వా ! నీ ఋణమును నే నెట్లు దీర్చుకొందును అదృష్టమనిన, నాదేకదా అదృష్టము ! ” అని యొకింత తడ వానందమహాసముద్రమున నోలలాడి, తనయాభరణముల నన్నింటినిసి ఆ వృద్ధురాలికి బహుమానముగా నొసంగెను.

వృద్ధురాలు చెప్పినట్లుగనే, నా మరునాడు వర్తకయువకుడు సుల్తాను కడకువచ్చి తాజెల్ముల్కుయొక్క సర్వవృత్తాంతమును జెప్పి, అతడు జుబేదాబేగంను వివాహమాడగోరుచున్నట్లు చెప్పెను. అంతట వెతుకబోయిన తీగ కాలికి జుట్టుకొన్నందులకు సుల్తాను మహానందము నంది, వెంటనే ఆ వివాహామునకు దన సమ్మతిని దెలిపి, రాజకుమారు డున్నబసకు దన పరివారజనంబులతోడను, మంగళవాద్యంబులతోడను నేగి, తాజెల్ముల్కును మహావైభవముతో నూరేగించి, తన విడిది యందుంచి, యాక్షణమునందె శుభముహూర్తమును నిశ్చయింపజేసి, సులేమాన్షాకు శుభవర్తమానము నంపుచు, వెంటనే తరలిరావలసి నదిగా కబురంపెను.

ఈ వర్తమానమును వినిన సులేమాన్షాయు, దున్యాసుంద రియు, దమ కుమారినికోరిక నెరవేరినందులకై పరమానందమునందుచు, సర్వపరిజనంబులతోడను నతివైభవముగా వివాహమునాటికి కర్పూర ద్వీపము వచ్చిచేరెరి. అంతట అనుకొనిన శుభముహూర్తమున తాజెల్ ముల్కునకు జుబేదాబేగం నొసంగి మహేంద్రవైభవంబుతో వివాహ కార్యము నెరవేర్పబడి, యెల్లరును నుచితరీతిని సత్కరింపబడిరి. వర్తక యువకుడు తనభార్యచే యొసంగబడిన ముఖమల్ రుమాలును జుబేదా బేగంనకు కానుకగానొసంగి, పరిపూర్ణమయిన మనశ్శాంతితో, అజీజే నామమునే స్మరించుకొనుచు కాలము గడపుచుండెను. తాజెల్ముల్కు జుబేదబేగంలు మహానందముతో సుఖింపదొడంగిరి.

# 26 అలీబాబా—40 దొంగలు.



పరిష్యాదేశమున నొకనగరమున నిరువురన్నదమ్ములు నివసించు చుండిరి. పెద్దవానిపేరు కాసిం. రెండవవాని నామధేయము అలీబాబా. తండ్రి మరణానంతరము వారి కత్యల్పమైన యాస్తికలదు. ఆ భాగ్యమును వారు సమానముగా విభాగించుకొని విడిగా కాలక్షేపము చేయుసాగిరి.

కాసి మొకభాగ్యవంతుని తనూభవను బరిణయమాడెను. ఆమె తనతోc జాలధనమును గొనివచ్చెను. ఆ ధనముతోc గాసిము వర్తకముc జేయసాగెను. అచిరకాలములో నాతcడానగరములోని వణిక్బృందమున నగ్రగణ్యుcడాయెను. హాయిగా నాతcడు కాలముగడపసాగెను.

అలీబాబా యొక బీదవానికూcతురును బెండ్లియాడెను. అన్నవలె దివ్యహర్మ్యమున నివసింపక, అలీబాబా యొక చిన్నకుటీరమున వసింపసాగెను. ఉదరపోషణార్థ మాలీబాబా యనుదినము కూలి చేసి కొనవలసియుండెను. అరణ్యమునకేగి పుల్లలనుగొట్టి, గాడిదలచే మోయించుకొని నగరమునకేగి, వాటిని విక్రయింపcగావచ్చిన స్వల్పద్రవ్యముతోc గుటుంబపోషణము చేసికొనుచుండెను. ఆతcడొకనాcడడవికేగి కట్టెలను గొట్టుచుండగా దూరమున నేదో కాళుమబ్బువలెc గాన్పించెను. అది యేదైయుండునా యని, అలీబాబా శ్రద్ధగాc జూచెను.

అశ్వపదఘట్టనముచే నాయరణ్యము ప్రతిధ్వనించుచుండెను. ఆ యాశ్వికులు దొంగలై యుందురని యాతcడనుమానించి, గాడిదలను జెదరcగొట్టి, యచటనున్న విశాలవృక్షముపై నెక్కి, గుబురుగా

నున్న శాఖలనడుమఁ గూర్చుండెను. అతఁడు తాను కాన్పించకుండ క్రిందనున్నవారినిఁ జూడగలిగియుండెను చెట్టుక్రిందనే యొక చిన్న పర్వతోపత్యక యుండెను. ఆ యాశ్వికులువచ్చి, పర్వతముఖముననున్న యాచెట్టుక్రిందనే యాగినారు. వారి నాలీబాబాలెక్కబెట్టి "అహో! నలుబదిమంది" యనుకొనినాఁడు. అతఁడు తలంచినట్లు ఆ నలుబది మందియును బందిపోటుదొంగలై యుండిరి. దూరమునగనున్న గ్రామము లందు బందిపోటు దొంగతనములుచేసి, యా పర్వతములోని యొక గుహను నివాసస్థలముగా నేర్పఱచుకొనినారు. దొంగలందఱును క్రింద కుదిగి, హయములను చిన్నచిన్న వృక్షములకుఁ గట్టివైచి, వీపుపై వ్రేలాడుచుండిన తోలుసంచుల నీవలికిఁ దీసినారు. దొంగలనాయకుఁడు పొదలలోనికిఁబోయి "సీసేమ్! తలుపు తెఱచుకొనుగాక" యనెను. రహస్యద్వారము తెఱచుకొనినది. ఆ నలుబదిదొంగలును లోనికేగినం తనేతలుపుమూసికొనిపోయినది. దొంగలు తమసంచులలోని బంగారము నొకచో [illegible]ంచి, యీవలికివచ్చినారు. నాయకుఁడు "సీసేమ్! తలుపు మూసికొనుగాక" యనెను. తలుపు మూసికొనియెను. అశ్వారూఢులై యా నలుబదిమందియును వెడలిపోయిరి. వారు తిరిగివత్తురేమో, యని కొంతసేపు వేచియుండెను.

ఆ దొంగలు తిరిగిరారని నిశ్చయించుకొని, యాలీబాబా క్రిందికి దిగి, రహస్యద్వారమును జేరి "సీసేమ్! తలుపు దెఱచుకొనుగాక" యనెను. తలుపులు తెఱచుకొనెను తలుపు మూసికొనునపు డుచ్చ రించవలసిన మాటకూడ జ్ఞాపకముంచుకొని, యాలీబాబా లోనికేగెను. ఆ గుహ దివ్యతేజోద్దీపితమైయుండెను. రత్నములు, వజ్రములు, వెండి, బంగారపుకాసులు క్రింద గుట్టలుగ బడియుండెను. అతఁ డేమాత్రము నాలసింపక సంచులనిండ బంగారునాణెముల నింపి, తన మూఁడుగాడి దలపై వేసెను. ద్వారముకడ నిలువఁబడి "సీసేమ్! తలుపులు మూసికొనుగాక" యనెను. తలువులు ధింపఁబడియెను.

ఆలీబాబా తిన్నగా నింటికిఁబోయి, తలుపుల భద్రముగాబం ధించి, గదిలో నాసంచులలోనినాణెముల నొకచోనుంచెను. అతనిభార్య చూచి "నాథా ! ఇదియేమి ? తుదకు దొంగతనముల—" ననుసరి కాతఁడు "ఆగుము. నేను దొంగలపాలిటి దొంగను. సామాన్యుఁడ గాను. నేటితో మనదారిద్ర్యము తొలఁగిపోయినది" అనినాఁడు. ఆమె యానాణెముల లెక్కిడసాగినది.

"ఓసి వెఱ్ఱిదానా ! ఎన్నిదినముల నట్లు లెక్కపెట్టెదవు ? నేను దొడ్డిలో నొకగోయి త్రవ్వెదను. నీవు మాటాడక కూర్చుండుము".

ఆమె యానాణెములు సుమారుగా నెన్నియున్నవో తెలిసికొను నభిలాషతో రయమున కాసిం సౌధమునకుఁబోయి "అక్కా ! ఒక సారి కుంచమునీయగలవా ? ఇప్పుడే తిరిగియిచ్చెద" నన్నది. ఆమె లోనికేగి కుంచమును గొనివచ్చుచు నడుగున జిగురునంటించి "ఇదిగో కుంచ" మని యిచ్చెను. గాని యామెకు "దరిద్రుఁడైన యాలీ బాబా యేరకము ధాన్యము తెచ్చెనో ? కొలుచుటకుఁ గుంచముకూడ కావలసివచ్చినది. చూచెదఁగాక" యన్నకోరికఁ గలిగెను. ఆలీ బాబాభార్య కుంచముతోఁగొలిచి, తిరిగికాసిముభార్యకుఁ బంపివేసెను.

కాసిముభార్య కుంచమును బరిశీలించెను. బంగారునాణెమా జిగురున కంటుకొనియుండెను. "ఓహో ! కొలువవలసినన్ని నాణెముల నాలీబాబా సంపాదించెనా" యని యామె తలపంకించినది. భర్త యింటికిరాఁగానే, మత్సరగ్రస్తయైయున్న యామె "ప్రియసఖా ! నీవే యీపురములోని వర్తకులలో నగ్రగణ్యుఁడవని, భాగ్యశాలివని తలఁచుచున్నావు. నీతమ్ము డాలీబాబా నీకంటె వేయిరెట్లు భాగ్యము కలవాఁడు. బంగారునాణెముల నాతఁడెన్ని సంపాదించెనోగాని, వాని

మసకుంచముతోఁ గొలిచినారు. కుంచమడుగున జిగురునంటించినాను. ఈనాణెమంటుకొనిన" దని చూపించెను.

అసూయానలజ్వాలలు కాసిమును నిలువెల్ల దహించినవి. ఆ రాత్రి యాతఁడు నిద్రింపలేదు. ఉదయమున నతడాలీబాబా యింటి కేగి "తమ్ముఁడా! నీవు మహాదారిద్ర్యము ననుభవించుచున్నట్లు నటింతువు గాని నిజమునకు సువర్ణనాణెములఁ గుంచముతోఁ గొలుతువు. ఈయపారభాగ్యము నీకాకస్మికముగా నెట్లులభించిన?" దని యడిగెను.

ఆలీబాబా విస్మితుఁడై "భాగ్యమేమి లభించిన?" దనెను. "ఇదిగో! ఈనాణెము కుంచమున కంటుకొనినది. నిజముచెప్పెదవా? లేకున్న నీసమాచారము రాజునకెఱింగింతునా?" యని కాసిము బెదరించినాఁడు. ఆతని స్వార్థపరత్వమునకు మిక్కిలి చింతించి, "నీవు నన్ను బెదరించినంతమాత్రమున భయపడువాఁడగాను. వలయునేని, నాకీభాగ్యము లభించినవిధానముఁ దెలుపుదును. ఇష్టమున్నయెడల నీవుకూడ నటకేగి, కావలసినంతఁ దెచ్చుకొను" మని, జరిగిన దంతయుఁ జెప్పుటయేగాక, దొంగల సాంకేతికపదములఁగూడ తెలిపెను.

మఱుచటిదిన ముదయమున భార్యతోఁజెప్పి, పదియొంటెలను గొని కాసీము ఆలిబాబా చెప్పిన మార్గమునుసరించి వెళ్లి, యరణ్యములోని రహస్యద్వారమును జేరెను. "సీసేమ్ తలుపులుఁ దెఱచుకొనుగాక" యనినంతనే తలుపులు తెఱువబడినవి. కాసిము లోనికేగినంతనే తలుపులు మూసికొనినవి. ఆగుహాలోని ధనరాసులను, విలువైన తివాచీలను, రత్నకంబళములనుగాంచి, మహదానందపరవశుఁడై నేత్రపర్వముగ నుండిన యాదృశ్యమును విలోకించుచు నట్లేయుండిపోయెను.

చాల నాలస్యమైనదని తలంచి, కాసిము తాను గొంపోయిన పదిసంచులనిండుగ బంగారునాణెముల నుంచి, ద్వారముకడకు వచ్చెను.

పాపము! ఆ యానందాతిరేకమున కాసిము "సీసేమ్! తలుపు తెఱచుగాక" యనుట మఱచిపోయెను. జ్ఞప్తికిఁ దెచ్చుకొనుటకై యాతఁ డెన్నోవిధములఁ బ్రయత్నించెను. కాని లాభములేకపోయెను. భయమాతని నావహించెను. మధ్యాహ్నమాయెను. దొంగలు హాయములపై వచ్చి, యచటఁ బచ్చికమేయుచున్న ఖరములనుగాంచి యాశ్చర్యమగ్నులై, వానిని తఱిమివైచి, గుహాద్వారముఁజేరి, సాంకేతిక పదమునుచ్ఛరించిరి. తలుపులు దెఱచుకొనునంతనే యొక్కఁడుఱుకున కాసి మీఁదపడఁబడెను. గాని దొంగలాతనిని బంధించి, నాలుగు భాగములుగ ఖండించి గుహలోపల వ్రేలాడవైచి, వెడలిపోయిరి.

రాత్రియైనది. కాసిమింకను దిరిగి రాకపోవుటచే విచారము నొంది, యాతనిభార్య యాపదశంకించి, అలీబాబా యింటికివచ్చి "నా యందు దయయుంచి, మీ యన్న జాడల నరసిర" మ్మని పంపినది. అలీబాబా గుహలోనికేగి, ఖండింపఁబడియున్న యన్నకళేబరమును, మఱికొంత బంగారమును గొనివచ్చెను. కాసిము భార్యను విచారించవలదని చెప్పెను; ఆమె అలీబాబాను భార్యనువచ్చి దన సౌధములో నివసింపఁగోరెను. ఈ విషయ మెవరికినిఁ దెలియకుండ జేయవలయునని కాసిముభార్య తనభర్తకు జబ్బుగానున్నదని యిరుగు పొరుగువారితోఁ జెప్పినది. మఱునాఁ డాతఁడు చనిపోయినాఁడని యెల్లరతోను జెప్పిరి.

కాసిము పరిచారిక మార్జియానా మిక్కిలి తెలివైనది. ఆమె యొక కుడారివానిని, కన్నులకుఁ గంతకట్టి గొనివచ్చి, నాలుగుభాగములుగానున్న కాసీము మృతకళేబరమును గలిపి కుట్టించినది. అంత్యక్రియలు నెరవేర్పఁబడినవి. దొంగలు గుహలోఁ గాసిము శవము లేకుండుటగాంచి, భయసంభ్రమాశ్చర్యపరవశులై "ఓహో! మన యునికి మఱియొకరికిఁగూడ తెలిసియున్నది. అతఁడెవరో కనుగొని వధిం

పని యెడల మనము పట్టుబడిపోవుదు" మని తలంచి, నాయకుఁడొక దొంగను బిలిచి, నగరములోనికిఁబోయి యా మృతకళేబర మేమైనదో తెలిసికొనిరమ్మని పంపెను.

ఆదొంగ తన తెలివితేటల నుపయోగించి గుడారివానిని బట్టుకొని, యాతఁడేయింట నాల్గుతునకలై యున్న కళేబరమును గుట్టినో చూపుటకుఁ బ్రయత్నించుమని యడిగెను. ఆగుడారి తిన్నగాఁ గాసిముసౌధమునకుఁ గొనివచ్చి "తప్పక యీమేడలోనికే నేనువచ్చియుందు" ననెను. ఆదొంగ + అనుమార్కును తలుపుపై వేసి వెడలిపోయెను. మార్జియానా యీచిహ్నముఁజూచి, యెందులకైన మంచిదని యావీధిలోని ప్రతిగృహద్వారమునను నట్టిసంజ్ఞలనుంచెను.

మఱునాటిరాత్రి దొంగలువచ్చి, యామార్కు ప్రతియింటి తలుపుమీఁదను యుండుటచూచి, కాసిముసౌధ మిదియని నిర్ణయింపఁజాలక, నిష్ఫలమనోరథులై తిరిగివెడలిపోయిరి. నాయకుఁడు దొంగనుబిలిచి "నీతెలివితక్కువతనమున కిదేఫలిత" మని వధించెను. నలుబది మందిదొంగ లిపుడు ముప్పదితొమ్మండుగురే యైరి.

మఱునాఁడు మఱొకదొంగ నగరములోనికిఁబోయి కాసీము సౌధద్వారముపై నెఱ్ఱనిమార్కు నుంచెను. ఆసంజ్ఞనుకూడ చూచి, మార్జినియా యావీధిలోని యింటిద్వారము లన్నింటికి నదేమార్కును వేసెను. ఆరాత్రి కూడ దొంగలువచ్చి విఫలమనోరథులైరి. ఆదొంగకుఁ గూడ నాయకునిచే శిరచ్ఛేదనశిక్ష విధింపఁబడినది. పాపము! దొంగలసంఖ్య యిపుడు ముప్పదియెనిమిదే. నాయకుఁ డాకార్యభారమును మఱొకదొంగపై నిడక తానే బయలుదేఱి గుడారివానిసాహాయ్యమున నామేడను దానే బాగుగాగుర్తించి, గుహకుఁబోయి తన రాకను నిరీక్షించుచుండిన దొంగలతో నిట్లనియెను—

" మిత్రులారా! ఈసారి నేనేపోయి గుర్తించివచ్చితిని. చనిపోయిన యతఁడు కాసిం, ఆతని సోదరుఁడగు నాలీబాబాను మనమిపుడు మట్టుపెట్టవలయును. మీరు నగరమునకుఁబోయి పందొమ్మిదియొంటెలను, ముప్పదియెనిమిది తోలుసంచులను గొనుఁడు. ఒకసంచినిండుగ నూనెపోసి యుంచుఁడు. నేను మిమ్ము వంతెనకడ గలిసికొందును—".

వారట్లేయొనరించిరి. నాయకుఁ డానూనె నిరసంచులకుఁ బూసి, దొంగలనందఱను నా సంచులలోఁ గూర్చుండజేసి, యూపిరి పీల్చుటకుఁ దగిన స్థలముంచి, యొంటెలపై వేసి బయలుదేఱెను. చీఁకటి యెల్లెడల నావరించుకొనెను. నాయకుఁడు తిన్నగా నాలీబాబా సౌధముకడకుఁబోయి " అయ్యా! మాది పొరుగూరు. నూనెను విక్రయించుటకై వచ్చితిని. చీఁకటిపడినది. నగరములో బసలు లభించు ప్రదేశము నెఱుఁగను. ఈ రాత్రి నాకును, నాయొంటెలకును గొంచెముస్థల మిచ్చితిరేని మీకుఁ గృతజ్ఞుఁడనై యుందు " ననెను—

ఆలీబాబా "అయ్యో! దీనికింతగా వేఁడవలయునా? రండు!" అని, నౌకరగు నబ్దుల్లాను బిలిచి " దొడ్డిలో నీయొంటెలను గట్టివేసి, మేతఁ బెట్టుమని, దొంగలనాయకుని లోనికిఁగొంపోయి సుఖాసనాసీనుఁ గాంచి, కుశలప్రశ్నాదికమైనపిదప వివిధవిషయములఁగూర్చి ముచ్చటించెను. మార్జియానా యిరువురకు భోజనము సిద్ధముచేసినది. భోజనానంతరము ఆలీబాబా " మార్జియానా! ల్లతెవారుఝామునసే శిరస్నానముఁజేసి, గ్రామాంతరమునకుఁ బోవలసియున్నది. తువ్వాలు, సబ్బు నటనుంచి నీరుతోడి సిద్ధముచేయు " మని చెప్పినాఁడు.

భోజనానంతరము దొంగలనాయకుఁడు దొంగలకడకుఁబోయి " నేనా గదికిటికీనుండి చినచిన్నరాళ్లు గిరవాటువైచెదను. అపుడు

మీరు బాకులతో నా త్రాళ్లను గోసివైచి యీవలకురండు". అని యందఱితోను జెప్పి, తనకు నిర్దేశింపబడిన గదిలోనికేగి, దీప మార్పివైచి, శయనించెను. ఆలీబాబా కూడ తన గదిలోనికేగెను మార్జియానా నీరు తోడుటకై దీపము వెలిగించి, దొడ్డిలోనికిఁ బోయెను. గాలికి దీప మారిపోయెను. మఱల నింటిలోనికివచ్చి, దీపము వెలిగింపఁ బోయి, నూనెలేదని తెలిసికొనెను. దొడ్డిలో నొంటెలు తెచ్చిన నూనెలోఁ గొంతతీసి, వెలిఁగింపనగునని మార్జియానా యొక నూనెసంచిని తాఁకెను.—

"ఏమి! ఈవలకు రావచ్చునా?" యని దొంగ ప్రశ్నించెను. మార్జియానా హడలిపోయినది. ముప్పదియెనిమిది సంచులలోను ముప్పదియేడుమండ్రు దొంగల నామెగాంచెను. తన యజమానిని జంపుటకై యీదొంగలు వచ్చియున్నారని గ్రహించి, మార్జియానా నూనెయున్న సంచి లోనికిఁగొంపోయి సలసలకాచి, ధైర్యముతో నొక గిన్నెను చేఁబూని యా ముప్పదియేడుగురు దొంగలున్న సంచులలోఁ బోసెను. క్రాఁగియున్న యా నూనెపడి, దొంగలు మాఱుమాటాడక విగతజీవులైరి.

అర్ధరాత్రము మీఱినంతనే దొంగలనాయకుఁడు మెల్లగా కిటికీ తలుపులఁ దెఱచి, గులకఱాళ్ల నా సంచులపై గిరవాటు వేయసాగెను. పిన్నఱాళ్లు గిరవాటువైచినను దొంగలు పైకిరాకుండుటచే సంచులను నిగ్రహించుచుండియుందురని కోపమునొంది, తలుపుదీసికొని, దొడ్డిలోనికివచ్చి, పిగతాసులై యున్న యనుచరులనుగాంచి, వేడినిట్టూర్పు విడిచి "నా యానెట్లో యాలీబాబా గ్రహించియే యిట్లొనరించెను. ఇఁక పాఱిపోవుటఁదప్ప గత్యంతరములేదు". అని యా తోటగోడ నెక్కి యీవలకుఱికి పాఱిపోయినాఁడు. ఇదంతయు వంటగది కిటికిలో నుండి మార్జియానా చూచుచునేయున్నది. తరువాత నామె లోనికిఁ బోయి, గాఢముగా నిద్రించినది.

ఉదయమున నాలీబాబా నిద్రనుండి మేల్కాంచి, స్నానము చేసి, యొంటెలింకను దొడ్డిలో నుండుటచే, వర్తకుఁడు వెడలిపోలేదని గ్రహించి, "మార్జియానా! నీ వానవర్తకుఁడు వెళ్లిపోయెదనని చెప్పి నావుగదా!" యనినాఁడు. ఆమె "అల్లా నిన్ను రక్షించుగాక! ఆ సంచుల నొకసారి చూడుఁ" డనియెను. ఆలీబాబా యా సంచులలోనున్న దొంగలఁగాంచి, భయవివశుఁ డాయెను. మార్జియానా "అయ్యా! భయపడవలదు. నూనివర్తకుఁడు దొంగల నాయకుఁడు. ఈ ముప్పదియేడుగురు నాతని యనుచరులు. నిన్ను జంపుటయే వారి ముఖ్యోద్దేశము. వీరందఱును జనిపోయినా" రని, తా నొనరించినదంతయుఁ జెప్పెను.

ఆలీబాబా అబ్దుల్లాను బిలిచి, తోఁటలో నొకమూల పెద్ద గోయి త్రవ్వించి, యాదొంగల నందుఁబూడ్పించెను. ఒంటె లొక్కొకటిగా విక్రయింపఁబడియెను. ఆలీబాబా తన్ను మృత్యుముఖమునుండి రక్షించిన మార్జియానను వివిధముల గొనియాడెను. ఆమె బానిసయైనను, ఆలీబాబా సంపూర్ణస్వేచ్ఛ నిచ్చెను.

ఇట నిట్లుండగా దొంగలనాయకుఁడు గుహనుజేరి "అనుచరులు లేని యీగుహ నాకిపు డంధకారబంధురముగాఁ గాన్పించుచున్నది. క్రొత్తగా నెవరి ననుచరులుగాఁ గొందును. వా రొకవేళ పోరాటమున మృతినొందియున్నను నా కింతదుఃఖము కలిగియుండెడిది కాదు. దుర్మరణము నొందిన నా యనుచరులకొఱకైన నే నాలీబాబాను వధించితీరెద" నని నిశ్చయించుకొని, యారాత్రి గుహలో నిద్రించి, మఱునాఁడు నగరములోనికిఁబోయి కాసిము దుకాణమున కెదుటనున్న యొకగది నద్దెకుఁ దీసికొనెను. గుహలోనున్న రత్నకంబళములు, దుస్తులు, తివాచీలు మున్నగువాని నాతఁడు విక్రయింపఁ బూనెను. కాసిము వస్త్రాలయ మిపు డాలీబాబా కుమారుని యధీనములో నుండెను.

దొంగలనాయకుఁ డాలీబాబా కుమారునితో స్నేహముచేసెను. ఆనాఁడు శుక్రవారము బట్టల దుకాణములన్నియుఁ గట్టివేయఁబడి యుండెను. ఆలీబాబా కుమారుఁడును, బట్టలవర్తకుని రూపముననున్న దొంగలనాయకుఁడును సాయంకాలము వాహ్యాళికేగి, తిరిగి వచ్చు చుండఁగా నాలీబాబా కుమారుఁడు తమ సౌధముకడనాగి తండ్రిని బిలిచి "జనకా! నేను నీతోఁజెప్పిన దీయనగూర్చియే" యనెను. ఆలీబాబా దొంగలనాయకుని లోనికాహ్వానించెను. తండ్రి నావలకుఁ గొంపోయి కుమారుఁడు "మన మీపూట నీ వర్తకునకు భోజనముఁ బెట్టవలయు" ననియెను. ఆలీబాబా "అయ్యా! మాయింట నీపూట భోజనము చేయఁగోరెద" ననెను. ఆతఁడు వలదని మొదట నిరాక రించెనుగాని, యాలీబాబా మిక్కిలి బలవంతముచేయుటచే నాతఁడంగీ లకు సమ్మతించెనుగాని పదార్థములం దుప్పువేయరాదని చెప్పెను.

మార్జియానా యా మాటవిని "ఉప్పులేని పదార్థములఁదిను నీ విపరీతవ్యక్తి యెవరా?" యని యోజించెను. భోజనపదార్థములఁ దయారుచేసి వడ్డించునపుడు మార్జియానా యావర్తకుని జూచెను— ఆఁ! ఆతఁడే దొంగలనాయకుఁడు—ఆమె యాతని నానవాలుపట్టెను. అదిగాక యాతని మొలనున్న తోలుపటకానుండి వ్రేలాడుచున్న కైజారునుజూచి మార్జియనా "నా యజమాని ప్రాణములఁదీయు టకై యీతఁ డెన్నియుపాయముల నూహించుచున్నాఁడు. ఈతని నీసారి యంతమొందింతు" నని తలపోసి, అబ్దుల్లానుబిలిచి యేమో చెప్పెను. ఆతఁడు "ఆలీబాబాయును కుమారుఁడును ద్రాక్షాసవము సేవించిన పిదపఁ జంపనగు" నని తలంచెను. ఆమె యందముగా నలం కరించుకొని, నృత్యము చేయసాగినది. అబ్దుల్లా కంజిరా వాయించ సాగినాఁడు. ఆ నృత్య మొకయాటంకముగా నున్నదని దొంగలనాయ కుఁడు చీకాకుపడినాఁడు. మార్జియానా యట్లే వివిధభంగిమములఁ

ప్రదర్శించుచు, పటకాకున్న బాకుతో నా దొంగలనాయకుని వక్షమునఁ బొడిచినది.

అదిచూచి యాలీబాబా క్రుద్ధుఁడై "మార్జియానా! ఏల నీవ ర్తకుని హత్యగావించినావు? నీకు మతిపోయినదా?" యని ప్రశ్నింప, నామె "చాలు. ఈసారి యీ దొంగలనాయకుఁడు నిన్నే వధించుటకు వచ్చినాఁ" డని, యా దొంగ మొలనుండి కైజారునుదీసి చూపెను. ఆనందకృతజ్ఞతాశ్రువులు రాల్చుచు నాలీబాబా "మార్జియానా! ఈతఁడు దొంగలనాయకుఁడని యెట్లు గ్రహించితి?" వని యడిగెను. ఆతఁడు ఉప్పుకలియని పదార్థములనే వాంఛించెను. మహమ్మదీయుఁ డొకని యుప్పునుదిని, వానినే వధింపఁబూనుటగాని, వానికపకారము సేయఁబూనుటగాని పాతకమనియెంచి, యాతఁ డవ్విధమున నడిగెను. అదిగాక యాతని నానవాలుపట్టితిని" అని మార్జియానా సమాధానము చెప్పెను.

ఆలీబాబా కుమారు నుద్దేశించి "మార్జియానా మన ప్రాణదాత; గాక సుందరి. ఆమెను నీవు పెండ్లియాడు" మనెను. ఆతఁడు మాఱుపలుకక యందుల కంగీకరించెను. శుభదినమున వివాహమహోత్సవము జరిగెను. సంవత్సరమువఱకు నూరకుండి, ఆలీబాబా కుమారుని దీసికొని, గుహలోనికేగి, యచటనున్న భాగ్యమును గొనివచ్చి, హాయిగా మహారాజభోగముల ననుభవించుచు జీవితము గడుపసాగెను.

---

# 27 అబన్ హస్సాను.



ఖలీఫా హరాన్ ఆలరాషీదు పరిపాలనకాలముననే బాగ్దాదునగరమున నొకవణిజుఁడు నివసించుచుండెను. అతని కొకతనయుఁడుకలఁడు. అతనిపేరు అబన్ హస్సాను. బాల్యమునుండియు నబన్ హస్సాను బరిహాసప్రియుఁడై యుండెను. కొంతకాలమున కావణిజుఁడు వ్యాధిగ్రస్తుఁడై చనిపోయెను. అబన్ హస్సా నప్పటికి యౌవనవంతుఁడై యుండెను. తండ్రి యార్జించియుంచిన యపారభాగ్యమున కాతఁ డధికారియయ్యెను. తన ధనములో నాతఁడు రెండువంతుల నొకచో భద్రపఱచి, యొకవంతును దాను దీసికొనెను. ఆ ధనముతో నాతఁడు స్నేహితులను జేరఁదీసి, విలాసముగఁ దిరుతిండికి, పానీయములకుఁ గర్చుపెట్టసాగెను. ఆ ధనము వ్యయమైనంతనే, అబన్ హస్సాను స్నేహితులను బిలిచి "ప్రియమిత్రులారా! నా కడనున్న ధనమంతయు నింతవఱకుఁ గర్చుపెట్టితిని. నేపటినుండి మీరు నాకొఱకుఁ గర్చుపెట్టవలయునుజుడీ" యనెను.

మఱునాఁడు అబన్ హస్సాను కడకు స్నేహితులెవరును రాలేదు. వారి స్వభావము లిట్టివిగదాయని గ్రహించి, తల్లితోఁజెప్పి వాపోయెను. ఆమె కుమారు నూరడించి "నాయనా! ఈ కాలపుమిత్రుల స్వభావమిట్టిదని నీకుఁ దెలిసినదిగదా! ఇఁకనైన జాగరూకతగలిగి, మెలఁగుము" అనియెను. తనకున్న రెండువంతుల ధనములో నొకవంతు ధన మీవలికిఁదీసి, స్నేహితులను జేరఁదీయక, రోజునకొకయపరిచితు నాహ్వానించి, విందుచేయుచుండెను. మఱునాఁ డాయపరిచితుఁడు కాన్పించినచో అబన్ హస్సాను పలుకరించకుండెను. ఇట్లు చేయుటవలన నాతనికి స్నేహితులు లేకుండిరి. ఇట్లొక సంవత్సరము గడచినది.

ఒకనాఁడు అబన్‌హస్సాను యెప్పటియట్ల నగరబహిః ప్రదేశ మున వంతెనకడ గూర్చుండి యపరిచితు లెవరువత్తురోయని వేచియుం డెను. మాఱువేసమున నగరసంచారమొనరించి వచ్చుచున్న ఖలీఫా హారాన్ అలరాషీదు ప్రభువు పరివారసమేతముగ వచ్చుచుండెను. అబన్‌హస్సాన్ ఖలీఫాను దనతో విందారగించుటకై యింటికిరమ్మని యాహ్వానించెను. ఆ యాహ్వానము నంగీకరించి, ఖలీఫా అబన్‌హస్సాను గృహమునకేగెను. అతఁడు ఖలీఫా సంతృప్తుఁడగునట్లు విందుచేసెను. ఖలీఫా కాతఁడు మధురపానీయమొసఁగి, గౌరవించెను. ఖలీఫా "మిత్రమా! నీ వృత్తాంతమునెఱుఁగ కుతూహలుఁడనై యున్నా" ననెను. అబన్‌హస్సాను "వలదు. నే నెవరినైన నాహ్వానించినవో, వారితో నానాఁడుతప్ప మఱల మాటాడను. ఆతనితోఁగా దేరితోను గూడ నాకు స్నేహామువల" దనెను. అట్లనుటవలన ఖలీఫా కౌతుక మినుమడించెను. అతఁడు "మిత్రమా! స్నేహామునలదు. నీ యుదం తము నెఱింగింపు" మనెను. అబన్‌హస్సా నంతయుఁజెప్పఁగా నాల కించి, ఖలీఫా విరగఁబడినవ్వెను. ఆతని వినయవిధేయతలు, మధుర భాషణములు ఖలీఫా నాకర్షించెను. 'ఈతనికిఁ బ్రత్యుపకారము సేయుదు' ననితలంచి, ఖలీఫా, హస్సాను ద్రావనున్న పానీయములో భంగునుంచెను అతఁ డది త్రాగి స్మృతిహీనుఁడై పడిపోయెను.

ఖలీఫా యనుచరులఁ బిలిచి "ఈతని నంతఃపురమునకుఁ గొని పొం" డని యాజ్ఞాపించెను. ఖలీఫా యంతఃపుర పరిచారకులకుఁ బరిచారికలకు నుద్యోగులకుఁగూడ "అబన్‌హస్సానునే ఖలీఫాగా భావించి గౌరవించవలయును. ఆతని కనుసన్నల మెలంగవలయును. ప్రభూయని సంబోధించుచుండవలయును. అతఁడే మీ ప్రభువై నట్లు సంభాషించవలయు" నని చెప్పెను. ఇట్లుచెప్పి, ఖలీఫా యొక గదిలోఁ గూర్చుండి జరుగునదంతయుఁ జూచుచుండసాగెను.

అబన్‌హాస్సాను స్మృతిఁగోల్కొని చూచుసరికిఁ దాను హంస తూలికాతల్పముపైఁ బరుండియుండుట నాలోకించి, యాశ్చర్యచకితుఁడాయెను. పరిచారకులు "ప్రభూ! ప్రార్థనకు వేళయైన" దనిరి. కుడ్యములు చిత్రపటసంశోభితములై యుండెను. ద్వారములకు బంగారుజల్తారుతో నేయఁబడిన జాలరులు కట్టఁబడియుండెను. అబన్‌హాస్సాను "ఇదికలయా లేక నేను స్వర్గమునందున్నానా" యని తలపోసెను. ఆతఁడు నవ్వుచు "నే నెవరిని? ఎచ్చటనున్నా" నని ప్రశ్నించెను. సుందరాంగియగు పరిచారిక "ప్రభూ! తమ యంతఃపురమిది. తమ రిచ్చటనేయున్నారు". అనినది. "నీ పేరెవ?" రని యాతఁ డడుగ, నామె "వజ్ర" మని జవాబిచ్చినది. "నాకిదిపరమాశ్చర్యకరముగనున్నది. నిన్నరాత్రి నే నాహ్వానించిన యతిథి యేమైనాఁడు? ఆతఁడు ప్రాయశః పిశాచమైయుండును. ఆభూతనాథుఁడు చేసిన మాయయేయిది. ఆమాయాజాలమున నేను జిక్కుకొని యున్నాను". ఈ రీతిగా తలంచి, యాతఁ డొకనింబిలిచి "నే నెవరి?" నని ప్రశ్నింప నాతఁడు "స్వామీ! తామే ఖలీఫాగారు. మా ప్రభువులు" అనెను. "ఇదియేమి? నిన్న అబన్‌హాస్సానునై యుండి, నేఁడు నేను ఖలీఫా నైతినా?" యని యాతఁ డాశ్చర్యమునొందసాగెను. ఇంతలో మంత్రియగు జియాఫరు, సేనాధిపతియగు నబన్‌హాస్సాను, న్యాయస్థానాధిపతియు వచ్చి, వంగివంగి సలాములొనరించి "ప్రభూ! తమ యాజ్ఞలకై వేచియున్నా" మనిరి. అతఁడు విస్మితుఁడై మంత్రినుద్దేశించి యిట్లనెను.—

"వజీర్! మసీదువీధిలో అబన్‌హాస్సానను యువకుఁడు నివసించుచున్నాఁడు. అతని తల్లి కీక్షణమున రెండువందల బంగారునాణెములు నే నిచ్చితినని చెప్పి, యిచ్చిరమ్ము".

న్యాయాధిపతింగాంచి, యాతఁడు "ఓయీ! మసీదులోనున్న మువ్వురు మౌల్వీలును సాటఁబొడనీయరు. మాటాడనీయరు. ప్రజా శాంతికి భంగముఁగలిగించు వీరి నా వీధినుండి వెడలఁగొట్టుటయేగాక యెన్నఁడు నావీధిలో నివసింపమని ఖరారునామా వ్రాయించిపుచ్చుకొను" మనెను. ఆ యాజ్ఞలు రెండును నా క్షణముననే నిర్వర్తింపఁబడెను. ఆతఁ డంతట "నా కాకలివేయుచున్న" దనెను. పరిచారికలబన్ హస్సాను నొకగదిలోనికిఁ పోగొంయి, రుచ్యములగు భోజనపదార్థములతో నిండిన సువర్ణపాత్రను ముందిడిరి. అట్టిపదార్థములనాతఁ డెన్నఁడును భుజించియుండలేదు. "ఆహా! నాతో నిన్నరాత్రి విందారగించిన యాతఁడు పిశాచలోకాధినాథుఁడై యుండును. నేను సురక్షితముగ నాయిల్లు చేరుకొనునట్లా యనుగ్రహించుగాక" యనెను. ఒకసుందరి యాతనికి మధురపానీయములో భంగుఁగలిపి, త్రావనిచ్చెను. అది త్రాగి, అబన్ హస్సాను చైతన్యవిహీనుఁడై పడిపోయెను. ఖలీఫా యాజ్ఞానుసారముగఁ గొంద అనుచరులువచ్చి, అబన్ హస్సాను నాతనిగృహమునఁ జేర్చి, వెడలిపోయిరి.

తెల్లవాఱినది. అబన్ హస్సాను నిద్రనుండి మేల్కాంచి చూచుసరికిఁ గదియంతయు నంధకారబంధురమైయుండెను. ఆతఁడు 'అమ్మా!' యని కేకవైచెను. ఆతనితల్లి "నాయనా! లెమ్ము! తెల్లవాఱిన" దనెను— "ఏమీ? నే నెవఁడననుకొంటివి? నేను ఖలీఫాను. నన్ను ప్రభూ! యని సంబోధించుము. నాయనా యనినచోఁ దన్నుదు" ననెను—

"నీకు మతిపోయినదా? పిచ్చియాసుపత్రికి బంపవలెనా? నే నెవతెనో నీకుఁ గనఁబడుటలేదా! ఎవరో నిన్ను మంత్రముగ్ధునిఁ జేసినారు".

ఇట్లని యామె మంత్రముల నుచ్చరింపసాగెను. మఱల నామె "నాయనా! నీకు శుభవార్త నెఱింగింతును. నీపై నేరారోపణమొనరించి, జుల్మానావేయించిన ముప్పురు మౌల్వీలును నీ వీధినుండి వెడలఁగొట్టఁబడిరిసుమా!" యనెను. అతఁడు "నేనే యాపని చేయించినది. ఇన్నూరు సువర్ణనాణెముల నీకంపినది. నీకు జ్ఞానములేదా! నేనే ఖలీఫానని యెఱుఁగవా?" యని, యామెను గొట్టసాగినాఁడు. ఆమె బిగ్గఱగా రోదనముఁ జేయసాగినది. ఇరుగుపొరుగువారు వచ్చి, జరిగినదంతయువిని, అబన్‌హస్సాను మతి చలించినదని గ్రహించి, యాతని కాళ్ళేతులఁ గట్టివైచి, పిచ్చియాసుపత్రికిఁ గొంపోయినారు. అచ్చట నాతని ననుదినము కొరడాలతోఁ గొట్టసాగినారు. పదిరోజు లాతఁడట్లు నరకయాతన ననుభవించినాఁడు.

ఒకనాఁ డాతనితల్లి యాసుపత్రికిఁబోయి కుమారునిఁజూచి "నాయనా! నీకింకనైన బుద్ధివచ్చినదా? ఖలీఫావైనచో నీకీదుస్థితి యెందులకు సంభవించియుండు" ననెను. "అవునమ్మా! నీవు పల్కినదనిజము. నేను ఖలీఫానుగాను. నీకుమారుఁడను. నన్నీనరకమునుండి యావలకుఁ దీసికొనిపొ" మ్మనెను.

ఆమె యాతని నాటికిఁగొంపోయి, స్నానముజేయించి, భోజనమిడెను. ఒక్కఁడును భుజించుటకలవాటులేకపోవుటచే నాతఁడు "రాత్రి భోజనసమయమున నాతో విందారగించుట కెవరినైనఁ గొనివత్తు" నని, సాయంసమయమున వంతెనకడకుఁబోయి కూర్చుండెను. ఖలీఫా యొక వర్తకునివేషమున నాదారిని వచ్చినాఁడు. అబన్‌హస్సానులేచి "ఓపిశాచలోకాధిపతీ! రమ్ము" అనెను.

"ఓయీ! అబన్‌హస్సాను? పిశాచాధిపతీ యనిపిలుచుటకు నీకు నేనేమపకారమొనరించితిని?".

"ఏమి చేయవలయునో యదే చేసితివి. పదిరోజులు పిచ్చియాసుపత్రిలో గొలుసులచే బంధింపఁబడి, కాయము చిల్లులువడునట్లు కొరడా దెబ్బలను తింటి" నని జరిగినది సావధానముగఁ జెప్పెను. ఖలీఫా నవ్వాపుకొని "మిత్రమా! నాతో నానాఁడు సంభాషణవశమున మాల్వేల వలన నీకుఁ గలిగిన బాధనెక్కింగించితివిగదా! ఆబాధయింక గలుగదుగదా! అంతకంటె ఈసారి నీవు బ్రహ్మానందమునొందు నుపకారము జరుగు" ననెను.

"అట్లయిన నన్నేమి చేయుమందువు ?".

"ఏమియును లేదు. మన మిర్వురము విందారగించుటయే".

"సరే. నీవు మఱల మానవరూపమునను౦డు నీదయ్యములఁ బంపనని వాగ్దానముఁ జేసినచోఁ దీసికొని వెళ్లెద ను".

ఖలీఫా యట్లే వాగ్దానము చేయగా నబునుహాస్సాను తనవెంట నింటికాతనిం గొంపోయెను. మఱలవారు భోజనముచేసి, సరససల్లాప నిమగ్నులై కొంతతడవు గడపినపిదప, పానీయములఁ ద్రావసాగిరి. ఖలీఫా యొక పానీయమున భంగుకలిపెను. ఆపానీయము త్రాగి అబన్ హాస్సాను తెలివితప్పి పడిపోయెను. ఖలీఫాయనుచరులాతనిని రాజాంతఃపురమునకు గొంపోయిరి.

హంసతూలికాతల్పముపై నాతఁడు శయనించెను. తెల్లవాఱినది అబన్ హాస్సాను కనులఁదెఱచి చూచునరికిఁ బదిమంది వారాంగనలు తంబురా, దిల్ రూబా మున్నగు వాద్యములపైఁ బాడుచుండిరి. శ్రవణానందకరముగనున్న యాగానము నాకర్ణించి, యానందపరవశుఁడాయెను. గానమాగెను. వారకాంతలు వెడలిపోయిరి. ఎదుటనున్న పరిచారికలఁగాంచి "ఆహా! మఱల మోసగింపఁబడితిని. ఇదినాతప్పిదము. ఆపిశాచనాథుఁడు నన్ను వంచించిన పాపఫల మనుభవించుగాక" యనెను.

ఖలీఫా లోపలినుండి "హా! అబన్‌హాస్సాన్! ఇంక నేమియు ననవల" దనెను. అబన్‌హాస్సాను ఖలీఫా కంఠస్వరమును గుర్తించెను. ఖలీఫా యీవలకువచ్చి "నేఁటినుండి నీవు నా ప్రాణమిత్త్రుఁడవు. అనుదినము నాస్థానమునకు వచ్చుచుండుము" మని, ధరించుటకు విలువైన దుకూలములనొసంగి, వేయి సువర్ణనిష్కములనుగూడనిచ్చి, వీడ్కొలిపెను. అతఁడింటికిఁబోయి, తల్లికాధనమునిచ్చి, ఖలీఫాయౌదార్యమును బొగడెను.

అబన్‌హాస్సాను ఖలీఫా ముఖ్యస్నేహితుఁ డాయెను. అంతఃపురమునఁగూడ నాతనికిఁ బ్రవేశముండెను. ఖలీఫా భార్యయగు జుబేదా చెలికత్తెలలో ముఖ్యురాలగు నుజతల్హా నాతఁడు పెండ్లియాడెను. ప్రణయసామ్రాజ్యాధినాథులై యిర్వురును శృంగార రసోదధిం దేలియాడుచుండిరి. వారి కడనున్న ధనమంతయుఁ గర్చయిపోయెను. అబన్‌హాస్సా నొకయుక్తిఁబన్ని సతినిఁ బిలిచి "ప్రేయసీ! నుజతల్హా! మన యిర్వురికడ ధనమేమియును లేదు. ఖలీఫా కడ నేనును, జుబేదా రాణినుండి నీవును ధనమును యుక్తిచే సంపాదింపవలయును. ఇదిగో! వినుము. మనము మృతినొందినట్లు నటించవలయును. నేను చనిపోయినట్లు శయనింతును. ఒక పట్టుబట్ట నాపైఁగప్పి, యొక కత్తిని గొంచెముప్పును నా మీఁదకప్పిన బట్టపైనిడి, నీ జడనువిప్పి, కేశముల నారఁబోసికొని, జుబేదకడకేగి, యేడ్చుచు నేను మరణించినానని చెప్పుము. ఆమె విచారించి, యొక పట్టుబట్టను, యిన్నూరు సువర్ణనాణెములు నిచ్చును. నీ వింటికి వచ్చినపిదప, నిన్నట్లే పరుండజేసి, ఖలీఫాకడ నిట్లేనాటకమాడి ధనముఁదెత్తు" ననినాఁడు. ఆమె యట్లేయని యంగీకరించినది. అబన్‌హాస్సాను మృతినొందినట్లు శయనించినాఁడు.

ఆమె యాతఁడు చెప్పినచొప్పునఁ జేసెను. జుబేదారాణి నుజతల్ఫా నోదార్చి, "విచారింపకుము" అని, యిన్నూరు సువర్ణనాణెముల నిచ్చినది. ఆనాణెముల నింటికిఁ దెచ్చి, నాథునకుఁ జూపి, తాను మృతినొందినట్లు శయనించినది. అబన్ హస్సాన్ తనసతి చనిపోయినదని చెప్పగా, ఖలీఫా యూఱడించి రెండునందల నాణెములనిచ్చి పంపెను. కొలువు ముగిసినపిదప ఖలీఫా యంతఃపురమునకుఁ బోయి, జుబేదారాణిం గాంచి, "పాపము! నీ చెలియగు నుజతల్ఫా మరణించినదని విని చాల విచారించినా" ననినాఁడు.

"అదియేమి? నుజతల్ఫా కాదు మరణించినది. అబన్ హస్సానే చనిపోయినాఁడు. ఆమె యేడ్చుచు నిచటికివచ్చినది. ఇన్నూరుసువర్ణ నాణెములనిచ్చినా" నని జుబేదాపల్కఁగా, ఖలీఫా "చాలుచాలు! అసత్యములాడకుము. ఆమె చనిపోయినదని యిప్పుడేగదా అబన్ హస్సాను నాతోఁ జెప్పినది? ఇన్నూరునాణెముల నిచ్చినానే" యని "మెస్రూర్!" అని కేకవేసెను. అంతఃపురపరిచారకులలో నాయకుఁడగు మెస్రూరు వచ్చినంతనే ఖలీఫా "నీవు అబన్ హస్సాను గృహమునకుఁబోయి యెవరుచనిపోయినారో కనుగొనిరమ్ము" అనెను.

మెస్రూరురాకను గమనించి, అబన్ హస్సాను సతితోఁజెప్పి, యామెను చనిపోయినట్లు శయనింపఁజేసెను. ఆతఁడు వెళ్లి నుజతల్ఫా చనిపోయినదని చెప్పెను. ఆమె విశ్వసింపలేదు. ఖలీఫా నవ్వుచు "మెస్రూర్! ఆమాట మీరాణితో మఱియొకసారి చెప్పుము. ఆమె తెలివిమందగించిన" దనెను. ఆమె కోపగించి "అవును నౌకరుల మాటల విశ్వసించువారి తెలివి మందగించక యెట్లుండు?" ననినది. ఆమె నాథు నుద్దేశించి "మిమ్ము సంతోషపెట్టుటకై యాతఁడట్లసత్యమాడినాఁడు నేనే నిజము తెలిసికొందు" నని, పరిచారకులలో నమ్మఁ

దగిన వృద్ధురాలిం బిలిచి యెవరు చనిపోయినారో చూచిరమ్ము అని పంపెను. ఆమె పరుగెత్తుకొనుచుఁ బోయెను. ఆమెనుచూచి అబన్ హాస్సాను మృతినొందినట్లు పరుండెను. నుజతల్హా యేడ్చుచుండెను. ఆమె నోదార్చి, యా వృద్ధురా లంతఃపురమునకుఁబోయి, అబన్ హాస్సానే చనిపోయెనని చెప్పెను. మెస్రూరు "ప్రభూ! ఆ ముసలి దానికి కనులు సరిగాఁగనబడవు". అనగా రాణి క్రుద్ధయై, "ఆమె యంధురాలు. నీవు బధిరుఁడవు". అనెను. ఖలీఫా నవ్వినకొలఁది ఆమెకు యుక్కురోష మధికమై, తుదకు విలపింపనారంభించెను.

ఖలీఫా "జుబేదా! నేను మెస్రూరు నసత్యము పలికినామనినావు. నీవును నీ పరిచారికయు నిజము పలికినను నేను నమ్మఁజాలను. కనుక మనము నల్వురునుబోయి చూచివత్త" మనినాఁడు. నలువురును బయలుదేఱి వెళ్లినారు. వారినిచూచి యిర్వురును చనిపోయినట్లు శయనించినారు.

"పాపము! భర్త మరణముచూచి భరింపలేక నుజతల్హా చనిపోయిన" దని జుబేదా పలికినది.

"కాదు. భార్యమృత్యువు కనులారఁగాంచి, గుండెపగిలి చనిపోయినాఁ" డని ఖలీఫా వచించినాఁడు.

ఇరువురకు మఱల వాగ్వాదమారంభమైనది. ఖలీఫా "అల్లా! ఎవరుముందు చనిపోయినారో తెలిపినవో వేయి సువర్ణనాణెము లిచ్చెదను". అనినాఁడు.

అబన్‌హాస్సాను వెంటనేలేచి "నేనే ముందు మరణించినాను. వేయినాణెములును యిచ్చి, మీ ప్రతిజ్ఞను పాలించుకొనుఁ" డనెను. నుజతల్హాకూడ లేచినది. ధనముకొఱకై యిర్వురునుబన్నిన యుక్తి యని ఖలీఫా జుబేదాలు గ్రహించినారు. కాని రాణి "నా కవసర

మని యడిగినచో ధనమునీయనా చెలీ! దీనికై యింత దారుణనాటక మాడి, తగని యారాటముఁ గల్పింతువా?" యనెను. ఖలీఫా యాతనిఁ దనతోఁ దీసికొనిపోయి, వేయి సువర్ణనాణెములనిచ్చి నెలకు నూఱు సువర్ణనాణెములు జీత మేర్పఱచినాఁడు. జుబేదారాణి కూడ నుజతల్హాను దనతో నంతఃపురమునకుఁ గొంపోయి వేయినాణెములను యిచ్చెను. ఆదంపతు లన్యోన్యానురాగయుక్తులై, యానందముగాఁ గాలముఁ గడపసాగిరి.

---

## 28 కీలుగుఱ్ఱముకథ.

పరిష్యాదేశమునకుఁ బ్రధాన నగరమైన షిరాజుపట్టణము నేలుచుండెడి నృపాలుఁడు ప్రతిసంవత్సరము గొప్ప యుత్సవముఁజేయుచుండెడివాఁడు. ఆ యుత్సవ సందర్భమున నొక చిత్రవస్తుప్రదర్శనము నేర్పఱచి, మిక్కిలి విచిత్రమైనవస్తువులను దయారుచేసిన వారలకు బహుమానము లిచ్చుచుండెడివాఁడు. ఆ సంవత్సరపు విచిత్రవస్తు ప్రదర్శనసందర్భమున నాఖరురోజున నొక హైందవుఁడు తాను నిర్మించిన కీలుగుఱ్ఱమును బ్రదర్శించినాఁడు. అచటనున్న ప్రజలాగుఱ్ఱము జీవించియే యున్నదని భ్రమించినారు.

ఆహైందవమాంత్రికుఁడు రాజునుద్దేశించి "ప్రభూ! ఈకీలుగుఱ్ఱ మత్యద్భుతమైనది. దీనిచెవిలోనికీలును ద్రిప్పినయెడల నెచటికిఁ బోదలంచినను బోవచ్చును. గగనమార్గమున సముద్రములను, పర్వతములనుగూడ నెట్టియాపదయుఁ గలుగకుండ దాఁటిపోవచ్చును" అనెను. రాజేంద్రుఁడు "ఓయీ! ఇచ్చటికి మూఁడు క్రోసులదూర

మున నున్న పర్వతముపై ఖర్జూరవృక్షములున్నవి. అచటికేగి, నాలు గైదుపండ్లను నిదర్శనముగాఁగొనిరమ్ము" అని చెప్పెను. ఆమాంత్రి కూఁడా కీలుగుఱ్ఱమునెక్కి, కీలుత్రిప్పి క్షణములో నింగికెగసి, యైదు నిమిషములలో నాపర్వతమునుండి ఖర్జూరపుఁబండ్లను గొనివచ్చెను.

ఆనృపాలుఁ డాశ్చర్యానందములనొంది "ఓయీ! ఈగుఱ్ఱము నెంతకు విక్రయింతు?" నని యడుగ నామాంత్రికుఁ "డయ్యా! నన్ను క్షమింపుఁడు. ఈగుఱ్ఱమును జేసియిచ్చినశిల్పి యెవరికిని విక్రయింపవలదనియు, దీనికిబదులుగా నేదియైనఁదీసికొని యీయవచ్చ ననియుఁ దెలిపినాఁడు" అనెను—"అట్లయిన నీ కేమికావ లయు?" నని ప్రశ్నింప, నామాంత్రికుఁడు "రాజేంద్రా! నీకు మార్తె యతిలోకసుందరియని వినియున్నాను. ఆమెనునాకిచ్చి పెండ్లి సేయునెడల నీగుఱ్ఱమునిచ్చుటకు నాకెట్టియభ్యంతరమునులే" దనెను. ఆకోరిక నాలకించి యందఱునునవ్విరి. రాజుపెద్దకొడుకైన ఫిరోజిషా "తండ్రీ! ఈతఁడీయశ్వము నీయకున్నమానె. నాచెల్లెలినిచ్చి కుల మును కళంకితము సేయవల" దనినాఁడు.

రాజు "నాయనా! నాకుమాత్రము తెలియదా? నీవా యశ్వమును బరీక్షింపుము. నీకు నచ్చినవో నెట్లోబేరమాడి కొందు" మనియెను. ఫిరోజిషా యా కీలుగుఱ్ఱమునెక్కి, యదినడుపు విధానము నెఱుంగకుండగనే, గర్వాతిరేకమున చెవిలోని కీలుత్రిప్పెను. ఆ యుత్తర క్షణమున నాయశ్వము మింటికెగసి, యదృశ్యమయ్యెను. "రాజా! నే నది యాపువిధానముఁ దెలుపకుండగనే నీతనయుఁడు నడుపుకొని పోయెను. ఏమిచేయుదగు?" ననెను. క్రుద్ధుఁడై యా భూమీశుఁడు "నా నందనుఁ డాకసమునకుఁ బోవునపుడు నీవు కేకవైచియైన దానిని త్రిప్పువిధానము నీవు తెలిపియుండవలసినది. మూఁడు దినములలో నాతఁడు నిరపాయముగఁ దిరిగిరానియెడల నిన్నురితీయుదు" ననియెను.

ఫిరోజిషా గగనమండలమున కెగిరిపోయెను. అతఁడు క్రిందికిఁ జూచెను. కళ్లుతిరిగెను. అంతయునేకమై యేమియు స్పష్టముగాఁ గనఁబడకుండెను. అతఁడపుడు "అయ్యో! గుఱ్ఱమును మరలించు తెలఁగెఱుంగక యెందులకెక్కితి" నని పశ్చాత్తాపపడి, చెవిలోని కీలును మఱలఁద్రిప్పెను. అతఁడట్లు త్రిప్పినకొలఁదిని యశ్వము మఱింతవేగముగాఁ బోవుచుండెను. తిరిగిపోవుటకై యెచటనైన మరయున్నదేమో యని యాతఁడు వెదకెను. కంఠము ప్రక్క నొకకీలు కాన్పించెను. ఆ కీలును త్రిప్పగా, గుఱ్ఱము మెల్లగాఁ గ్రిందికి దిగఁజొచ్చెను. ఆ గుఱ్ఱము తిన్నగా వంగదేశపు నవాబుకుమార్తె యంతఃపురసౌధముపై నాగెను. నిర్మానుష్యమగు నే యరణ్యములోనైనగాక, మనుష్యావాసముకడ నాగినందులకుఁ బరమాత్ముని సంస్తుతించి, ఫిరోజిషా యంతఃపురములోనికిఁ బోయెను. అప్పటి కర్ధరాత్రము మీఱెను. క్షుత్పీడితుఁడై యుండిన ఫిరోజిషా వంగదేశపు నవాబుకూతురు, హంసతూలికాతల్పముపై శయనించియుండెను. ఆమెకీవలఁ గొందఱు పరిచారికలు నిద్రించుచుండిరి. ఫిరోజిషా ధైర్యమువహించి, నవాబుకుమార్తె సమీపమున మోకరించికూర్చుండెను. అనుపమానసౌందర్యోద్భాసితయగు నాకన్య రూపరేఖావిలాసములఁగాంచి, విమోహితుఁడై యాతఁడా [illegible]కుసుమకోమలమైన కరమును ముద్దిడుకొనెను. ఆమె మేల్కాంచి యెదుట నవమోహనాకారుఁడగు యువకునిఁ జూచినది. ఆమె దిగ్గున లేచి, పరిచారికల మేల్కొలుపక "ఓ సుందరాంగా! నీ వెట్లీయంతఃపురమునఁ బ్రవేశించితివి? నీ వృత్తాంతము నెఱింగింపు" మనినది. ఫిరోజిషా జరిగినదంతయుఁ జెప్పినాఁడు. ఆమె పరిచారికల మేల్కొలిపి, ఫిరోజిషాకు భోజనసదుపాయములఁ జేయించినది. అతఁడు మఱొకగదిలోనిద్రించినాఁడు. ఆమె యారాత్రి నిద్రింపలేదు. ఫిరోజిషా సుందరవదనారవింద మామెహృత్ఫలకమున గాఢముగాఁ జిత్రింపఁబడినది.

మఱునాఁడు ఫిరోజిషా షిరాజునగరమునకు వెడలిపోయెదనని చెప్పఁగా నామె "వలదు. మఱిరెండుదినము లుండు" మని ప్రతిమాలినది. ఆతఁడట్లు రెండుమాసము లుండిపోయినాఁడు. ఒకనాఁ డతఁడు "కోమలీ! నా కొఱకు నాతలిదండ్రులు నిక్కువముగా నాందోళనాయత్తచిత్తులై యుందురు. నన్ను పెండ్లియాడు తలంపే నీకున్న యెడల నాతో నిపుడు బయలుదేఱుము" అనినాఁడు. ఆతని యెడగల ప్రేమాతిశయముచే నామె మాఱుమాటాడకుండ కీలుగుఱ్ఱము నెక్కినది. ఇరువురును షిరాజునగరముఁ జేరినారు. భార్యతో వచ్చుచు నూరేగింపుటుత్సవము లేకుండ పురప్రవేశమొనరించుట కిష్టము లేనివాఁడై, నగరము వెలుపలనున్న రాజభవనములో నామె నుంచి, యంతఃపురమున కేగెను.

రాజుతన కుమారునిగాంచి, బ్రహ్మానందభరితుఁడై కారాగృహమున బంధితుఁడై యుండిన హైందవునిఁ బిలిపించి జరిగినదంతయుఁ జెప్పి యా కీలుగుఱ్ఱమునిచ్చి, పొమ్మనిరి. మాంత్రికుఁడు తన్ను ఖైదీగా బంధించినందులకుఁ గుపితుఁడై తిన్నగా నగరము వెలుపలనున్న రాజ భవనముకడకరిగి, నవాబుకుమార్తెను జూచి "అమ్మాయీ! రాకుమారుఁడు నిన్ను గొనిరమ్మని పంపినాఁ" డని కీలుగుఱ్ఱము నెక్కించి, క్షణములో నంతరిక్షమున కెగిరిపోయెను. ఆ పోకడచూచి రాజు విచార నిమగ్నుఁడాయెను. ఫిరోజిషా మూర్ఛితుఁడై, శైత్యోపచారములచేఁ గొంతవడికిఁ దేఱుకొని, "తండ్రీ! ఆమె నిటకెట్లయినఁ గొనివచ్చిన పిదప నేను వత్తును. అంతవఱకు రా" నని ఛద్మవేషధారియై యెటకో వెడలిపోయెను.

మాంత్రికుఁడు మార్గాయాసఖిన్నయైయుండిన నవాబుకుమార్తెను నగరము వెలుపలనున్న యొకవనములో నొకచోనుంచి, పండ్లు

గొనివచ్చుటకై వెడలి, తిరిగివచ్చి తన్ను వివాహము చేసికొనుమని బలాత్కరింపసాగెను. ఆ మార్గమునఁ బోవుచుండిన కాశ్మీరదేశపు నవాబు, తన యనుచరులతోఁగూడ మాంత్రికునిఁజూచి, యేడ్చుచున్న వంగదేశపునవాబు కుమార్తెవలన నిజమునెఱిఁగి "ఈ మాంత్రికుని వధింపుఁ" డని యనుచరుల కాజ్ఞాపించెను. ఆ మాంత్రికుఁడు వెంటనే వధింపఁబడెను. ఆ కీలుగుఱ్ఱమును, నా కన్యను కాశ్మీరదేశపు నవాబు శ్రీనగరమునకుఁ దీసికొనిపోయెను. ఆ నవాబు తన్ను తన తండ్రికడకుఁ బంపించునని విశ్వసించియున్న యాకన్య కిచటగూడ నాశాభంగమయ్యెను.

ఆ నవాబు తన్నుఁ జూడవచ్చి, పెండ్లిచేసికొనుమని బలాత్కరింపఁబోగా, మూర్ఛితయయ్యెను. ఆతఁడంత ఘనవైద్యులఁ జికిత్సార్థమై పంప, నామె పిచ్చియెత్తినదానివలెఁ గేకలువేయుచు నెవరినిఁ దరిఁ జేరనీయకుండెను. ఆమె పిచ్చినిఁ బోఁగొట్టినవారికిఁ బదివేలరూక లిచ్చెదనని నవాబు దేశదేశములఁ జాటించెను. ప్రణయోన్మాదుఁడై పలుతావులఁ గ్రుమ్మరుచు, పరిష్యాదేశాధీశుని తనూభవుఁడైన ఫిరోజిషా శ్రీనగరమునకు వచ్చి యా పిచ్చిపట్టినకన్య వంగదేశపు నవాబుకుమార్తె యని విని, తన్నుఁ జూచినచో నామె మనోవైకల్యమంతరించునని తలంచి, వకరువేషమున నాస్థానమునకుఁబోయి, తా నామె వ్యాధి నివృత్తిఁగావింతునని చెప్పెను. ఆతఁడు "అయ్యా! చాలమందివైద్యులు నిరాశులైరి. వలయుచో నీవునుబోయి యొకసారి చూచిరమ్ము. నాకు నమ్మకములే" దనెను. భటులు తన్ననుసరింప ఫిరోజిషా యా కన్యయున్న గదికడకేగి, నౌకరుల నావలయుండుమని చెప్పి, తాను లోపలికేగెను. ఆమె యీతనినిఁగాంచి, పండ్లు పటపటగొఱుకుచు రావలదని కేకలువేయసాగినది. ఆతఁ డామెకుఁదన కృత్రిమగడ్డముదొలఁగించి, నిజరూపముం జూపెను. ఆమె యధికానందపరవశయాయెను.

నవాబు వచ్చినచో విచ్చి తగ్గినట్లు నటించుమనియుఁ దాను మఱునాడే యామెకు బంధవిముక్తి గలిగించి తీసికొనిపోవుదునని చెవిలోఁజెప్పి నవాబునుజూచి "అయ్యా! ఆమెనొకసారిపోయి చూచి రమ్ము. చాలవఱకు నయమైన" దనెను. నవాబామెకడకేగెను. ఆమె తొల్లిటివలెఁ గేకలువేయులేదు. నిరవధికానంద భరితాత్ముఁడై యా తఁడు పకీరును గౌరవించి, "రేపుకూడ నామెనుజూచి, మందునొసఁగుఁ" డనెను. ఫిరోజిషా "నవాబుగారూ! వంగదేశపు నవాబు కుమార్తెయగు నీకన్య మీకెట్లులభించిన?" దని యడిగెను. అతఁడు జరిగినదంతయుఁ జెప్పగా విని "ఓహో! అటులనా? సరే. ఆమంత్ర బద్ధమైన కీలుగుఱ్ఱము నెక్కుటచేతనే యీయామెకిట్టి మానసికవైకల్యము సంభవించినది. సరే. అట్లయిన క్షణములోఁ గుదిర్చెదను. రేపటి యుదయమున నాకీలుగుఱ్ఱమును దెప్పించుఁడు. పదుగురు చూచు చుండ నీమెచిత్తమును స్వస్థమొనరించెద" ననినాఁడు.

సరేయని నవాబు మఱుచటిదినమున నగరవాసులెల్లరును నావింతనుజూచి యానందింపవచ్చునని చాటించెను నిర్ణీతస్థలమునకుఁబౌరులు తండోపతండములుగావచ్చి కూర్చుండిరి. నవాబు, మంత్రిసామంత బంధుజనమధ్యమున గూర్చుండెను. కీలుగుఱ్ఱముచుట్టును నిప్పునుంచి, చాల సాంబ్రాణిదెప్పించి, యాకన్యను కీలుగుఱ్ఱముపైఁ గూర్చుండ బెట్టి, మూఁడుసార్లు ప్రదక్షిణముచేసి ఫిరోజిషా సాంబ్రాణి నిప్పుపై జల్లి యేవోమంత్రములు నుచ్చరించినట్లు నటించెను. సాంబ్రాణిపొగ నలుకెలఁకుల దట్టముగా వ్యాపించెను. ఎవరికిని కీలుగుఱ్ఱముకనబడలేదు. ఫిరోజిషా తానుకూడ గుఱ్ఱమునెక్కి, చెవిలోనికీలును త్రిప్పెను. వెంటనే యాగుఱ్ఱము గగనమండలమునకు బోయెను. నవాబు తదితరులు నిశ్చేష్టులైరి.

ఫిరోజిషా షిరాజునగరమునకుఁ బోయి, తలిదండ్రుల కానందము గలిగించెను. ఆతఁడా నవాబునకుఁ దెలియఁబఱచి, సకలబంధుజన పరివారసమక్షమున కుమారునకును, వంగదేశపు నవాబు తనూజకును వివాహమొనరించెను. ఆ దంపతులు నిరతిశయానందభరితాత్ములై కాలము గడుపసాగిరి.

---

# 29 ఆలీకోజియా.

బాగ్దాదుపట్టణమున 'ఆలీకోజియా' యను వర్తకుఁడు నివసించుచుండెను. ఆతఁడు సకలసద్గుణసంశోభితుఁడు. తన కున్నదానితోఁ దృప్తినొందుచు న్యాయముగ విత్తము నార్జించుకొనుచుండెను. ఆతని కింకను బెండ్లికాలేదు. పెండ్లియగుటకుఁ బూర్వమే యావర్తకుఁడు పరమపవిత్రక్షేత్రమైన మక్కాకుఁ బోనెంచెను. ఆతని కాసంకల్పము చిరకాలమునుండి యుండినను, యొకనాటిరాత్రి స్వప్నమున నొక వృద్ధమౌల్వీ కాన్పించి "నీవు తేపే మక్కాకుఁబోయిరమ్ము. నీకు శుభమగు" నని చెప్పెను. ఆలీకోజియా మఱునాఁడే మక్కాకుఁ బయనమై యట కర్చగువస్తువుల నొక మూటకట్టి తా నార్జించియున్న వేయిబంగారు నాణెముల నొకకుండలోనుంచి, పైన బాదముకాయల నుంచి, యొకగుడ్డ మూతగాఁగట్టి, తన మిత్రుఁడగు నొకవణిజునికడకుఁ గొంపోయి "మిత్రమా! ఈ బాదముకాయల కుండను గొన్నిదినములు నీయింట భద్రముగానుంచుము. నేను మక్కాయాత్ర చేయఁ బోవుచున్నాను. తిరిగి వచ్చినపిదపఁ గొంపోవుదు" ననెను.

ఆ వణిజుఁ డొకగదిలో నాతని సమక్షముననే కుండనుంచి "స్నేహితుఁడా! నీవు నిశ్చింతగా మక్కాకుఁబోయి రమ్ము" అని చెప్పెను. ఆలీకోజియా మక్కాకుఁబోయి, యాత్రావిశేషములను గాంచి, తాను గొనివచ్చిన సరకుల నొకరిద్దఱువర్తకులకుఁ జూపెను. వారు "స్నేహితుఁడా! ఈ సరకులను కైరోనగరమున నమ్మితివేని జాలలాభ మొదవును" అనిరి.

ఆలీకోజియా కైరోనగరమునుగూడ చూడనెంచియుండుటచే, నటకేగి యా సరకులను విక్రయింపగా నధికమగు లాభముగలిగెను. అవకాశము లభించినపుడు వివిధస్థలముల దర్శించి, యచటివిశేషముల నేత్రానందకరముగఁ జూచి, యానందింపఁజాలని జన్మమేలనని తలంచి, ఆలీకోజియా! ఇస్ఫహాన్, ఫిరాజ్, లస్కర్ మొదలైన నగరముల సందర్శింపసాగెను. అయిదుసంవత్సరము లైనను నాలీకోజియా బాగ్దాదు చేరక యాత్రలఁ జేయుచునే యుండెను.

బాగ్దాదులో నాలీకోజియా మిత్రుఁడగు వణిజునిభార్య గర్భవతియైయుండి యొకనాఁటిరాత్రి నిజనాథుంగాంచి "నాథా! నాకు బాదముకాయలఁ దినవలయునని యున్నది. తేపు గొనిరం" డనినది. ఆ వర్తకుఁడు తటాలునలేచి "అవును. అయిదేండ్లకుఁ బూర్వము ఆలీకోజియా బాదముకాయల కుండను మనయింటదాచి మక్కాకుఁ బోయినాఁడు. అతఁడు జీవించియున్నాఁడో లేదో. ఆ కాయలఁ దెచ్చెద" ననినాఁడు.

ఆమె "వలదు. పరధనాపహరణము మనకుఁదగదు. ఆతని సొమ్ము మనకేల? అయినను, నయిదేండ్లనాటి కాయలింకను నల్లేయుం డునా? కుళ్లిపోయియుండు" ననెను. అతఁ డామె వలదని యెంతగాఁ జెప్పినను విన లేదు. అతఁడా కుండకుఁగట్టఁబడిన గుడ్డను తొలఁగించి

చూచెను. ఆ బాదముకాయలు కుళ్లి బూజుకట్టియుండెను. అతఁడా కుండనంతయుఁ గ్రిందికి బోర్లింపగా వేయిసువర్ణనాణెములును గ్రింద పడెను. అతఁ డాశ్చర్యమునొంది యా నాణెములను దాను దాచికొని బాదముకాయల నా కుండలోఁ బోయగా నవి సగమునకే వచ్చెను. ఆ రాత్రి యతఁడు నిద్రింపలేదు. బాదముకాయలు బూజువారి యున్నవని యాతఁడు భార్యతోఁ జెప్పినాఁడు. మఱునాఁటి యుదయమున నంగడికిఁబోయి బాదముకాయలఁ గొనితెచ్చి యాకుండలోఁ బోసి, మఱల నెప్పటియట్ల వాసెనఁగట్టి యేమియు నెఱుఁగనివానివలె నూరకుండెను. నాలుగుదినములు గడచెను. ఆలీకోజియా బాగ్దాదునకుఁ దిరిగివచ్చెను. వర్తకునికడకరిగి యాతఁడు "స్నేహితుఁడా! యాత్రలఁ జేసికొని, తుద కిన్నివత్సరముల కిలుసేరితిని. దయయుంచి యాకుండ నిచ్చెదవా?" యని యడిగెను.

"మిత్రమా! నీకుండ నీకిచ్చుటకు నా దయయెందులకు? ఆ గదిలోనేయున్నది. తీసికొనిపొమ్ము." అని యావర్తకుఁడా గది తాళపుఁజెవి నిచ్చెను. ఆ తాళపుఁజెవితోఁ దలుపు తెఱచి, ఆలీకోజియా తనకుండ నింటికిఁగొంపోయి, చూచుకొనెను. అందు బంగారునాణెములు లేకుండుటచే నాలీకోజియా ఖిన్నుఁడై యా వర్తకునికడకుఁ బోయి "మిత్రుఁడా! నిన్ను నమ్మినందులకు నన్ను ద్రోహముచేయవచ్చునా? ఈ కుండలో బంగారునాణెముల వేయింటిని దాచియుంటిని. నీవు తీసికొనియుండవలెను. నాకుఁ గోపములేదు. అవసరముండి వాడుకొని యుండవచ్చును. నాకిప్పుడీయనక్కఱలేదు. పత్రము వ్రాసియి" మ్మనెను. ఆ వణిజుఁడు తానేమియు నెఱుఁగనని బొంకెను. ఆలీకోజియా న్యాయస్థానమున బిర్యాదుచేసెను. తనయింట దాచిన కుండలో నేమియున్నదో తా నెఱుఁగనని వర్తకుఁడు ప్రమాణముఁ జేయుటచేతను, నాలీకోజియా కితరసాక్ష్యమేమియు లేనందునను

న్యాయాధిపతి వర్తకుని పక్షముననే తీర్పు చెప్పెను. ఆలీకోజియా హతా శుఁడుగాక చక్రవర్తితోఁ ఫిర్యాదుచేసెను. చక్రవర్తి వర్తకుని బిలిపించి, యొకరోజును వారి యభియోగపునర్విమర్శనమునకు నిర్ణయించి నాఁడు. ఆ రాత్రి చక్రవర్తి వజీరును దీసికొని ప్రచ్ఛన్న వేషధారియై నగరసంచారమునకు బయలు దేఱినాఁడు.

వెన్నెలమనోహరముగాఁ గాయుచున్నది. ఒకచోటఁ గొందఱు బాలు రాడుకొనుచుండగా చక్రవర్తి, ఆ యాట చూచుతలంపుతో నిలువఁబడినాఁడు. ఒకబాలుఁడు "మిత్రులారా! మనము 'ఆలీకోజియా' నాటకమాడుదము. పాప మాతనికి మిక్కిలి దురన్యాయము జరిగిన" దనెను. ఒకఁ డాలీకోజియా గను, మఱొకఁడు వర్తకుఁడు గను, నింకొకఁడు న్యాయాధిపతిగను, మఱియొక బాలుఁడు చక్రవర్తి గను నటింపసాఁగిరి. వర్తకుని వేషధారియగు బాలకుఁడు తానేమియు నెఱుగనని యుత్తరకుండనుజూపి, ప్రమాణముచేసెను. న్యాయాధికారి ఆలీకోజియాకు వ్యతిరేకముగఁ దీర్పుచెప్పఁట, నాతఁడు చక్రవర్తి వేషముదాల్చిన బాలునితో మొఱపెట్టుకొనుట జరిగెను. ఆబాలుఁడు వర్తకునిఁజూచి "ఆతఁడు నీకడ నా బాదముకాయలకుండ నుంచి అయిదేండ్లయినది గదా!" అనియెను.—

"అవును—"

"బాదముకాయ లెన్నాళ్ళనఱకు మంచిస్థితిలో నుండును?"

"మూఁడు సంవత్సరము" లని మఱొకబాలుఁడు సమాధానము చెప్పెను.

"అట్లయిన కొన్నికాయలు క్రొత్తవిగా నున్నవేమి? కావున నీ వాద మసమంజసముగాఁ గాన్పించుచున్నది. ఆలీకోజియా ధన మాతని కిమ్ము".

చక్రవర్తివేషధారియైన బాలుఁ డిట్లుపలికినంతనే యందఱు కేకలిడుచు, నాడుకొనసాగిరి. ఆ బాలుని నిశితబుద్ధికెంతయు సంతసించి, యామాత్రపుయోచన న్యాయాధికారికి లేకపోయినదేయని తలంచి, యంతఃపురమునకుఁ బోయెను. మఱునాఁడు చక్రవర్తి యాబాలుని రప్పించి, వర్తకుని, ఆలీకోజియాను ఆ కుండను దెప్పించి, యాబాలుని చేతనే యభియోగము పునర్విమర్శన చేయించెను. వర్తకునిచేఁ జక్రవర్తి యాలీకోజియా బంగారునాణెముల నిప్పించి, కారాగారమునఁ ద్రోయించెను. ఆ బాలునికి నూఱు సువర్ణనిష్కములను బహుమానముచేసి, చక్రవర్తి యాశీర్వదించి పంపెను.

---

## 30 కమరల్జమాను.

పరిష్యాదేశమునకుఁ గొంతదూరములో సముద్రమున్నది. ఆ సాగరమధ్యమున 'కల్దాన్' అను ద్వీపముండెను. ఆద్వీపమునేలురాజునకు షాజమానని పేరు. అతఁడు ధార్మికుఁడై, జనానురంజకముగఁ బ్రజలపాలించుచుండెను. ఆరాజన్యుఁడు చిరకాలము సంతానహీనుఁడై యుండెను. అతఁడు పెక్కుపుణ్యస్థలముల సందర్శించెను. దానధర్మములజేసెను. మహాత్ముల సేవించెను. తుదకాతని నోములపంటయో యన, నొకకుమారుఁడు కలిగెను. ఆబాలునకు కమరల్జమానని నామకరణము చేయఁబడియెను. ఆబాలుఁడు దిన దిన ప్రవర్ధమానుఁడై, విద్యాధికుఁడాయెను. అతఁడు నవయౌవనవంతుఁడైనంతనే షాజిమాను వివాహయత్నముల సలుపసాగెను. "స్త్రీలు మాయావులు. స్త్రీలు

విశ్వాసహీనులు. నాకు వివాహమువల" దని కమరల్జమాను నిరాక రించెను. తండ్రి కుమారునకు నచ్చఁజెప్పెనుగాని ప్రయోజనము లేక పోయెను. మంత్రి సామంతులు, బంధువులు ప్రయత్నించి విఫలు రైరి. షాజిమాను మఱలఁ జెప్పిచూచెను. 'వివాహము చేసికొన' నని కమరల్జమాను ఖండితముగఁజెప్పెను. రాజు క్రోధావేశపరవశుఁడై "ఈతనిని నగరమువెలుపలనున్న మేడలో బందీగానుంచు" డని భటుల కాజ్ఞాపించెను. ఆసౌధమున నాతఁడు బందీగానుండెను. చదువు కొనుటకుఁ గొన్నిపుస్తకములుమాత్ర మీయఁబడెను. ఆగ్రంథముల జదువుకొనుచు కమరల్జమా నహర్నిశము నొంటరిగా నాసౌధముననే గడపసాగెను. ఆతనికా గ్రంథపఠనమే యానందదాయకముగ నుండెను. పెండ్లిమాటయే యాతఁడు తలపెట్టకుండెగు—

ఒకనాఁటిరాత్రి యాతఁడేదో పుస్తకము జదువుకొనుచు నిద్రా ముద్రితుఁడాయెను. దీపము వెలుగుచునేయుండెను. ఆసౌధోపరిభాగ మున నొకబావికలదు. ఆనూతిలో మైమొనీయను భూతము నివసించు చుండెను. ఆదయ్యము రాత్రి రెండుఝాములకు బావినుండి యీవలికి వచ్చి, వియత్పథమున సంచరించుచుండెను ఆరాత్రి యాభూతము పైకివచ్చి, మేడమీఁదదీపము వెలుగుచుండుటచూచి "ఇదియేమి? ఈమేడ యిన్నాళ్లు నిర్మానుష్యమై, తమోమయమైయుండి, నేఁడిట్లు దీపకాంతిచే నుజ్వలమై యుండుటకుఁ గారణమేమైయుండునని సంశ యించి, మేడమీఁదికేగెను. నిద్రాబద్ధుఁడై యుండిన కమరల్జమాను సౌందర్యమునుజూచి నివ్వెరవోయి "ఆహా! ఇంతటిసొగసైన యువకు నెందును జూచియుండలేదు. ఈతనిభార్యయై యానందించుభాగ్య మే రమణిదో" యని తలంచి, ఆతనిని ముద్దిడుకొని గగనమార్గమున విహరింపఁబోయెను.

అభ్రవీథిని మైమొనీకి దన్హాస్క అను భూత మెదురుపడెను.—

"ఎచటినుండి వచ్చుచున్నా?" వని మైమొనీ దన్హాస్కను బ్రశ్నింపగా నా భూతము "చీనాదేశమునుండి" యని బదులు పలికెను—

"విశేషములే" మని మైమొనీ దన్హాస్కనడుగ "చీనాదేశపు రాకుమార్తెను జూచితిని. ఆహా! ఆమెసౌందర్యము నేమని వర్ణింతును? ఆ విశాలతరళనయనములు—ఆ వినీలకుటిలకుంతలములు, ఆ పరిపుష్టినొంది నవయౌవనోద్భాసితములైన యవయవములపొందిక—ఏమని వర్ణింతును? ఆమెను జూచి నాకన్నులు పండువొనరించుకొనినవి. విచిత్రము. ఆమెకుఁ బురుషులపొడగిట్టదు. ఆమె వివాహము వలదని నిరాకరింప, తండ్రి చేసికొనుమని పలువిధముల బాధించుచు, కారాగృహమున బంధించియుండినాఁ" డని చెప్పెను.

"ఆహా! అటులనా? అట్లయిన నాతోరమ్ము. నీవు చూచిన సుందరాంగినే వర్ణించి మురియుచున్నావు. జగన్మోహనాంగుఁడగు యువకునిఁ జూపింతు" నని మైమొని దన్హాస్కను గొంపోయి కమరల్జమానుం జూపెను. ఆతఁడు "ఈతఁ డందగాడే. కాదననుగాని, యామె యందములో నీతనియంద మేపాటి?" దనెను. ఇర్వురకును వాగ్వాదము పెరిగెను. ఆమె నేలనుదన్నగా మఱొకభూతము ప్రత్యక్షమయ్యెను. మైమొని "కసస్క! ఈ యిర్వురిలో నెవరు సౌందర్యవంతులో చెప్పు" మనెను. కసస్క వారినిజూచి "ఇరువురును సౌందర్యవంతులే. మనము నిర్ణయింపఁజాలము. ఒక యుపాయ మున్నది. వారిలో నొకరినిలేపుదుము. ఆతఁ డామెసౌందర్యమును విశేషముగ మెచ్చుకొనునో, ఆమె సొబగు నాతఁడు ప్రశంసించునో చూతము. ఎవరెక్కువగాఁ బ్రశంసించిన, వారిది తక్కువసౌందర్యమని నిర్ధరింతము" అనెను.

ముగ్గురును చాటుననుండిరి. మైమోని భ్రమరముగామాఱి ఝుమ్మని రొదచేయుచు కమరజ్జమానును మేల్కొలిపెను. కమరజ్జమాను మేల్కాంచి, యా దివ్యసుందరవిగ్రహావలోకమున నత్యధికానంద మోహావివశుఁడై "ఓ కన్యామణీ! లెమ్ము! నీ ముఖవిలోకనమాత్రమున నాలో గొప్పమార్పు గలిగినది. నిన్ను పెండ్లియాడుదును. లెమ్ము" అనెను. భూతమాయవలన నామె మేల్కొనఁజాలకపోయెను. అతఁడామె వ్రేలియుంగరమును దాను ధరించి, తనయుంగరము నామె వ్రేలికుంచెను. భూతముల మహిమచే నాతఁడు నిద్రాబద్ధుఁడుకాఁగా, నవి యా చీనాదేశపు రాజకొమరితయగు బాదూరాకన్యను మేల్కొలిపిరి.

ఆమె కమరజ్జమానుంజూచి, మోహావివశయై, "ఓనవమోహనాంగా! నీయట్టి సుందరాంగునిఁ జూసియున్నచో నాతలిదండ్రులయభీష్టము నీవఱకే నెరవేర్చియుందునుగదా! లెమ్ము. నిన్నీక్షణమునఁ బెండ్లియాడుదును. లేవవేమిది నాపాపమా? నవయౌవన విలాసినినగు నాతో నానందోదధితరంగముల నోలలాడవే" మని, యాతనిచేతిని ముద్దిడుకొనుచుఁ దనయుంగరమాతని వ్రేలినుంచుటయు, నాతనియుంగరము తనవ్రేలినుండుటయుఁ జూచి మహదానందపరవశయై యాతనిని లెమ్మని వివిధముల బ్రతిమాలసాగెను. భూతములమహిమచే నామె నిద్రాముద్రితయయ్యెను.

మైమోని దన్హాస్కునుజూచి "నాపలుకులే నిజమైనవికదా. ఇఁక వీరినెప్పటివలె వారి వారిస్థానముల నుంచవలె" నవెను. దన్హాస్కు చీనాదేశపు రాకుమారిని గొంపోయెను. మైమోని యదృశ్యమయ్యెను. మఱునాఁటియుదయమున కమరజ్జమాను నిద్రనుండిలేచి, పరిచారకులఁ బిలిచి "రాత్రి నాప్రక్క శయనించియున్నకన్య యెవ" రనియడుగ నాతఁడు తనకుఁదెలియఁదనెను. కోపపరీతచిత్తుఁడై రాకొమరుఁడు

వానిని నాలుగుఁదన్నెను. వాఁడు భయపడి తిన్నగా షాజిమానున్నృపాలునికడకుఁ బరుగెత్తి, కమరల్జమానుమతి చలించినదని చెప్పెను.

కమరల్జమాను కడకుఁ దండ్రి రాగా, యాతఁడు మఱల నట్లే యడిగెఁ. తండ్రి "నాయనా! స్వప్నమేమో యది. మే మెవరిని బంపలేదే" యనెను. క్రుద్ధుఁడై కమరల్జమాను, ఆమె యుంగరమును జూపి "స్వప్నములో నుంగరములుకూడ వచ్చునా? ఆమె యెవరో తెలిసికొని తీసుకొనిరానియెడల, నేను క్రుంగి కృశించి, మరణింతు" ననినాఁడు. వ్యస్తహృదయుఁడై షాజిమాను వజీరు సలహానను సరించి, సముద్రతీరముననున్న దివ్యభవనములో నాతని నివసింపఁజేసి, తాను తఱచుగా నాతనిఁ జూచుచుండెను.

అట చీనాదేశ రాజాంతఃపురమున బదూరాకన్య పరిచారకులను జేరఁజీరి, "రాత్రి నాప్రక్కను శయనించిన సుందరాంగుఁడెవ?" రని యడిగెను. దాది "అమ్మా! తా మేనో సుఖస్వప్నముఁగాంచి యుందురు. దానికింత కలవరమేల?" ననెను. ఆమె యన్నము ముట్టక, ఆ యుంగరము గలవానినిఁ దెచ్చి పరిణయముఁ జేసినఁగాని నేను బ్రతుక" నని వంతగించెను. ఆమె యున్మాదినియైపోయినదని తండ్రి నిశ్చయించి, యొక యాగారమున బంధింపఁజేసెను. ఆమె యున్మాదము గుదిర్చినవారికి రాజ్యమున సగమిచ్చి, యామెను పెండ్లిచేయుదు నని ప్రకటించెను.

ఆ బదూరాకన్య పరిచారికలలో వృద్ధురాలగు పరిచారికకు మర్జవానను తనయుఁడుండెను. అతఁడు నాలుగేండ్లక్రితము జ్యోతిషము నేర్చుకొనుటకై విదేశములకేగి తిరిగివచ్చెను. బదూరాకన్యను గూర్చి యాతఁడు విని మిక్కిలి విచారించి, యామె మనోవైకల్యము

నెట్లయిన మాన్పనెంచి, యాఁడుదానివేషమున లోనికిఁబోయి యామెను జూచి మాట్లాడెను. ఆమెయు నాతఁడును సోదరీసోదరులవలెఁ జిన్నప్పటినుండియు మెలఁగుటచే నామె తన యుదంతము నెఱిఁగించి, వ్రేలి నున్న యుంగరముఁ జూపెను. ఆమెను విచారింపవలదని, తా నెట్లయిన యాతనిం దీసికొనివత్తునని పలికి, బయలుదేఱెను. అతఁడు తిరిగి తిరిగి కల్దానుద్వీపమునకుఁబోవు నౌకనెక్కెను. ఆ యోడ యా ద్వీపమున కొకింతదూరములో తుపానుకులోనై మునిఁగిపోయెను. ఈత నేర్చియున్న మర్జవాను దీరమును జేరెను. భవనమునొండాతఁడు కాంచెను. ఆ భవనములోనే కమరల్జమానుండెను. పరిచారకులవలన, నాయనము నొంది యార్ద్రివసనుఁడై యున్న మర్జవానును రప్పించి, కమరల్జమా నాదరించెను. భోజనసమయమున నాతఁడు తన ప్రణయోదంతమును మర్జవానుకుఁ దెలిపెను. మర్జవాను బదూరా నెఱుఁగుదుననియుఁ దానామె కడనుండియే వచ్చితిననియుఁ దెలియఁబఱచినాఁడు మర్జవాను రాకవలనఁ దన తనయుఁడు స్థిరమనస్కుఁడైనాఁడని విని, షాజిమాను ప్రహృష్టాంతరంగుఁ డాయెను. శుభదినమున వారిరువురును బయలుదేఱినారు. చీనాదేశముఁ జేరి బదూరాకన్య యంతఃపురము సమీపించిరి. కమరల్జమాను మర్జవాను జెప్పినచొప్పున వైద్యునివేషమున నవాబుకడకుబోయి, బదూరాకన్య యున్మాదమును బోగొట్టెద ననగా, నవాబు "ఓయీ! నీవు నూటయేబదియవ వైద్యుఁడవు. ఆమెయున్మాదము గుదుర్చలేనిచో నీశిరస్సు ఖండింపఁబడుదు" వనెను.

కమరల్జమాను యందుల కొడంబడి, యంతఃపురములో నామె యున్న గదిప్రక్క మఱొకగదిలో నుపవిష్టుఁడై యొకచీటి వ్రాసి యామెకడకంపెను. ఆమె తన ప్రియుఁడు వచ్చినాఁడని గ్రహించి, యచటికేగెను. ఆమె నాతఁడు పరిరంభణమొనరించుకొనియెను. ఆవార్త విని నవాబు బ్రహ్మానందభరితుఁడై "ఆర్యా! నీవు వైద్యుఁడవసిన

నేను విశ్వసింపఁజాలను. నీ నిజవృత్తాంతము నెఱిఁగింపు" మని కోరెను. మర్జవాను నిజముచెప్పెను. ఆ యిర్వురకును మహావైభవముగ వివాహముఁ జేయఁబడెను. మర్జవాను గొప్పయుద్యోగముచే బహూకరింపఁబడెను.

రెండుమాసములిట్లు గడచిపోయెను. ఒకనాఁటిరాత్రి కమరల్జమాను తన జనకుఁడు మరణశయ్యపై నుండినట్లు కలఁగాంచినాఁడు. తనదేశమునకు రమ్మని భార్యతోఁజెప్పెను. శుభదినమున నవాబుచే బహుళముగ బహూకరింపఁబడి యాదంపతులు కల్దానుద్వీపమునకు మజిలీలు చేసికొనుచుఁ బోవసాగినారు. ఒకనాటిసాయంత్రము వారొక నగరముఁజేరిరి. ఆనగరమువెలుపల గుడారములవైచుకొని వారు విశ్రమించిరి. ఆమె బడలియుండుటచే నిదురించెను. ఆమెవడ్డాణమునాతడు చూచెను. అందొకరక్షరేకుఁ గాన్పించెను. ఆరక్షరేకుపైనున్న యక్షరములఁ జదువవలయునను నుద్దేశముతో గుడారములోఁ జీఁకటిగా నుండుటచే కమరల్జమానీవలికి వెలుతురులోఁ జదువుటకై వచ్చినాఁడు. ఆతనిచేతిలోని వడ్డాణము నొకపక్షి తన్నుకొనిపోయినది. ఆతఁడా పక్షిని వెన్నాడినాఁడు. వడ్డాణముకంటె యాతనికి రక్షరేకుపోయిన దనియే విచారముగానుండెను. ఆపక్షియాతనినట్లు పదిమైళ్లదూరము గొంపోయినది. చీఁకటి దట్టముగానున్నది. అదియొకచెట్టుమీఁద విశ్రమించినది. కమరల్జమాను చెట్టుక్రిందనాతఁడు నిద్రించినాఁడు. ఉదయమున మఱలనాతఁడు పక్షిని వెంబడించినాఁడు.

పదిదినము లట్లాతఁడు పక్షినివెంబడించి పోయి పోయి యొక యూరుచేరినాఁడు. అప్పటికి చీకటిపడియుండుటచే నొకముసలివాని యతిథియై యాతఁడు జరిగినదంతయుఁ జెప్పెను. ఆతనికథనాలకించి, యావృద్ధుఁడు " వత్సా! నీదీవి కేగుయోడ నాలుగుమాసములకుఁగాని

రాదు. అంతదనుక నాకతిథిగానుండు" మనెను. చేయునదిలేక కమరల్జమానా వృద్ధునియింటనే యుండెను.

అట బదూరా నిద్రనుండిమేల్కాంచి, వడ్డాణము, పతియు లేకుండుటగాంచి, సాయంకాలమువరకు నిరీక్షించెను. అతఁ డప్పటికిని రాకుండుటచే నామెఖేదమొందియు, ధైర్యమునవహించి, తానే పురుష వేషముధరించి, మఱల ప్రయాణసన్నాహమొనరించి, బయలుదేరి, కొన్నిదినములుపయనమొనరించి, యెబనీద్వీపముంజేరెను. కమరల్జమాను రాకనుగూర్చివిని, యెబనీద్వీప పరిపాలకుఁడగు అరమొరాసువచ్చి ఘనమైన స్వాగతమిచ్చెను. రెండురోజులు కమరల్జమాను రూపముననున్న బదూరా యారాజున కతిథిగానుండెను. వృద్ధుడగు నరమొరాసు కమరల్జమానుంజూచి "అయ్యా! నాకొమరితయగు హైటల్నిఫసునిచ్చిపెండ్లి చేయఁగోరిక జనించినది. నాకుఁగుమారులులేరు. ఆమెను బెండ్లిచూడి, యీరాజ్యమునుగూడ పాలించుకొనుము" అనెను—

బిదూరా యాలోచించి, యావృద్ధునికోరిక నిరాకరించుట మొఱకుతనమనిపించుకొనుననియుఁ దనపతి యామెనుగూడ సతిగా స్వీకరించుటకు వెనుదీయఁడనియు దలంచి, యందులకు సమ్మతించెను. మహావైభవముగ వివాహముఁ జేయఁబడెను. నాఁటిరాత్రి శయ్యాగారమునఁ బురుషవేషముననున్న బదూరా హైటల్నిఫసును గలిసికొని నిజవృత్తాంతమును దెలిపి, యారహస్యము నెవరికిని దెలియనీయవలదని చెప్పెను. అట్లేయనిపలికి హైటల్నిఫసు జాగ్రతగనుండెను. బదూరాయే యారాజ్యము పరిపాలించుచుండెను.

కమరల్జమానా వృద్ధునితో నివసించుచుండెనని పాఠకులకుఁ దెలిసియేయున్నది. నాలుగుమాసములు గడచినవి. ఎబనీద్వీపమునకుఁ బోవు నొకయోడ రెండుదినములలో వచ్చునని యావృద్ధుడు తెలిసి

కొని, కమరల్జమానుతోఁ జెప్పినాఁడు. అతఁడు కమరల్జమానునొక చనిపోయినవృక్షమును గొట్టుమనిచెప్పెను. ఆవృక్షముపై దెబ్బలాడి రెండుపక్షులు క్రిందబడినవి. ఒకపక్షి నోటగఱచుకొనియున్న వస్తువేదోపడినట్లు కనబడగా నాతఁడు వెళ్లిచూచెను. బదూరా వడ్డాణములోని రక్షరేకది. దానిని తీసికొని "ఇది శుభసూచకమే" యని తలంచి, కమరల్జమాను చెట్టునుగొట్టుట పూర్తిచేసెను. చెట్టు క్రింద బడిపోయెను. వడ్డాణము క్రిందపడెను. చెట్టుపడిపోయిన ప్రదేశమున నొకతలుపు కనబడెను. ఆతలుపునెత్తగా నొకసొరంగము కనబడెను. ఆతఁడాసొరంగమునఁ బ్రవేశించెను. నూఱుజాడీలనాతఁడు చూచెను. అన్నిటిలోను బంగారునాణెములుండెను. ఆ జాడీలనాతఁడు వృద్ధునకుఁ జూపి "తాతా! వీనిని నీవు దీసికొని హాయిగా కాలముగడపుకొను" మనెను.

ఆ ముసలివాఁడు "నాయనా! నీవు కష్టపడి కనుగొన్ననిధిలో నాకు వీసమంతైన వలదు" అనినాఁడు. కమరల్జమాను బలాత్కరించి యాతని కేబదిజాడీలనిచ్చి, మిగిలిన యేబదిజాడీలలోను నాణెములు కనబడకుండ నాలివుకాయలను గప్పినాఁడు. ఒకజాడీలో నాతడు వడ్డాణము రక్షరేకునుంచెను. వృద్ధునకాకస్మికముగ జబ్బుచేసెను. ఆ నాఁడే యోడవచ్చెను. కష్తానా జాడీల నోడలోనికిఁ జేర్చెను. వృద్ధునితోఁ జెప్పివచ్చుటకై యాతఁడు పరుగెత్తెను. వృద్ధుఁడు మృతి నొందియుండెను. కష్టసమయమున తనకాశ్రయమిచ్చిన వృద్ధుని కంత్యక్రియలు జరపకుండపోవుట కాతనికి మనస్కరించలేదు. త్వరితముగ నాయంత్యక్రియల ముగించుకొని యాతఁడు సముద్రతీరమునకుఁ బరుగెత్తిచూచెను. ఓడ యప్పటకి రేవునువిడిచి వెడలిపోయియుండెను. కమరల్జమాను విచారభరితాత్ముఁడై మఱల నోడయెప్పటికి వచ్చునో యని తహ తహ లాడుచుండెను.

ఓడ యెబనీద్వీపముఁ జేరెను. బదోరా పరివారముతో రేవు లోనికివచ్చి కప్తానునకుఁగబురంపి "నీయోడలోని సరుకు లేమి యున్నవి? ప్రయాణీకు లెందఱున్నారు?" అని యడిగెను. ఆతఁడు "ప్రభూ! కొందరు వర్తకులున్నారు. అదిగాక విగ్రహారాధకుల నగరమున నొక యువకుఁ డేబది ఆలివుకాయల జాడీలను బంపినాఁడు గాని అతఁడెంత సేపటికిని రానందున మేము బయలుదేఱి వచ్చినా" మనినాఁడు—

ఆలివుకాయలయెడ నామెకుఁ బ్రీతిమెండగుటచే నాజాడీలనామె వేయినాణెములకుఁగొని, "ఈ నాణెముల నాయువకునికీయు" మని కప్తాను కిచ్చెను. ఆమె యంతఃపురమునకుఁ జాడీలను బట్టించుకొని పోయినది. హైటల్నిఫసు ఆలివుకాయల నొకజాడీనుండితీయగా నందు బంగారునాణెములుండుట చూచి, బదూరాకుఁ జూపెను విస్మయపర వశురాలై వారాజాడీల నన్నిఁటినిఁ దిరుగఁబోసిరి. ఒకజాడీలో నామె యొడ్డాణముకన్పడకను గనబడెను. వెనువెంటనే బదూరా యాకప్తానును బిలిపించి "నీవు వెంటనే యావిగ్రహారాధకుల నగరమున కేగి ఆయువ కుని బంధించి గొనిర" మ్మని యాజ్ఞాపించెను. ఆమె యప్పటికిని బురుషవేషముననే యుండెను. కప్తానటులనే యానగరమున కేగి, కమ రల్జమానుతోఁజెప్పగా నాతఁడా యేబదిజాడీల నాణెములను బీదవారికి బంచిపెట్టి బయలుదేఱెను.

ఆతఁడు వచ్చినంతనే యొకగదిలో నుండనియమించి, హైటల్నిఫసుతండ్రితో నంతయుఁజెప్పి, తాను బురుషవేషముఁ దొలఁగించి, బదూరాయై కమరల్జమానును గలిసికొనెను. అతఁ డానందాతిరేకమున నామె నాలింగనమొనరించుకొనెను. బదూరా హైటల్నిఫసును భర్తకుఁ బెండ్లిచేసి, శుభదినమున బయలుదేఱి కల్దానుద్వీపముఁ జేరిరి. ఇరు వురు కోడండ్రనుజూచి షాజమాను మేరమీఱిన యానందమునొందెను. కమరల్జమాను రెండురాజ్యములకును బ్రభువై సుఖముగా జీవింప సాగెను.

---

# 31 ఎనిస్ ఎల్జలీస్ కథ.



సులేమాన్ ఎజయినీ అనునవాబు బసరాపట్టణమునకు ప్రభుండై ప్రజల దనకన్నబిడ్డలవలె జూచుకొనుచు, రాజ్యపాలనంబు జేయుచుండెను. అతడాశ్రితులయెడ పరమదయాపరుడై, అడగినవారలకు లేదనక ఉదారములగు బహుమానంబుల నొసంగుచు, యెల్లతావులయందు గొప్పకీర్తి నార్జించెను. దానంజేసి ప్రజలెల్లరును నానవాబును హృదయపూర్వకముగా ప్రేమించుచు, వానికెల్లవిధంబులగు శుభంబులను జేకూర్చుమని అల్లాను బ్రార్థించుచుందురు. ఇట్లితడు రాజ్యపాలనము గావించినయనంతర మీతనికుమారుడగు ముహమ్మద్ నవాబై ప్రజాపాలనంబు గావించుచుండ సులేమాన్ ఎజయనీ, కుమారునిపై రాజ్యభారమునుంచి, తాను విశ్రాంతి దీసికొనుచుండెను.

ఇట్లుండ నొకనాడు ముహమ్మద్ సర్వసామంతులతోడను, సేనానులతోడను, మంత్రులతోడను నిండుకొలువుండిన సమయంబున, ఎల్ ఫదిత అను ప్రధానామాత్యుని దిలకించి, "ఓమంత్రిశేఖరా! మహాసౌందర్యవతియు, సుగుణవతియు, రూపురేఖావిలాసములలో నెల్లరకంటెను నధికురాలునునైన యొకయన్నులమిన్నను నాకొరకై బానిసయంగడికిబోయి కొనిరావయును" అని వచింపగా నవాబుమాటలకు మంత్రి యిట్లనియెను.

"అయ్యా! మీకోరిక యంతసులువుగా కొనసాగునదికాదు. ఏమందురేని, మనకెల్లవిధముల నచ్చినసుందరాంగిని గొనవలయునని నధమపక్షము పదివేలబంగారునాణెములయిన నుండవలయును. మరియు నట్టి సౌందర్యవతి యంగడికివచ్చువరకును మనము వేచియుండవలయును. వీటికన్నింటికిని మించినది. మనయదృష్టము" అని వచించిన, అమా

త్యని పలుకులనాలకించిన నవాబు "మంత్రీ! నీవెట్లయిన నాకోరిక దీర్చకతప్పదు. ఇప్పుడే పదివేలబంగారునాణెములను గొనిపోయి యం గడియంతయు వాకబుజేసి రావలయును" అని యాజ్ఞాపింపగా మంత్రి నవాబుయాజ్ఞను శిరసావహించి, బొక్కసమునుండి పదివేలబంగారు నాణెములను గైకొని, యంగడికిబోయి, బానిసవ్యాపారముజేయు వర్త కులనెల్లర గలసుకొని, నవాబుగారి యభిప్రాయమును వారలకెరింగిం పగా, వారు, ప్రస్తుతమంతటి సౌందర్యవతు లెవ్వరును లేరనియు, అంగడికి వచ్చినప్పుడు వానికి దప్పక వర్తమానము నంపుదుమనియు చెప్పిరి. అంత మంత్రియు, నంగడికివచ్చిన యేసుందరాంగియు దన కెరుకలేకుండ విక్రయింపబడరాదని యావర్తకులను మరల హెచ్చ రించి, యీసమాచారమునే నవాబునకుగూడ నెరింగించి, పైకమును దనవద్దనే భద్రపరచుకొని యుండెను.

ఇట్లు గొన్ని దినములు గడచినయనంతరము బానిసవర్తకుడొకడు మంత్రిగృహమున కరుదెంచి, లోనున్నవానిని బిలచి "అయ్యా! తమకెల్లవిధముల నచ్చగల యొకయద్భుతరూపవతి యంగడికివచ్చినది. ఆమోహనాంగిని బోలినవారీ పృథ్వీతలంబున నుండబోరు, వేగిరమంగ డికి రండు. ఆమె యిపుడు వేలమువేయబడుచున్నది" అని వచింప గనే మంత్రి తమ నవాబుగారికోరిక నెరవేరుదిన మాసన్నమయినది గాబోలునని పరమానందభరితుడై, యావర్తకునితో నంగడికిబోయెను. అట వర్తకుడు చెప్పినట్లె యొక దేదీప్యమానమగు తేజస్సుతో వెలు గందు మోహనాంగి వేలమువేయబడుచుండెను. మంత్రి యామగువ యొక్క సుందరరూపమును, సౌకుమార్యమునుగని అద్భుతమంది ఆమె యెదన నవాబునకుగూడ నచ్చగల పసిండిబొమ్మయని నిశ్చయించి, యపుడుపాట యెంతలోనున్నదియు వాకబుజేయుగా, నదియప్పటికప్పుడే నారువేల బంగారునాణెములవరకును హెచ్చినట్లు తెలిసెను. వెంటనే

మంత్రి బానిసవర్తకునితో జెప్పి పాటనాపుచేయించి, యాబానిసయొక్క యజమానితో "ఓయీ! యిటువంటి మహాతేజోరాశిని అంగడిలో బెట్టి వేలమువైచి, యేల యీమెగౌరవమునకు గళంకము దెత్తువు? ఈమెను మానవాబుగారు కోరుచున్నారు. నీవు వెంటనే నాతో మా నవాబుగారికడ కరుదెంచి, బేరమును ఫైసలుజేసికొని, వెంటనే రొక్కమును గొనిపొమ్ము" అని చెప్పగా నావర్తకుడును మంత్రిమాటలకు సమ్మతించి, ఎనిస్ఎల్జలీస్ అను నాసుందరాంగితో నవాబుగారికడకు బోయెను. ఆబానిసకన్యయొక్క దివ్యమోహనవిగ్రహమును గనినంతనే నవాబుయొక్క కన్నులు మిఱుమిట్లుగొల్పెను. ఆమె నెంతవెలకైనను గొనుమని మంత్రితో రహస్యముగాజెప్పి, తానాతావునువీడి చనియెను.

అంతమంత్రి బానిసయజమానినిగని "ఓయీ! నవాబుగారు మనస్ఫూర్తిగా గోరుచున్న యీసుందరాంగికై యెంతరొక్కముగావలయునో చెప్పుము. పదివేలబంగారునాణెము లయిన సరిపడునా?" అనియడుగ, నావర్తకుడునవ్వి "అయ్యా! పదివేల బంగారునాణెములనిన యీకన్య నింతవరకు బెంచినందులకును, యీమెకు జెప్పించిన సంగీతవిద్యకయినను సరిపడవు. ఈమెకు గానవిద్యను గరపుటకే ప్రత్యేకించి పదివేల బంగారునాణెముల వెచ్చించితిమి. అయినను నవాబుగారీమెను గోరుచుండుటచే మేమీమె నుచితముగనే వారికి బహుమానముగా నీయవలసియున్నది, గాన మీరొసంగు పదివేల బంగారునాణెములను నేను సంతోషపూర్వకముగా స్వీకరించి, ఈసుందరాంగిని వారికి సమర్పింతును" అని వచింపగా మంత్రి వానికి అనుకొనినరొక్కమును వెంటనే యిచ్చివైచి, నవాబుగారికా వర్తమానము నెరింగింపగా, నతడు పరమానందభరితుడై వర్తకునిగని, "ఓయీ! మేమీకన్యకై

నీకోసంగిన పైకముతో దృప్తిపడితివా ?" యని యడుగ నాతడు "ప్రభూ ! మహానందముతో దృప్తిపడితిని. గాని నాదొక్కమనవి మాత్రముగలదు. అదేమందు రేని, సుకుమారియగు యీమోహానాంగి ప్రయాణపుబడలికచే మిగుల డస్సియున్నది. మీరిప్పుడే యీ మెతో సుఖంపగోరుట అనుచితము. గాన ఒకనెలదినముల వరకును నామెను ప్రత్యేకభవనమునందుంచి, ఆహారపానీయములందు దగు శ్రద్ధవహించి, యీమె స్వస్థతజెందినయనంతరము స్వీకరింతురుగాక ! యని నా ప్రార్థన" అని పలికిన వర్తకునిమాటలకు నవాబు తనసమ్మతిని దెలిపి, మంత్రినిదిలకించి, "అమాత్యపుంగవా ! 'ఈవర్తకుడు నుడువుచున్న దెంతయు సమంజసమయినది. గాన యీసుందరాంగిని యొకనెలవరకును, నీయింటియందుంచుకొని, సర్వవిధోపచారములను జేయించుచు, యీమగువకు స్వస్థతగలిగినపిమ్మటనే, నాస్వాధీనము జేయుము" అని వచించెను. ప్రభువాజ్ఞ ననుసరించి, మంత్రి ఎనిస్ కన్యను దనతో నిజభవనంబునకు గొనిపోయెను. అనంతరము బొనిస వర్తకుడును నవాబునకు సలామొనర్చి వెడలిపోయెను.

నాటినుండియు మంత్రి ఎనిస్సుందరాంగి నొక ప్రత్యేకభవనమునందుంచి, నవాబుగారికొరకై పదివేల బంగారునాణెములకు గొనబడిన యారూపవతికి బహుజాగరూకతతో నుపచర్యలగావించుచుండవలసినదని, నిజభార్యతోను, మరికొందరిపరిచారికలతోను జెప్పి యొప్పగించిన యనంతరమామంత్రి ఎనిస్కన్యనుగాంచి, "సుందరాంగీ ! నాకు ఆలీనురుద్దీను అను మన్మథాకారుడగు కుమారుడొక్కడు గలడు. ఇంతవరకు నాతనినిగాంచిన యేలావణ్యవతిగాని మోహపరవశురాలై యతనికి బాధాక్రాంతురాలు గాకుండనుండలేదు. కనుక నవాబుగారిచే బదివేలబంగారునాణెములకు గొనబడినసీవు నాకుమారుని గంటబడితి వేని గొప్పమోసము రాగలదు. నవాబుకోరిక నిరాశయగును. అం

దుచే నేనిపుడు నీకాజ్ఞాపించునదేమన, నీవెన్నడును నాకుమారుని గంట బడరాదు. నీమధురగానము నెన్నడును వానిచెవిని బడనీయరాదు. నీవెట్లో యీనెలదినములును రహస్యముగా కాలముగడపి నాకు మాట దక్కించి, నీవు మాటదక్కించుకొనుము" అని ఖచ్చితముగాజెప్ప, నామగువ ఆతడు చెప్పినట్లు చేయుటకంగీకరించి అల్లే అలీనురుద్దీనుని కంటబడకుండ గాలము గడపుచుండెను.

ఇట్లుండనొక్కనాడు మంత్రియొక్క అంతఃపురంబులోని స్త్రీ లెల్లరును నభ్యంగస్నానము గావించుకొనుటకై యేర్పాటుల గావించు కొనిరి. తొలుత ఎనిస్ జలకమాడి, అమూల్యములగు సిల్కుచీరను ధరించి, యొక ముఖమల్ రవికనుదొడిగికొని, మేలిముసుగు వైచుకొని, సర్వాభరణములతోడను భూలోకంబున నవతరించిన రతీదేవివలె నొప్పు చుండెను. అనంతరము మంత్రియొక్కభార్య జలకమాడ నేగుచు గొందరపరిచారికలను బిలచి, "పురుషులెవరయిన వచ్చినయెడల అంతః పురంబులోనికి వచ్చుటకు వీలులేదనిచెప్పి, ఎనిసెసుందరి అలీనురుద్దీనుని గంటబడకుండ బహుభద్రముగా జూచుచుండుడు" అనిచెప్పి తాను వెడలిపోయెను. కొంతసేపునకు అలీనురుద్దీను సర్వాలంకార భూషి తుండై జననిని జూడవలయునని అంతఃపురంబునకరుదెంచి "అమ్మగా రెక్కడ ?" అని అచటనున్న పరిచారికలనడుగ లోనున్న ఎనిస్ వాని యొక్క మధురకంఠము నాలకించి, "ఆహా! ఆకంఠమెవ్వరిదో, ఎంత మార్దవముగానున్నదో! కంఠస్వరమే యింతమృదువుగానుండ స్వరూప మెంతటి యద్భుతసౌందర్యముతో నలరారుచుండునో! ఆమన్మథాకా రుని జూడని నాజన్మమేల ?" అని యోజించి, మెల్లన తనస్థానమును వీడి, పరిచారికలున్న తావునకరుదెంచి, యట నిలచియున్న అలీను రుద్దీనుయొక్క మోహనాకారమునుగని ముగ్ధురాలై, "ఆహా! మంత్రికుమారుడైన అలీనురుద్దీను యితడేగాబోలు! ఇట్టి సుందర

రూపమును గలిగినవానిని నేనెందును, నెన్నడును జూడనయినలేదు. ఈసుందరాంగునిపొందు ననుభవించగల పుణ్యాత్ము లెవ్వరోగదా!" అని యోజించుకొనుచు నామె యుల్లె చేష్టలుదక్కి పోతబోసినబంగారు బొమ్మవలె నిలుచుండ, నామంత్రికుమారుండును నాతన్వియొక్క లావణ్యాతిశయంబులగని యచ్చెరువంది "ఓహో! రంభ యూర్వశుల మించిన యీయపురూపలావణ్యవతి యెవ్వరై యుండును? మాభవ నంబుననే యుండుటకు గతంబెద్దియైయుండు? ఏమయినను నీమెనొక్క సారి కౌగలించి ముద్దాడనిచో నామేన బ్రాణంబులుండుటకల్ల" అని యోజించి, వెంటనే యామగువను డాయంజని, పరిచారికలుండిరని యైన జంకక, ఎనిస్‌ను బిగ్గరగ కౌగలించుకొని, యామె నునుచెక్కు లపై ముద్దులవర్షమును గురిపింపదొడంగెను. అతనికరస్పర్శ తగులగనే నాలావణ్యవతియు నొడలుమరచి, అట్టిసుందరపురుషుని యాలింగనా సౌఖ్యభాగ్యము దనకెక నెన్నడును అబ్బదనిగాబోలు, దానును దన మృదుహస్తముల నాతనికంఠమునకు బెనివైచి, యురమోద్భుకన్ను లతో అలీనురుద్దీనుయొక్క బాహువల్లికలో కొరికి, యొకక్షణకాల మనిర్వచనీయమయిన మహాసౌఖ్యము ననుభవించెను. ఈదృశ్యమునం తను గాంచిన పరిచారికలు భీతిల్లి యెలుగెత్తి కేకలిడుచు అంతఃపురం బంతయు దిరుగాడజొచ్చిరి. వేరొకగదిలో స్నానముజేయుచున్న మంత్రిభార్య వీరిగల్లంతు నాలకించి, భయవిభ్రాంతయై, తడిబట్ట లతో ఎనిస్‌ఉన్న మందిరము బ్రవేశించెను. పరిచారికలు కేకలిడగనే మంత్రికుమారుడైన అలీనురుద్దీను ఎనిస్‌యొక్క బాహుబంధములను విడిపించుకొని పారిపోయెను. అతడు వెడలిపోయెనను విచారమున నా సుందరి నేలబడి విలపించుచు, 'హా! నామోహనాకారుడు నన్ను బాసి పోయెను. అతడులేని స్వర్గలోకమునయినను నేను తృణప్రాయ ముగా జూతును' అని రోదించుచునుండెను. అంతట ఖంగారుతో

నాప్రదేశమున కరుదెంచిన మంత్రిభార్య అట్లువిలపించుచున్న ఎనిస్ సుందరినిగాంచి, సంగతియేమి యనియడుగ, నాలావణ్యవతి యెట్టిసమాధానమునుగాని జెప్పక యట్లే విలపించుచుండెను. అంతట నటనున్న పరిచారికలు తమయజమానురాలితో నిట్లని చెప్పదొడంగిరి.

"అమ్మా! మీకుమారుడైన అలీనురుద్దీ నాతావున కరుదెంచి, మిమ్ములగురించి యడుగుచుండునంతలో నీ సుందరాంగి వానికంటబడెను. ఇరువురిచూపులును క్షణకాలమేమో మాట్లాడుకొన్నవి—నవ్వుకొన్నవి—ఆహ్వానించుకొన్నవి. ఆక్షణములోనె, యిరువురును మోహపాశబద్ధులై యొండొరులకౌగలించికొనిరి. మంత్రికుమారుడీసుందరాంగి యధరముపై ముద్దులవర్షమును గురిపింప దొడంగెను. అంత మంత్రిగారివలన మీకు మాటవచ్చునను భీతిచే మేము కేకలిడుచు మీరున్నతావునకు బరుగిడివచ్చితిమి. మా కేకలవినిన అలీనురుద్దీను యీమోహనాంగియొక్క బాహుబంధమునుండి తప్పించుకొని పారిపోయెను" అని వారు చెప్పుచుండునంతలో మంత్రికూడ నాతావున కరుదెంచి, జరిగినవృత్తాంతమునంతను పరిచారికలవలనవిని, కుమారునిపై క్రోధాతిరేకంబున "అయ్యో! దుర్మార్గుడెంతటిఘోరకృత్యము నాచరించినాడు! ఈవృత్తాంతము నవాబెరింగిన నో నాకంఠముపై తలనిలుచునా? నాకు పరమశత్రువును, కుటిలుడును నగునసేనాని ఇంతకుబదియంతలు గల్పించి నవాబునకుజెప్పి, నాపై పగసాధించి తీరును. నాకుమారుని మూలమున నాకు సర్వనాశనమును చేకూరినది. ఇక కుమారుడని వానిని దయతలంపరాదు. వాని నిపుడే నా నిశితకరవాలమున వధించి, నాయపవాదును బాపుకొందును. నవాబుగారికొరకై గైకొనిరాబడిన యీకన్యను దాకుటకు వానికెట్టి అధికారము గలదు" అని గర్జించుచుండ, వానిభార్య యిట్లనియెను.

"నాథా! క్రోధము నుపసంహరింపుడు. ఇపుడు జరిగిన ప్రమాదమేద్దియును లేదు. మన యంతఃపురంబున జరిగిన యీ రహస్యకార్యము బయలకెట్లు తెలియును. దాన మనకెట్టి యుపద్రవమును రాదు. వృథాగా కుమారుని దండించుట యవివేకము" అని చెప్పుచుండ ఎనిస్‌సుందరి వారలగని విలపించుచు, "అల్లాసాక్షిగా నేనా మోహనాకారుని ప్రేమించితిని. అతడులేని స్వర్గలోకమునయినను నేను తృణప్రాయముగా జూతును" అని పలికి మూర్ఛిల్లెను.

భార్య చెప్పినమాటలపై యప్పటికి గొంతవరకు క్రోధము నుపశమింపజేసికొని, మంత్రి యాతావునువీడి చనియెను. కాని, అలీనురుద్దీను తండ్రికిభీతిల్లి మూడుదినములవరకును గృహమునకు రాలేదు. నాల్గవదినము రాత్రిసమయమునమాత్రము అంతఃపురంబునకుపొచ్చి తల్లిచెంతనుండి, ఆహారపానీయముల గైకొనియెను. అతనితల్లి కుమారుని బుజ్జగించి "నాయనా! భీతిల్లకుము. నీవు ప్రేమించిన ఎనిస్‌సుందరి నీకు దక్కునట్లు చేతును. నీవనుదినమును యిట్లే రాత్రులందువచ్చి, నాయంతఃపురంబున విశ్రమించి పోవుచుండుము. కొన్నాళ్లవరకును నీతండ్రికంట బడకుము" అని చెప్పగా నాటినుండియు అలీనురుద్దీను తల్లిమాటల ననుసరించి, పగలస్తమానమును రహస్యముగా ఎందెందో దిరిగి, రాత్రులందుమాత్రము తల్లియంతఃపురంబునకుపొచ్చి వేకువనే లేచి తిరుగ వెడలిపోవుచుండెను. ఇట్లొకవారముదినములు గడచిన యనంతరమొకనాడు అలీనురుద్దీనుతల్లి తననిజనాథుడగు మంత్రినిగాంచి యిట్లనియెను. "నాథా! మనకుమారు డింతవరకును యిల్లుచేరడయ్యెను. అతడు మీకు భయపడి ఏయరణ్యముల పాలయ్యెనోగదా! ఎనిస్‌సుందరి నాతడు గాఢముగా ప్రేమించియున్నాడు. ఆమెయు నతనిని మనసార వలచియున్నది. అట్టి పరస్పర ప్రేమపాశబద్ధులగువారిని మనము హింసించుటతగదు. ఆమెను నవాబుకొరకై పదివేలబంగారు

నాణెములకుగదా కొంటిరి. ఆరొక్కమును నేను నాస్వంతపైకములో నుంచి యిచ్చివైతును. ఈకన్యను మనవాని కొసంగివేయుము. లేకున్న వారిరువురునుగూడ జీవించుటకల్ల" అని చెప్పగా మంత్రి యామె యేర్పాటున కెంతోకష్టముమీాద అంగీకరించెను.

ఆరాత్రి అలీనురుద్దీను అంతఃపురంబునకరుదెంచినపుడు మంత్రి వానని బుజ్జగించి, యెట్టిభయమును బొందవలదనియు, ఎనిస్కన్యను గూడి యామెతో సుఖంపవచ్చుననియు జెప్పగా నపుడలీనురుద్దీను ఆనందమునకు మేరలేకపోయెను. ఈశుభవార్త నాలకించిన ఎనిస్సుందరియు బరమానందభరితురాలయ్యెను. వారిరువురును దమకోరికను నెరవేర్చిన అల్లాను బెక్కుతెరంగుల గొనియాడిరి.

నాడు మొదలుకొని అలీనురుద్దీను ఎనిస్కన్యతో మహానందమున వివిధక్రీడలయందు గాలముగడుపుచుండెను. నెలదినములు గడచెను. కాని నవాబీసుందరాంగినిగురించి యడుగుటయే మరచిపోయెను అడిగినయెడల నిజవృత్తాంతము నెరుకపరచి, తనభార్యచే నొసంగబడిన పదివేల బంగారునాణెములను నవాబునకు సమర్పింపవలయునని మంత్రి వేచియుండెను. కాని యెన్నాళ్ళకును నా నవాబు ఎనిస్కన్యనుగురించి యడుగుటలేదు. మంత్రియు నామెమాట దలపెట్టక మిన్నకుండెను. ఇట్లొకసంవత్సరము గడచెను. మరుసంవత్సరమున మంత్రియు, వాని భార్యయుగూడ నీలోకమును విడచి పరలోకమున కరిగిరి. నవాబుగారి యాస్థానమున మరియొకరు మంత్రిపదవిని స్వీకరించిరి. అప్పటికిగూడ నవాబు ఎనిస్కన్యయొక్క వృత్తాంతమును జ్ఞప్తికి దెచ్చుకొనలేక పోయెను.

అలీనురుద్దీను ఎనిస్కన్యతోగూడ మహాభోగంబుల ననుభవించుచు, మిత్రులకును బంధువులకును, విందులకును, బహుమానముల

కును అమితద్రవ్యమును ఖర్చుపెట్టుచు, మెల్లరచేతను బొగడ్తలందు చుండెను. అట్లనవసరముగా రొక్కమునంతను వినియోగించిన ముందు ముందు చిక్కులు పడవలసివచ్చునని ఎనిస్ అలీనురుద్దీనుతో నొకటి రెండుసారులు చెప్పెను. కాని అతడామెమాటల లక్ష్యముజేయక “ బ్రతికియున్నన్నాళ్ళును—ఏదినమునకాదినమే ఆనందమునే ప్రధానముగా జూచుకొనవలయును ” అని సమాధానము జెప్పెను.

అప్పటినుండియు క్రమముగా అలీనురుద్దీను గృహములోని ద్రవ్యమంతయు మిత్రులకొరకై వినియోగింపబడిపోయెను. ఇంట నొక్కకాసు రొక్కముకూడ లేనిదినములువచ్చెను. ఇక అలీనురుద్దీను యింటనున్న వస్తువులనన్నింటిని క్రమముగా నమ్మివైచి వేడుకలకై వెచ్చించెను. గొన్నాళ్లకా వస్తువులుగూడ ఆకరై అప్పులు పెరిగి పోయెను. వాటినిదీర్చు నుపాయము లేదుసరిగదా, ఆ భార్యాభర్తల కిరువురకును దినుటకు బూర్తిగ తిండికూడ లేనంతటి దరిద్రదినములు సంప్రాప్తించెను. అంత ఎనిస్ యొకనాడు దీనవదనముతో గూర్చొని, అప్పులబాధ పడలేక విచారించుచున్న అలీనురుద్దీనుగాంచి “ నాథా! ఇట్లు విచారముతో గుందుచు గూర్చొనిన కార్యముకొనసాగునా ? మనమెంతకాలమీరీతిగా దారిద్ర్యము ననుభవింపగలము. నీయప్పులన్నియు నెట్లుతీరును ? వెనుకముందు లారయక యింటనున్న రొక్కమునంతను వెచ్చబెట్టుకొంటిమి. అప్పుల దీర్చకున్న మనసంసార మల్లరి పాలగును. గాన నన్నంగడికిగొనిపోయి యెంతవెలకైన దెగనమ్మి, నీయప్పుల దీర్చుకొనుము. బ్రతికియుండినయెడల మనమెన్నటికైన దిరుగ అల్లాయనుగ్రహమున గలసికొనగలము ” అని కంట దడిపెట్టుకొనుచు నుడువ, అలీనురుద్దీను దుఃఖమునాపుకొనజాలక “ ప్రేయసీ ! నీవంటి మహాసాధ్విసమ్ముకొని జీవించుటవ్యర్థముకదా ! నీయెడబాటును నేను సహింపగలనా ? ” అని విలపించుచునన, వానిభార్య “అయ్యో!

ప్రస్తుతము నీవు చేయవలసినకార్యమంతకు మించినది లేదు. నీయడబాటును నేనుమాత్రము సహింపగలనా? కాలమునను సరించికదా కార్యముల జక్కబెట్టుకొనవలయును. కాన ఇక తడవుసేయక నన్నంగడికి గొనిపోయి విక్రయింపుము" అని చెప్పగా అలీనురుద్దీను, అప్పులు దీరు వేరుమార్గమునుగానక, ఎనిస్‌ను బానిసయంగడికి గొనిపోయి పాట ప్రారంభించెను.

ఆ దేసమయమున నామార్గముగుండా నవాబుసేనానియు, మంత్రియొక్క పరమశత్రువునయిన గాఫూర్ పోవుచు, నటనొక సుందరాంగిని అమ్మజూపుచున్న మంత్రికుమారునిగాంచి, "ఆహా! ఈసౌందర్యవతి యెవ్వరు? ఆమె ఈదరిద్రున కెట్లులభించెను? వీడు నాకు శత్రువయిన మంత్రికి గుమారుడైన అలీనురుద్దీను. నాపగ దీరకుండగనే మంత్రి చచ్చెను. వానికుమారుడైన వీనిపైనైనను నాపగసాధించుకొనుటకు మంచియవకాశము లభించినది. వీని నెట్లయిన మోసగించి, వీనికొక్క దమ్మిడీయైన ముట్టకుండ ఈసుందరాంగిని దోచుకొనిపోవలయును" అని నిశ్చయించి, అలీనురుద్దీనునుగాంచి "ఓయీ! పాటనాపుడు. ఈమెను మా నవాబుగారికై కొనవలయును. ఎంతకమ్మెదవు?" అని యడుగ అలీనురుద్దీను "పదివేల బంగారువానెములు" అని చెప్పగా నాసేనాని "సరె. యిటనేయుండుము. ఇక పాటపాడవలదు. నీవడిగిన రొక్కమునుదెచ్చి, యీమెను గొనిపోదు" నని చెప్పి, తనలో "మంత్రికుమారుడయిన అలీనురుద్దీను ఎక్కడనుండియో యొకసుందరాంగిని దొంగిలించితెచ్చి, యంగడిలో అమ్ముచున్నాడని నవాబుగారితోజెప్పి, తొలుత వీరిరువురనుబంధించి గొంపోదుగాక!" అని అనుకొని వడిగా దివాణమువైపు బోయెను.

అతడు వెడలిపోయినవెంటనే ఎనిస్ అలీనురుద్దీనును గాంచి, "నాథా! అతడే దుర్మార్గుడును, మోసగాడునునయిన సేనానిగఫూరు.

అతడు తిరుగవచ్చువరకును మనమిందేయుంటిమేని తప్పక మోసము జరుగును. అతడేదోవంకబెట్టి మనలనిరువురనుగూడ బంధించి గొని పోవును. దాన నీకొక్కకాసయిన రాదుసరిగదా, మనమిరువురము గూడ కారాగారమున నుండవలసినవారమగుదుము. గాన త్వరపడుము. మన మెక్కడికయిన పారిపోదము " అని హెచ్చరింపగా, అలీను రుద్దీను అంతకుముందే దుర్మార్గుడయిన సేనానియొక్క దుండగముల నెరిగియున్నవాడగుటచే, అప్పుడు ఎనిస్ చెప్పినదానిలో అణుమాత్ర మయినను అసత్యములేదని గ్రహించి, వెంటనే ఆమెతో నెవరును జూడనిసమయమున నొకసందుమార్గమునుబట్టి పారిపోయెను.

అట్లు పోయిపోయి, అలీనురుద్దీను ఎనీసులు సముద్రతీరముజేరు కొనిరి. అదేసమయమున నొకయోడ బాగ్దాదుపట్టణమునకుబోవ విడున బడుచుండెను. ఓడయజమాని యోడపై నిలుచుండి "ఇంకను నెవర యిన నేమయిన దెచ్చుకొనవలసియుండినను, ఎవరితోనయినను వార్తలు జెప్పవలసియున్నను వెంటనే జెప్పిరండు—ఓడలంగ రెత్తివేయబడు చున్నది " అని హెచ్చరించుచుండెను. ఆమాటల నాలకించిన అలీను రుద్దీను తడవుచేయక ఎనిస్‌సుందరితో నాయోడ బ్రవేశించి, యొక మూల కూర్చొనియెను. వెంటనే యోడయొక్క కట్టుత్రాళ్లు విప్పబడి లంగ రెత్తివేయబడెను. తెరచాపకొయ్యలు ఎత్తబడెను. గాలి అను కూలముగా నుండుటచే నాయోడ రెక్కలువిప్పుకొన్న పక్షివలె వాయువేగమున బర్విడసాగెను.

అట సేనాపతియైన గఫూరు గొందర రక్షకభటులతో బానిస యంగడికివచ్చి, యట అలీనురుద్దీను, బానిసకన్య లేకుండుటనుగని నిర్విణ్ణుడై, వారలకొరకు పట్టణమంతయు వెదకించెను. వారలనెందును గానక చివరకు నిరాశుడై యూరకుండెను.

నియమితకాలమున కోడ బాగ్దాదుపట్టణము చేరుకొనియెను. ఓడయజమాని అలీనురుద్దీనుయొక్క దీనావస్థనెరింగి వానియొద్ద పైకము గొనకయే యోడదింపివైచెను. అంత అలీనురుద్దీను యోడయజమానునకు దమకృతజ్ఞతనుదెలిపి, ఎనిస్‌సుందరితో బాగ్దాదుపట్టణములోనికి బోయి, దానిసౌందర్యమునకును, విలాసమునకును నచ్చెరువందుచు నట దాముశాంతముగా గాలముగడుపవచ్చునని నిశ్చయించి, ఒక మిల్లులో నాభార్యాభర్తలిరువురుగూడ చెరియొక యేబది వెండినాణెములకును పనికిగుదిరిరి. నాడు మొదలుకొని వారిరువురును దాముకష్టించి తెచ్చిన పైకముతో సుఖజీవనము చేయదొడంగిరి. అలీనురుద్దీనుయు ఎనిస్‌సుందరియు నాసామాన్యకష్ట జీవనములోనె సంతృప్త హృదయములతో గూడుకొనియుండుటచే దేవేంద్రవైభవము ననుభవించుచున్నట్లుగా భావించి, అనురాగదంపతులై మహానందముతో గాలముగడపదొడంగిరి.

---

# 32 కోడదాడు.



హారాన్‌నగరాధీశుఁడైన రాజు సంతానహీనుఁడై యుండెను. ఆసంతాపమాతని చిత్తమును వ్యథితమొనరించెను. అతని కొకనాఁటి రాత్రి స్వప్నమున నొకవృద్ధుడు గోచరించి "వత్సా! నీభక్తికెంతయు సంతసించితిని. నీవు రేపటియుదయమున తోటలోనికివచ్చి, దానిమ్మపండు నొకదాని నొలిచికొని, నీకిష్టమైనన్నిగింజలను దిను" మనియెను. ఆరాజు మఱునాఁడు తోటలోనికివెళ్లి, దానిమ్మపండు నొలిచి యేబదిగింజలను దినెను. ఆరాజున కేఁబదిమంది భార్యలుకలరు. ఆతనిభార్యలలో నలుబదితొమ్మండుగురు గర్భవతులైరి. ఏబదియవ భార్యయగు ఫిరోజా గర్భవతికానందున, భగవదనుగ్ర హామెపై

లేదని నిశ్చయించి, యామె నురిఁదీయుమని యాజ్ఞాపించెను. మంత్రి వలదని వారించి, యారాజుతమ్ముఁడగు సమరియాదేశాధిపతికడ కామె నంపి, యామెకు సంతానముఁ గలిగినచోఁ దనకుఁ దెలియఁజేయుమని లేఖ వ్రాసెను. ఫిరోజా యాదేశముఁ జేరి గర్భవతియై యొకసుతుని గాంచెను. అతనికి కొడదాడను నామకరణ మొనర్చిరి. ఆశిశువు దినదిన ప్రవర్ధమానుఁడై సకలశాస్త్రములను జదివెను. శరలాఘవము, కత్తిసాము మున్నగునవి నేర్చుకొని యాతడు మహావీరుఁడయ్యెను.

ఒకనాఁడాతఁడు తల్లితో "అమ్మా! నాతండ్రి శత్రురాజులచే బెదరింపఁబడుచున్నాఁడని వినియుంటిని. నేనేగి యాశత్రువులఁ బరిమార్చివత్తు" ననెను.

"నాయనా! ఆరాజేంద్రుఁడు నిన్నును నన్నును రమ్మని యింకను గబురంపలేదాయెను. మఱికొన్నాళ్లుండు" మని యామె పలికెను. అతఁడు వినక "అమ్మా! నేను మారుపేరు చెప్పి, యాస్థానమున నేదైన చిన్నయుద్యోగమునఁ బ్రవేశింతును. నా తెలివితేటలచే నాతండ్రిని మెప్పింతు" ననియెను. అతఁడామె యనుజ్ఞగొని పినతండ్రితో వేటకుఁబోయి వత్తునని చెప్పి, తిన్నగా హారాను దేశమునకుఁ బోయి, రాజును సందర్శించి తానీజిప్టుదేశస్థుఁడనని, సైన్యమున నొక యుద్యోగమిమ్మని యడిగెను. అతఁడు చిన్నపటాలమునకు నాయకుఁడుగ నియమింపబడెను. శత్రురాజులు దండెత్తిరాగా భయంకరమగు సంగ్రామము జరిగెను. ఆయుద్ధములో కొడదాడు తన శౌర్యప్రతాపములఁ బ్రదర్శించి, సైన్యములనుఱుమాడి, శత్రువులనోడించెను. రాజునకాతఁడు ముఖ్యుఁడాయెను. అతని సౌజన్య మెల్లరి నాకర్షించెను. అచిరకాలములో కొడదాడు దేశములో నంతటిశూరుఁడు, సుగుణాఢ్యుని లేడని ప్రఖ్యాతిగాంచెను. రాజు తన నలుబదితొమ్మండుగురు కుమా

రులు యల్లరిగాఁ దిరుగుచు మూర్ఖులై యున్నారని యెఱింగి, కొడ దాదుయాజ్ఞ లేనిదే యేపనియుఁ జేయరాదని వారలశాసించెను. అది వారికి మిక్కిలికష్టము కలిగించెను.

“ మనపై నధికారముచేయుటకు వీఁడెందుండి వచ్చినాఁడని యసహానమునొంది, యాతనిపై రాజున కెట్లయిన యనుగ్రహము తప్పునట్లు చేయఁదలంచి, యొకయుక్తిబన్నిరి. సోదరులు నలుబది తొమ్మండుగురును వేఁటకుఁబోయివత్తుమని కొడదాడుతోఁజెప్పి, వెడలి పోయిరి. నాలుగుదినములవఱకుఁ దిరిగిరాక యూరకున్నచో రాజునకు దప్పక కొడదాడుపై గోపమువచ్చునని యూహించి వారు వనమునకు బోయిరి.

రెండుదినములైనను బుత్రులు వేఁటనుండి తిరిగిరాకపోవుటచే రాజారాటమునొంది “ వారముదినములలోగా నాకుమారులు తిరిగి రానిచో నీవురితీయబడుదు ” వనెను. కొడదాడు వెంటనే నాయ ఘుఁడై హయమునెక్కి వారలను వెదకుచుఁబోయెను. అతఁడనేకము లైన పల్లెలను వెదకి వెదకి విసిగి వేసారెను. అతఁడొక మైదానముచేరి, యొక మేడనుచూచెను. ఆమేడమీఁదనుండి యసాధారణలావణ్యవతి యగుకన్య కొడదాడునుజూచి “ ఓరాకుమారా ! నీవేల నిచ్చటికివచ్చి తివి ? ఇది రాక్షసుని సౌధము. చాలమంది రాకుమారులు బంధితులై యున్నారు. నేనుగూడ నీతనిఖైదీనై యున్నా ” ననియెను. ఇంతలో నెటనుండియో హాహాకారము లొనరించుచు రాక్షసుఁడువచ్చెను. కొడ దాడు ధైర్యముతో నాతనినెదుర్కొని పోరాడి, యారక్కసుని జంపి వైచెను. ఆమె యాసౌధద్వారమునకున్న తాళపుఁజెవి నీవలకు గిర వాటువైచెను. కొడదాడు ఆమెనుజూచి “ నీవెట్లిచ్చటికివచ్చినా ? ”

వని యడిగెను. తాను కైరోసుల్తాను కుమార్తెననియు, కోట శత్రువులవశముకాగా దాను బానిసగాఁ నొకరికి విక్రయింపఁబడితిననియుఁ దనకు దిక్కెవ్వరును లేరని చెప్పెను.

ఇరువురి హృదయములు నేకీభవించెను. ఇంతలో నేడుపులు వినబడగా, నతడులికిపడెను. ఆమె యాఖైదీలై యున్న రాకొమరులేడ్చు చుండిరని చెప్పెను. తానామెను బెండ్లియాడెదనని చెప్పి, యాఖైదీలున్న యాగారముఁ దెఱచెను. రాకుమారులందరు నీవలికివచ్చిరి. అతఁడు తన సోదరులు నలుబదితొమ్మండుగురను బిలిచి, తాను వారి సోదరుఁడనని, ఫిరొజా తనతల్లియని చెప్పెను. రాక్షసుఁడు కొల్లగొని యుంచిన పదార్థములతో విందుచేసెను. అంత నాయేబదిమంది సోదరులు దమరాజ్యమునకు బయలుదేఱిరి. ఆరాత్రి వారొకచో మకాము చేసిరి. ఆమకాములో నలుబదితొమ్మండుగురు సోదరులును కొడదాడు రాజగునని భయపడి యాతనిని వధింప నిశ్చయించుకొని, కత్తులతోఁ బలుచోట్ల గాయములఁజేసి, పాఱిపోయిరి. అతనిభార్య వైద్యుని గొని వచ్చుటకై యశ్వమునెక్కి సమీపముననున్న యూరికిఁబోయి తిరిగి వచ్చునరికి, కొడదాడా మకాములో లేకుండెను.

రాజపుత్రులేగి తండ్రితోఁ దాము వేటకుఁబోయి తిరిగివచ్చితి మనిచెప్పిరి. కొడదాడు విషయమై తమకుఁదెలియదనిరి. కొడదాడును గానక యాతనిసతి మిక్కిలి విచారింపసాగెను. ఆవైద్యుఁడామె నూఱడించి, యాకుత్సితులైన సోదరులపైఁ బగఁదీర్చుకొనుట కుహరాను దేశమునకుఁ గొంపోయి, యొకసత్రములో బసచేసెను. అతఁడు కొడదాడు తల్లియగు ఫిరొజా యానగరమునకు వచ్చెనని విని, యామెతో జరిగినదంతయుఁ జెప్పఁదలంచెను. ఆమె మసీదునకుఁ బోవునపుడా వైద్యుఁడు కూడవెళ్ళి, యామెతో కొడదాడును మిగిలినసోదరులు

గాయపఱచిరనియు, నాతఁడుప్రేమించి పెండ్లిచేసికొనినయువతి సత్రములో నున్నదని చెప్పెను. ఆమె కోడలినింటికి రప్పించెను. కొడదాడు తన తనయుడని యెఱింగి, మిగిలినవారు చేసిన దుర్ణయమునకుఁ గినిసి, వారినందఱను గారాగృహమున బంధింపుమని మంత్రితోఁ జెప్పెను. కొడదాడెప్పటికిని దిరిగిరాకుండుటచే నతఁడు మృతినొందియుండునని నిశ్చయించిరి. అట్టి శౌర్యధనుఁడు, సద్గుణవిలసితుఁడునగు తనయుని చావునకుఁ గారణభూతులైన యా కులకంటకుల నురిదీయుమని మంత్రితోఁ జెప్పెను. ఇంతలో గూఢచారులువచ్చి శత్రుసైన్యము నగరమును ముట్టడించినదని తెలిపెను.

కోడదాడు లేనందులకు మిక్కిలి విచారించి యారాజేంద్రుఁడు ససైన్యముగఁ దానే నగరమున కావలయున్న శత్రువుల నెదుర్కొనెను. శత్రుసైన్యము బలమధికముగా నుండెను. హారానురాజు తనకోటమి తప్పదనుకొనెను. ఇంతలో నొకసేనవచ్చి, హారానురాజుపక్షమూని సంగ్రామమొనరించి, శత్రువుల నోడించెను.

హారానురాజు తనకుమారుఁడగు కొడదాడె యానూతనసేవకు నాయకుఁడని గ్రహించి, యాతని నాలింగనమొనరించుకొని యంతఃపురమునకుఁ గొంపోయెను. కుటిలాత్ములగు నలుబదితొమ్మండుగురను జంపవలసినదని యారాజు మంత్రితోఁ జెప్పగావిని, వలదనివారించి, కొడదాడు తన యౌదార్యముచూపెను. ఫిరోజా కుమారునిఁజూచి, యానందభరితాత్మయయ్యెను. కొడదాడు పట్టాభిషిక్తుఁడాయెను.



## —: పరిశిష్టము :—



ఈరీతిగా షహర్జాది వేయిన్నొకరాత్రులు కథలఁదెలిపినది. అప్పటికామెకు సుతుఁడుదయించెను. కథలఁజెప్పుట ముగిసినతరువాత నామె పతినుద్దేశించి "నాథా! వేయిన్నొక్కరాత్రులు మీకు మహదానందకరములైన కథలఁ దెలిపితిని. ఇంక నాకిపుడేమియు విచారము లేదు. నన్నువధించుటకింక మీరు నౌకరుల కాజ్ఞాపింపవచ్చు" ననెను.

ఆసుల్తాను "ప్రేయసీ! వలదు. నీకథలవలన నాకు స్త్రీజాతి పైఁగల యవిశ్వాస మంతరించినది. నీవు నామనస్సు రంజింపజేసితివి. నిన్ను నేను జంపను—" అనెను.

సుల్తాను, షహర్జాదితో నానందముగ జీవిత శేషమును గడపెను.

సమాప్తము.



రాజమండ్రి: శ్రీసత్యానందప్రెస్సందు, ముద్రింపఁబడినది—1935.

